దేశావలోకనగ్రంథమాల : ౧.

# హంపీ - విజయనగరము.

గ్రంథకర్త:

వారణాసి శ్రీనివాసరావు,

ఎం. ఎ. (ఆనర్సు), ఎల్. టి.



ప్రకాశకుడు:

విశ్వనాథ సత్యనారాయణ, ఎం. ఏ.



బెజవాడ: ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల యందు

క. కోదండరామయ్యగారిచే ముద్రింపఁబడియె.

1933.



[ వెల రు 1—8—0.

# అంకితము.



మమ్మతి ప్రేమతో పెంచి

మాకై కడవరకు పరితపించి

గతించిన

మా తండ్రిగారగు

**వారణాసి రామమూర్తిగారికి.**



# విషయసూచిక.

# హంపీ-విజయనగరము.

## 1వ ప్రకరణము.

## కిష్కింధ

మనదేశమునఁ బాడువడిన పట్టణములనేకములున్నవి. వాని మహత్తు పౌరాణికమో చారిత్రికమో కాని రెండును గలిసియుండలేదు. అట్టి మాహాత్మ్యసమ్మేళనము నేటి బళ్లారి జిల్లాలో హాస్పేట కీశాన్యముగ నేడుమైళ్ళదూరమున దుంగభద్రానదీతీరమందు 'హంపి' యని వ్యవహరించు చున్న మునుపటి విజయనగరపట్టణమునందు కలదు. ఆపట్టణ ముండిన ప్రదేశములో గొంతభాగము కొన్నివేలసంవత్స రములకిందట రామాయణమందలి కిష్కింధాపురమై యుం డెను. దాని యశస్సున మరొక విశేష మున్నది. ఆపట్టణము నేలిన మహనీయు లెప్పుడును నాత్మమతధర్మములకు బలవద్వి రోధులైనవారితో బోరి, స్వమతధర్మములను గాపాడుకొని దేశసేవజేసిరి. విజయనగరపట్టణము హిందూమతధర్మసంర క్షణమున కేర్పడినదని దానిచరిత్రవలన దెలియుచున్నది. కిష్కింధాపురసంస్థానోద్దేశ మట్టిది కాకపోయినను, దాని యేలికలలో నగ్రగణ్యుడగు వాలి యట్టి మహాకార్యమును గావించె నని, రామాయణమును జక్కగ బరిశీలించినచో, మనకు విశదము కాకపోదు.

శ్రీమద్రామాయణము కేవలము శ్రీరామ పురాణము కాదు. అది యార్యులు భరతదేశమున జాలవర కెట్లు వ్యాపించి యాక్రమించుకొనిరో సూచించెడు గ్రంథము. ఆర్యావర్తము నంతయు నాక్రమించుకొనిన తరువాత తమ సంఖ్య యధికమగుటవలననో ఆర్యావర్తము నాక్రమించుకొనునా డనార్యజాతులతో దటస్థించిన కలహాములు సమాప్తి కాకనో లేక స్వమతధర్మములు అనార్యమతధర్మములకన్న మిన్న లను నమ్మక ముండి యవ్వాని ననార్యజాతులలో వ్యాపింపజేయుట పరోపకారమని తోచి వానిని వ్యాపింపజేయనెంచిరో, యెందువలననో వారు వింధ్యపర్వతములను దాటి దక్షిణమున కేతెంచిరి. అట్లు వచ్చిన యార్యులకు నాయకులగు నగస్త్యాది మహామునులు వింధ్యకు దక్షిణమున నున్న యరణ్యములలో దమయాశ్రమముల నిర్మించుకుని యందుండి యార్యమతధర్మప్రచారమును సేయుచుండిరి. అట్టి ప్రచారమున కవకాశము కలుగుటకై ఆర్యుల కనార్యుల పట్ల నున్న జాతిద్వేషము చాలక, అనార్యులు మతహీనులని, ధర్మహీనులని, నరమాంసభక్షకులని, వాడుచుండిరి. అట్లనుట సహజమే కద! క్రైస్తవపాదరీ లట్టిమాటలు చెప్పియేకద క్రైస్తవమతమును లోకములో నందందు వ్యాపింపజేసిరి! అంతవరకు బోనేల - మనము మంచివారమని యేర్పరచుట కొకపక్షము ఎదిరిని చెడ్డవారని వాడుటేకద! కాకుండిన సర్వశాస్త్రవేత్తలు, శివపూజాధురంధరులు, అపూర్వనాగరకతాశోభితులు నగువాలిరావణా ద్యనార్యజాతినాయకులు, దురాత్ములు, దు

ర్మార్గులు నెట్లగుదురు? దాని న్యాయాన్యాయము లేమైనను ఆర్యు లట్టి ప్రచారమునకు గడంగిరి. అనార్యులలో గొందరు, సంపాతి, జటాయువు వంటివార లాప్రచారము నంగీకరించి యార్యమతమును స్వీకరించిరి. కొందరు విరాధునివంటివారు కొంత పెనుగులాడి లొంగిపోయిరి. మరికొందరు, సుగ్రీవుడు, హనుమంతుని వంటివారు ఆర్యులబలసాహసములను ధైర్య స్థైర్యములను మెచ్చుకొని, వారిమైత్రివలన దమ కొదవనున్న లాభములు గుర్తించి వశ్యులైరి. ఇంకను గొందరు, వాలివం టివారు లొంగుటకన్న తమమతధర్మసంరక్షణము చేసికొనుచు మ్రిందుటే మంచిదని నిశ్చయించుకొని చివరవరకు హోరా హోరిగ బోరి మృతినొందుచుండిరి. ఎట్టకేలకు, ఆర్యులు బుద్ధి బలసంపన్ను లగుటవలన, నందరను సణగద్రొక్కి, నిజమత ధర్మములను సేతుశీతనగపర్యంతము వ్యాపింపజేసిరి.

పై జెప్పిన యార్యప్రచారమునకు జిక్కిన యొకయనా ర్యనాయకునికథ, చిక్కక నిరోధించి మడసిన మరొక యనా ర్యనాయకునికథ, యాకిష్కింధాపట్టణమున జరిగినవి. పితృ వాక్యపరిపాలనము సేయుకొరకు భార్యాసోదరసమేతుడై ప్రవాసమున కేతెంచిన శ్రీరామునకు, శూర్పణఖా నిమిత్తమున, రాక్షసేశ్వరుని దండకారణ్యమండలాధిపతు లగు ఖరదూషణాదులతో మహాసంగ్రామ మాయెను. అందు రామలక్ష్మణులు జయమందిరి. ఆవార్త విని, యట్టి శూరా వతంసుల జయించుటకు బహిరంగయుద్ధరంగముకన్న మాయ యే మంచిసాధన మని తలపోసి, రాక్షసనాయకుడగు రావణా

సురుడు మాయలేడిని కల్పించి, రామలక్ష్మణుల నెడజేసి, తాను దపసివేషము ధరించి, వారు లేనితరి సీత నపహరించెను. సీతాన్వేషణమునకై బయలుదేరిన రామలక్ష్మణులు, జటాయువువలన సీతజాడను దెలిసికొని, వచ్చి వచ్చి కిష్కింధా పాంతముల బ్రవేశించి, యాయరణ్యమున దిరుగుచుండిరి. రాజ్యమునకేకాక భార్యకై కూడ నన్నతో బోరాడి పారిపోయి, మతంగమహాముని యనుగ్రహంబున, మతంగపర్వత సమీపముననున్న ఋశ్యమూకముపై నిజానుచరులతో డాగియున్న సుగ్రీవు డాయార్యసోదరుల జూచి, వా రెవరో యెరిగిరమ్మని, తనమంత్రియగు హనుమంతునంపి వారివృత్తాంత మతని వలన విని, వారిని కలిసికొని, తనఘోషను వారికి వినిపించె. శ్రీరామసుగ్రీవు లిర్వురు నొకవిధమైన విపత్తులో బడియుండుటంజేసి, వా రిర్వురకు మైత్రి యవలీలగ బొసగె. వాలిని వధించి తార నిప్పింతునని రాముడు, సీత నన్వేషింపించి శత్రుసంహారమున దోడ్పడుదు నని సుగ్రీవుడు, అగ్నిసాక్షిగ, బరస్పరము వాగ్దానములు చేసికొనిరి.

రావణునివంటి బలశౌర్యసంపన్నుని సందిట బెట్టుకొని సప్తసముద్రములలో గ్రుంకి వార్చివచ్చి నిజనగరోద్యానమున బడవేసి ఫక్కున నవ్విన వాలివంటి శూరాగ్రేసరున, కిర్వురు రాజకుమారు లేతెంచి సుగ్రీవున కభయమిచ్చి రను వార్తవలన నేమాత్రము భయముకలిగియుండదు. రాక్షసేశ్వరు నట్లు పరిభవించినవానికి, వానిమండలేశ్వరుల జయించిన శూరుల శౌర్య మెంత? దుందుభికబంధమును మీటిన

మాటకు, సప్తతాళములనొకవాలమ్మున గూలనేసె నను మాటకుమాత్రి మేల జంకవలె? తన్నెదిరించినవాని బలము తరుగు ననుమాట వాలి యెరుగడా? అది యెరిగికాని, యెరుగక యధర్మవృత్తితోగాని, చాటుననుండి దెబ్బగొట్టగూడదా? "ఎక్కడిమాట! అనార్యులధర్మప్రవర్తకులని వారి నార్యులు సర్వదా నిందించుచుందురు. అట్టివారికి సంబంధించినవాడు, వారిలో సూర్యవంశసంభూతుడు నగు శ్రీరాము, డధర్మ మొనరించునా?" యని వాలి యెంచియుండనోపు.

జరిగినది మన మెరుగుదుము. శ్రీరాము ప్రేరితుడై సుగ్రీవుడు వాలితో బోరుచుండె! అప్పట్టున జెట్టు మాటు చేసికొని శ్రీరాముడు వాలిని వధించె! ఎట్లైన నేమి? వాలి సంహారమైనది; తనశపథము నెరవేరినది. సుగ్రీవునకు దారతో బాటు కిష్కింధారాజ్యము లభించినది. కార్యార్థియైన శ్రీరామునకు గావలసినది యైనది. సీతాన్వేషణ మిక తప్పక జరుగును. భూమిపై బడియున్న వాలి నిందించిన నేమి, తనకున్న కీర్తితో, దనపట్ల రావణునకుగల భయముతో నాతో మైత్రి చేసికొనిన, గేవలసందేశమాత్రమున సీతను రప్పించి యిప్పించనా యని మొత్తుకొనిన నేమి? తరువాత శ్రీరామపక్షపాతు లందరు వాలివధవలన శ్రీరామోదాత్త లక్షణమున బడిన మచ్చను మాపుటకు, తమ పాండిత్యప్రకట ములను జింపి తుంపులు చేసికొనిననేమి? అంతేగాక, శ్రీరాముడు వాలితో గలిసిన సీత అనాయాసముగ దొరకిన దొరకుగాక, ఆర్యనిరోధమునకు గంకణము గట్టుకొన్న వాలి

యాటంక మెట్లు సమయును? జరిగినకథ చూడుడు. వాలి మృతితో గిష్కింధలో నార్యప్రచారమున కభ్యంతరము నశించెను. కిష్కింధాధిపతి మిత్రుడాయెను. అతని బలముల సహాయముతో రావణుని రాజ్యమున నున్న కొన్నికోట్ల రాక్షసులు హతులైరి. వాలియే మిత్రుడైన రాక్షససంహార మెట్లు జరుగును? రఘురాముడు రాక్షసాంతకు డెట్లగును?

సత్యాన్వేషణమే చరిత్రోద్దేశమని గమనించినచో రామాయణమందలి కిష్కింధాకాండకథాసార మిది. కాని మే మిందు రామాయణకథావిమర్శనము చేయుటలేదు. ఇప్పుడు పాడుపడియున్న యీకిష్కింధకుగల మాహాత్మ్యమును విచారించుచున్నాము. "ఆప్రదేశము అనార్యజాతులు ఆత్మమతధర్మములు ఆర్యప్రచారముచే నశింపకుండ గాచుకొనుటవలన బవిత్రమైనది" యని చెప్పుచున్నాము. ఇక నార్యపక్షపాతుల కాస్థలము శ్రీరామలక్ష్మణనివాసముచే బవిత్రమైనది. ఏవిధమున జూచిన నది మహాస్థలమైనది. మరియు నందున్న విరూపాక్షలింగమును శ్రీరాముడే ప్రతిష్ఠించె నందురు. ఆనమ్మకముతో నది పుణ్యక్షేత్రముకూడ నైనది. ప్రతిదినము తైర్థికు లనేకులు వచ్చి విరూపాక్షస్వామిని బూజించి, ఆస్వామియాలయమునకు దాపున నున్న మాతంగపర్వతము నెక్కి, దానికుత్తరమున నెదురుగ నగపడు ఋశ్యమూకమును జూచి, తుంగభద్రను దాటి, వాలిపట్టణమైన యానెగొంది కేగి, పంపాసరోవరమును శబరిగుహలను దర్శించి, తిరిగి వచ్చి, నింభాపురమున కేగి వాలికాష్ఠమం

దలి బూదెను మోముల భక్తితో ధరించి పోవుచున్నారు. అట్లు సంచరించు త్రైర్థికుల కందందు శిథిలములైన దేవాలయములు, సౌధములు, కోటగోడలు, పాడువడ్డ ఘంటాపథములు గాన్పించును. అవి యేమని యందలి వారిని బ్రశ్నించినచో "అది పాడూరు" అని యచ్చతెనుగుతో జెప్పుచు, "ఆయూరేల పాడైన దన, ముందెన్నడో అగ్నివర్షము కురిసి పాడైన" దని వారు జవాబిచ్చుచున్నారు. ఆయూరే విజయనగరము. ఇక నాపట్టణము నెవ్వ డెవ రెందులకు స్థాపించిరో విచారించి, యది యిపు డెట్లున్నదో చూచెడు సందర్భమున మును పెట్లుండి యుండెడిదో యూహించుకొందము.

## 2 వ ప్రకరణము.

# విజయనగరము.

మహారాష్ట్ర కాకతీయ భల్లాణ సామ్రాజ్యముల క్రింద సుఖముండిన దక్షిణహిందూస్థానముపై 1293 సంవత్సరమున నొకనాడు, తురుష్కవాహిని హఠాత్తుగ బడి, యోరుగల్లువరకు బ్రవహించి యాగినది. తరువాత 1303, 1306 సంవత్సరములలో నింకొకసారి దారిచూచుకొని, 1310 వ సంవత్సరమున మరల బయలుదేరి, దక్షిణమున మధురానగరము వరకో, చివరవరకుబోక యాగ నేల యని రామేశ్వరమువరకు, ప్రవహించి విరమించినది. ఈప్రవాహములో బైమూడు

సామ్రాజ్యములు కొట్టుకొనిపోయినవి. ఆనీరము తీయునాటికి దక్షిణహిందూస్థాన మంతయు జిన్నచిన్న స్వతంత్రరాజ్యములతో నిండియున్నది.

సామ్రాజ్యములమార్పు దక్షిణహిందూస్థానమునకు క్రొంత కాదు. దానిచరిత్ర యంతయు క్షణభంగురసామ్రాజ్య సంస్థాపనములతో నిండియున్నది. క్రీ. వె. 600 మొదలుకొని 1200 సంవత్సరములవరకు, చళుక్యులు, పశ్చిమచాళుక్యులు, తూర్పుచాళుక్యులు, రాష్ట్రకూటులు, మహారాష్ట్రులు, కాకతీయులు తలాయొక షుమారు రెండువందల సంవత్సరము లీసామ్రాజ్యక్రీడ సలిపిరి. కాని యాక్రీడాధోరణి యెట్టిదైనను ప్రజలకుమాత్ర మేలాటి యుపద్రవము సంభవించలేదు. ఆరాజు లందరు రాజు ప్రజలకై యుండునను నీతిని మన్నించి, సర్వదా ప్రజాక్షేమము నారయుచు, ప్రజామత ధర్మరక్షణమును గావించుచు వ్యవహరించిరి. తురకలదండయాత్రతో నా పరిస్థితులు మారిపోయినవి. వారికి విగ్రహారాధన మసహ్యమగుటవలన, హిందూదేవాలయములను నేలమట్టము నేయుచు, దేవతావిగ్రహముల బగులగొట్టుచుండిరి. కొన్నిచోట్ల బలవంతముచేసి, మరికొన్నిచోట్ల ధనవాంఛను బ్రేరేపించి, కొంత హిందూప్రజను మహమ్మదీయమతములోగలుపుచుండిరి. హిందూకులకాంతలకు జెప్పరానిపరాభవము నేయుచుండిరి. హిందువులకు భరింప శక్యముకాని చట్టములతో, నీతితో ప్రభుత్వమును సాగించుచుండిరి. వారిదౌర్జన్యమున నశాంతి ప్రబలి, దేశములో వ్యవసా

యాదివృత్తులు క్షీణించెను. వారిధాటి కాగలేక కొన్నిపట్ల పట్టణములకొలది ప్రజలు వలసలుపోయిరి. ఇట్టి పరిపాలనము ఉత్తరహిందూస్థానమున నూరు సంవత్సరములకు పైబడ జరిగినది. దానిసడి యాత్రికులవలనను, అందుండ దుర్భరమై యిందే తెంచిన రాజవంశజులవలనను, రణము నొక వృత్తిగ నవలంబించిన యోధులవలనను జిలవలు పలవలై, దక్షిణ హిందూస్థానమున వ్యాపింపజొచ్చెను. వా రెప్పుడు వచ్చి పడుదురో యని భీతిల్లుచున్న దక్షిణాత్యులకు పైదండ యాత్రలు తటస్థించినపు డెట్లుండియుండునో యూహించుకొనగలరు.

వానిలో మూడవదండయాత్ర, వట్టి దండయాత్ర కాక మహమ్మదీయపరిపాలనానుభవమును దక్షిణదేశమునకు గలిగించెను. మాలిక్ కపూర్ తిరిగి పోవునపుడు, మధురానగరములో నొక సేనను సర్దారును విడిచిపోయెను. ఢిల్లీపట్టణ మతిదూర మగుటంబట్టి, కొలది కాలములో నాతడు తిరుగబడి స్వతంత్రుడాయెను. నాటనుండి, యతనివంశమును హరిహరుని కుమారు డగుకంపనుడు, సాళ్వమంగు, నంతరించు వరకు, నా మధురసుల్తానులు హిందువులను బెట్టిన బాధ లింతింతనరాదు. దేవాలయముల బగులగొట్టుట లోనగు మామూలు ధోరణి నటుండనిండు. ఒక పర్యాయము కొన్ని వందలమందిని కట్టుకొయ్యలకు గట్టించి, వారి భార్యల యెదుట, వారిని చెప్పరాని బాధల బెట్టించగా దాను చూచితి నని, యట్టి క్రూరుల నెందును జూచి యెరుగ నని యొక

మహమ్మదీయపరియాణీకుడు వ్రాసియున్నాడు. భల్లణ సామ్రాజ్యమునకు మిగిలిన బల మాసుల్తానులతో బోరు టతో దరిగిపోయె. అట్టి బాధలు ఎప్పుడెప్పుడో తటస్థించున వి కాక యనుదినానుభవము లని కూడ యతడు చెప్పియున్నాడు.

ఉత్తరహిందూస్థాన వార్తలకు మధుర సుల్తానుల క్రౌర్యములకు దిక్కుతోచక కొట్టుకొనుచున్న వారికి 1326 సంవత్సరమున ఢిల్లీసింహాసనమెక్కిన మహమ్మదు బీన్ తుఘలక్ కోరికలు, యూహాపోహలు మరింత భయదాయకము లయ్యె. అసలు మహమ్మదీయప్రభువులే విపరీతప్రవృత్తులు. వారిలో నెల్ల మహమ్మద్ బీన్ తుఘలక్కతి విపరీతస్వభావుడు. అట్టి పండితుడు అట్టిమూర్ఖుడు అట్టిజ్ఞాని అట్టియజ్ఞాని అట్టిద యామయుడు అట్టికౄరచిత్తుడు మరొకడు లోకములో నెన్నడును నేసింహాసనము నధిష్ఠించియుండలేదు! దేవత్వము రాక్షసత్వము సరిపాళ్ల సమ్మేళనమై యాచకప్రవృత్తిరూపమును ధరించినవి. అట్టివాడు రాజ్యమునకు రాగానే పూర్వము మధురవరకు వ్యాపించిన మహాసామ్రాజ్యముపై నధికారము చలాయించుట కుద్యోగపడెను. ఆయూహ ననుసరించి సుల్తాను వారు వ్యవహరింపదొడగిరి. ఎంతవెర్రివాడైనను సుల్తాను పట్టుదలగలవాడు తనయభిమతమును నెరవేర్చుకొనుట కెట్టి యాటంకమును బాటించువాడుకాడు. అట్టివాని నిశ్చయముల విని దక్షిణదేశస్థులు ఉత్తరదేశములోవలె దమదేశములలోగూడ మతధర్మములకు ముప్పు వాటిల్లనున్నదని భయ

పడిరి. సుల్తానువారి ప్రయత్నము నెట్లైన నడ్డగించవలె నని కొందరు బుద్ధిమంతులకు దోచెను.

అయిన దాని నాగు టెట్లు? దానికి తగినసాధన మెం దున్నది? ఇదివర కుండిన మూడుసామ్రాజ్యములు నశించి నవి. వాని స్థానే మరి యేసామ్రాజ్యము నేర్పడలేదు. ఆసా మ్రాజ్యముల సామంతు లందరు స్వతంత్రులైరి కాని, వారిలో నొకడు కూడ, నుత్తరహిందూస్థానము నంతయు బరిపాలించు సుల్తానుతో బోరగల శక్తిమంతుడు లేడయ్యె. దానికి తార్కా ణగ సుల్తాను రాజ్యమునకు వచ్చినప్పటినుండియు నానెగొంది రాజగు జంబుకేశ్వరరాయలకు సుల్తానుసేనలకు జరుగుచున్న పోరే కనబడుచుండెను. ఢిల్లీకి నింతదూరముగ వచ్చి యుద్ధ ము సేయుచున్నను, నాసేనల నోడించుశక్తి జంబుకేశ్వరునకు లేదాయె. దానితో బాటు సుల్తానుపట్టుదలకూడ నాయుద్ధ ములో వేద్యమగుచుండె. సుల్తానుకు బాహుద్దీన గుర్షాస్పు అను మేనల్లుడొక డుండెను. మేనమామకు దనపై నాగ్రహ ము రా, నతడు నిజమరణముకన్న మరొకటి తనమామను శాంతిపరుపలే దని యెరిగి, ప్రాణములపై తీపిచే పలాయను డయ్యెను. అతనిని, పట్టుకొని వచ్చుటకు సుల్తా నొకమహా సైన్యము నంపెను! బాహుద్దీన పారిపోయివచ్చి దక్షిణదేశ రాజుల శరణు వేడెను. ఆసైన్యధాటికి వెరచి యొకరివెనుక నొకరు శరణొసంగశక్తిలే దనిరి. అతడు చివరకుఆనెగొందిరాజు శరణుచొచ్చెను. శరణాగతత్రాణపరాయణుడగు నాభూవరు డాతనికభయమిచ్చి,యతనికై వచ్చిన సేనలనాగి,వానితో బోర

నారంభించెను. ఆపోరు కొన్ని సంవత్సరములు జరిగినది. 1334సం వత్సరమునాటికి జంబుకేశ్వరునిబలము తరుగజొచ్చెను. ఇంతకు లొంగకుండుట కాగ్రహించి, సుల్తాను మరొకసన్నాహము చేసి, తానే స్వయముగ నానెగొందిపై నెత్తివిడిసెను. బహిరంగరణము లాభించదని తోచి, జంబుకేశ్వరుడు, శరణుజొచ్చినవానిని కాపాడుడని దక్షిణమున నున్న యొకభల్లాణరాజుకడకంపి, వలయు సామగ్రిని గూర్చుకొని, యానెగొంది ద్వారములబిగించి ముట్టడికి సిద్ధపడియె. మహమ్మదు తుఘలక్ మును వున్న సేనతో దనతో దెచ్చిన సేనను గలిపి, యానెగొందిదుర్గమును ముట్టడించెను. కొన్నిమాసములలో జంబుకేశ్వరుని బలము జీర్ణించుటయు, కోటలోనిసామగ్రి సన్నగిల్లుటయు దటస్థించెను. ఇకపోరి ప్రయోజనము లేదని గ్రహించి రాణివాసము తురకలచేతులలో నవమానముసెంది మడియుటకన్న నగ్గి నురికి మడియుట గౌరవ మని వారికి చితి నురుక నాజ్ఞయిడి, యది జరిగినవెంటనే ద్వారములు తెరచి, మిగిలిన సేనతో వీరావేశము దాల్చి మహమ్మదీయసేనలపై బడి ఘోరయుద్ధముచేసి స్వర్గమున కేగెను. జంబుకేశ్వరు డప్పటి పూర్వ సామ్రాజ్యసామంతు లందరలో నగ్రగణ్యుడు. అట్టివానికే సుల్తానుని నిరోధించుపని దుర్లభమైనపుడు మిగిలినవారి సంగతి తడవనేల? కావున మనుష్యయత్నములో నిరోధము తలపరాని పని. అది దైవికమో యనునట్లుగ వేరొకవిధమున లభించెను.

జంబుకేశ్వరుడు మృతినొందినంతనే తురక లానెగొందిలో బ్రవేశించిరి. అందలిగుహాలను ధనముకోసము వారు

వెదకునపుడు, ఒకదానిలో వారి కాస్థరుమనుష్యులు చేజిక్కిరి. వారిలో హరిహరుడు బుక్కడు నని కొంచె మీఁదేరిన వా రిర్వురు, ఇర్వురు రాజకుమారులు, మిగిలిన యిరువురు కడునృద్ధులగు రాజవంశజులు. మొదటియిర్వురు సోదరులు - రాజులు - సంగమవంశజులు - ఓరుగల్లుప్రతాపరుద్రునియొద్ద కొలువుండి, వారిమరణానంతర మానెగొందికి వచ్చి, జంబుకేశ్వరుని కొల్వులో గోశాధ్యక్షులుగ నుండిరి. ముట్టడి ముగించబోవుకాలమున రాయ లాసోదరుల రావించి, తమ క్షేమసంభవించినను రాజకుమారులను గాపాడెద మని వారివల్ల వాగ్దానము గొనెను. చివర కారాజుప్రక్కన బోరి మృతినొందవలసినవారయ్యె, జేసినబాస ననుసరించి, యాకుమారు లిర్వురను వెంటబెట్టుకొని సందడితీరినవెనుక యొంద్రైన జననెంచి, యాగుహలో డాగియుండిరి. సుల్తాను ఆసోదరులను రాజకుమారులను ఖైదీలుగ వెంటకొని ఆనెగొందిపరిపాలనమున కొక రాణువను మలిక్ నాయబ్ అను సర్దారును నియమించి ఢిల్లీకి బోయెను. ఢిల్లీ చేరినంత నే, జంబుకేశ్వరుని కుమారులకు మహమ్మదీయమతము నిప్పించెను.

ఇట నానెగొందిలో గొంతకాలము సర్వము శాంతిముగ జరిగెను. మలిక్ నాయబుఅధికారమును గౌరవించి చుట్టుప్రక్కలవారు అణగియుండిరి. అట్లుండియుండి యొకనాడు హఠాత్తుగ నొకపెద్ద హిందూసేన వచ్చి యానెగొందిని ముట్టడించెను. ఆ సేనధాటి కాసర్దారుపరాక్రమము ప్రయత్నము, నెంతమాత్రము ఫలింపవయ్యె. అందుమీఁద నతఁడు

ముట్టడించినవారి బలమును దెలియజేయుచు, నేమియాజ్ఞ యని సుల్తానువారికి కబురంపెను. ఆ వర్తమానమును వినినంతనే తుఘలకు వజీరులసభ జేసి, మంత్రాలోచనము చేసెను. ఆ సభలో "దక్షిణదేశీయులు స్వతంత్రాభిలాషులు పరుల పరిపాలనమునకు లొంగరు. జంబుకేశ్వరుని కుమారుల నంపుద మన్న వారు మహమ్మదీయు లగుట వారి యేల్గడ హిందువుల కిష్టముండదు. హరిహరు నానెగొందికి సామంత రాజుగ నేర్పరచి యతనితమ్మునకు మంత్రిత్వ మొసగి యిర్వురను వెంటనే యంపుటకన్న నందలిసేనను సర్దారును గాపాడుటకు సామ్రాజ్యగౌరవమును నిలబెట్టుకొనుటకు వేరొండుమార్గము లేదు." అని సలహా వచ్చెను. సుల్తాను దాని కియ్యకొని తగు నధికారపత్రములనిచ్చి యా సోదరుల బంపివేసెను. వారు వచ్చి జరిగిన యేర్పాటుల నెరిగించినంతనే హిందువులు ముట్టడిని డించిరి. సర్దా రానెగొందిని హరి హరున కొప్పగించి, ఢిల్లీ కేగెను. హరిహరుడు, బుక్కడు, ఆనెగొంది పరిపాలనము సేయదొడగిరి.

పై విషయములు జరుగుచున్న కాలమున, నా ఆనెగొంది ప్రాంతమందలి యరణ్యములో, నేటి హంపీ శ్రీ కోదండరామ స్వామివారి యాలయమున కెదురుగనున్న చక్రతీర్థముకడ, మాధవు డను నొకభూసుర శ్రేష్ఠుడు తపమాచరించుచుండెను. ఆయనతండ్రి మాయణుడు: తల్లి శ్రీమతి: యింటిపేరు సాయణవారు: భారద్వాజగోత్రజులు: బోధాయనసూత్రి జులు. యజుశ్శాఖవారు: వారు వేదములకు భాష్యము వ్రాసి

కీర్తినహించిన మహాపురుషులు. వారిప్రతిభ వైదికమునసే గాక, లౌకికమునగూడ భాసిల్లుచుండెను. వారికి తెలియని నీతి, ధర్మము, విషయము నున్నవాయని యనుమానింపదగిన మహానుభావులు. వారు జరుగుచున్న యావద్విషయములను వినుచు జూచుచు, వానినిగురించి యోజించుచు నుండిరి. స్వదేశమతధర్మభక్తిపరాయణులగు నామహనీయులకు మహమ్మదీయోపద్రవము నాగుట కొకటే మార్గ మగుపించెను. తాము తపమాచరించుచున్న స్థలము సర్వవిధముల మహత్తు కలదని, అందు ఆర్యధర్మసంరక్షణ మాదర్శముగ గల పట్టణ మొక దానిని నిర్మించి, దానిపేరిట నొకసామ్రాజ్యము నేర్పరచిన, నాసామ్రాజ్యమే హిందువుల గూడగట్టి యాయాదర్శమును గాపాడగల దని తోచెను. వారికిని, ఆనెగొందిని పరిపాలించుచున్న హరిహరునకును మైత్రియుండెను. అందువలన వారిసలహామీద హరిహరుడు ఆనెగొందికి దక్షిణమున, 1336 వ సంవత్సరమున మరొకపట్టణమును నిర్మించ బూనుకొనెను. కాని, పట్టణనిర్మాణము, మాటలతో, నూహలతో జరుగువిషయము కాదు. దాని కెంతో ధనము కావలసియుండును. ఆనెగొందిధనాగారము లన్నియు నాటికి రెండేండ్లకిత్రింద తుఘలక్ వశమైయుండుటవలన, నం దేమియు మిగిలియుండదు. హరిహరుడు రాజ్యమునకు వచ్చి యొక్కసంవత్సరమే మైయుండుటవలన, దగిన ధనమును గూర్చుట కవకాశమును లేదు. అయిన విద్యారణ్యునివంటి మహనీయు డుండ నేమికొంత? ఆయన మంత్రశక్తిచే నేడుగడియలు సువర్ణవర్ష

మును గురిపించెనని, అట్లురాలిన ధనముతో హరిహరుడు పట్ట
ణమును గట్టించుటేకాక, దానిని కొన్నిపెట్టెలతో దన బొ
క్కసములో దాచగలిగెనని, పెద్దలందురు. ఆమాటలు విశ్వసిం
పనివారు సర్వశాస్త్రవేత్తయగు నామహాపురుషునకు గను
లెం దుండినది కనుగొనుశక్తిగాని, పూర్వులు ధన మెందు
భూస్థాపన మొనరించియుందురో దానిని గురుతించుశక్తిగాని
యుండెనని, నేడు హేమకూటము నా జను పర్వతముననో,
మరొకచోటనో, యొకగనిని గాని లేనియెడ నిక్షిప్తధనమును
గాని యా యనఘుడు హరిహరునకు జూపించియుండ వచ్చు
నని, యనుకొందురుగాక. పై రెండు విధములుగూడ పురా
ణములని యెంచువారు "మాయాదర్శ మిది, దానిని నెరవేర్ప
మాకు దోచిన మార్గమిది, అందుల కింత ధనము కావలసియు
న్నది, అది యందరకొర కేర్పడబోవుచున్నది కాన నందరు
సహాయము సేయవలె"నని హరిహరవిద్యారణ్యు లిర్వురు, తగు
రీతిసందేశము లంపిన, జుట్టుపక్కలనున్నహిందూప్రభువులు
ద్రవ్యసహాయము జేసియుందురని యైన నెంచెదరు గాక.
ఏదియో యొకవిధముగ గావలసినధనము సమకూరినది. పట్టణ
నిర్మాణమునకు ముహూర్తమును బెట్టిరి. ఇది ముహూర్తమని
గుర్తించి యంత్రమును దయారుచేసి పునాది తీయవలె. యం
త్రనిర్మాణము ముహూర్త నిర్ణయము నొక్కరే యొనరించి
నచో రెండు పనులు సేయు తొందరలో ముహూర్తవేళ తప్పిన
దప్పవచ్చును. అందులకై రెండుపనులకు నిర్వు రుండుట మంచి
దని విద్యారణ్యు లెంచి ముహూర్త మిది యని నిశ్చయించి

తమ కెరింగించుటకై యొక మహాపండితుని కాశీపట్టణము నుండి రప్పించెను. ఆ కాలములో గడియారములు, నేటి వాని వంటివి, తూచా తప్పకుండ వేళను నిర్ధారణ చేయగలిగినవి లేవు. కాలనిర్దేశము నక్షత్రగమనమును బట్టి చేయుచుండిరి. యంత్రనిర్మాణమునకు ముహూర్తము తెల్లవారుఝామున బెట్టిరి. కాశీపండితు డొక పర్వతము నెక్కి నక్షత్రపరీక్ష సేయుచు ఆ వేళకు నొక శంఖ మూదునట్లు, విద్యారణ్యులు తామ్రలోహమును గరగించి సిద్ధముగ జేతబట్టుకొనియుండి, యా శంఖధ్వానము వినబడినంతనే లోహమును యంత్రపు టచ్చులో బోయునట్లు, ఏర్పాటు చేసిరి. తెల్లవారుఝా మైనది. శంఖధ్వానము వినిపించినది. స్వామివారు లోహము నచ్చులో బోసిరి. పోసిన కొన్నినిమిషములకు మరొక శంఖ ధ్వానము వినిపించెను. కొంతసేపటికి పండితుడు రా వారిది రెండవశంఖధ్వాన మని తేలినది. చల్లారిన యంత్రమును పరీ క్షించగా దానిలో రెండుంబాతిక బీటికలు పడియుండెను. విద్యారణ్యులు కాశీపండితును, నాల్కలు కొరికికొని, "యీ పట్టణము రెండుంబాతిక శతాబ్దముల కెక్కువకాల ముండ"దని నిశ్చయించుకొని, యంత్రమును స్థాపనజేసి పుర నిర్మాణమును బ్రారంభించిరి. మొదటి శంఖ మొకకొత్త బిచ్చగా డొత్తినదట!

ఆ పట్టణము విద్యారణ్యులవారి ప్రేరేపణముచే స్థాపిం చినదికావున దానికి దొలుత విద్యానగర మని పేరు బెట్టిరి. రెండవహరిహరరాయలనాడు ఏకచ్ఛత్రాధిపత్యముగా

సామ్రాజ్యమును స్థాపించినపుడు దానిని విజయనగరమని మార్చిరి. యంత్రిమండలి బీటికల సూచన ననుసరించి, 1336 సంవత్సరము మొదలుకొని 1565 సంవత్సరమువరకు, నాపట్టణము, దానిపేరిట నేర్పడిన సామ్రాజ్యము, హిందూధర్మ సంరక్షణముచేసి, తురకలను కృష్ణానదిని దాటిరాకుండ నాపి, సంస్థాపకుల యాదర్శమును సఫలముచేసినది.

## 3 వ ప్రకరణము.

## నైసర్గిక మాహాత్మ్యము.

విద్యారణ్యస్వామివా రన్నివిధముల మహాత్తుగల స్థలమని గుర్తించి యందుపట్టణమును గట్టుటకు హరిహరున కాజ్ఞాపించెనని చెప్పియుంటిమి. అన్నివిధముల ననుటలో బురాణమాహాత్మ్యమున్నది. వాలిసుగ్రీవాదిమహాబలశాలురజన్మభూమియని, శ్రీరామలక్ష్మణనివాసముచే బవిత్రమైనదని, శ్రీరామప్రతిష్ఠితవిరూపాక్షక్షేత్రమని, యామహనీయ నెరిగియుండకపోలేదు తా నేర్పరచిన యాదర్శమును గొనసాగించుటకు వలయుసామగ్రి బలశౌర్యములు. అట్టి బలశౌర్యసంపద శ్రీరామాయణశూరవర్యు లుండిన మహాక్షేత్రమునగాక మరొకచోట నెట్లు లభించగలదు? ముందందు వ్యవహరించువా రట్టి పుణ్యభూమిలో నుంటిమని, ఆమహానుభావులతరువాత నీదేశసంరక్షణమున కేర్పడితిమని

యనుకొనుటతో వారికెట్టి శౌర్యోత్సాహములు గలుగును? అట్టివియన్నియు గమనించియే స్వామివా రందు పురనిర్మా ణము నాజ్ఞాపించిరి.

అంతేగాక, దుర్గనిర్మాణమునకు గావలసిన నైసర్గికబల మాచోటనున్నది యింకొకచోట నుండుట దుర్లభమని వారు గుర్తించి యుందురు. ప్రదేశము చాలవరకు కరినిర్భేద్యపర్వత మయము. ప్రాంతములు కొన్ని యామడలవరకు మరుభూము లు: భూమి అతిసారవంతము: ఉత్తరమున బ్రవహించుచున్న తుంగభద్రానది అభేద్యపర్వతపంక్తులతో గట్టనికోటగోడ వై, తగిన సదుపాయము నేర్పరచిన పక్షమున, బట్టణము నకు, దాని ననుసరించుకొని బయలుదేరు పల్లెలకు, దగిన నీటి వసతి నవలీలగ నొసంగగలదు. ఇంకను వలయుచో రెండు మూడులోయల కడ్డముగ గట్టలు బోయించిన, గొన్ని వేల యెకరములు సేద్యము చేయించగల తటాకము లేర్పడగలవు. ఇక కట్టడముల కనుకూలించురాళ్లు ఏరుకొనునంతటి వీలుగ నెల్లెడల లభించగలవు. పైవిషయముల నాప్రతిభానంతు డతి సులభముగ గ్రహించి యుండును. గ్రహించి యానైసర్గిక బలము నెట్లుపయోగపరపించినది విచారింతము.

ఆప్రదేశము, డక్కనులోని పర్వతములు, చేతులు చేతులు కలుపుకొని పట్లుపట్టుచున్నచోటు. అందలి పర్వత ములు కొన్ని బృహద్గండోపల శోభితములు; మరికొన్ని, పురా ణయుగమందలి వానరవీరులు, తమ యుద్ధసామగ్రిని పేర్చి యుంచిరోయనన, ట్లున్నతముగ బెద్దపెద్దగుండ్లను గుట్టలు

బోసిన ట్లుండును. వానిమధ్యలనున్న లోయలను జదరము చేసిన, జక్కని వీథులకు దగిన ప్రదేశము లగును. ఆపర్వతము లాచేతులు కలుపుకొనుటలో రెండువలయములుగా నేర్పడి యున్నవి. వెలుపలి వలయపు మధ్య రేఖ షుమారు 30 - 40 మైళ్ళుండును. లోపలివలయపు-చిన్న చిన్న వలయములనావరించిన వలయము - మధ్య రేఖ, షుమారు పదిమైళ్ళు వెడల్పు. లోపలి వలయములో నందం దున్న సందుల కడ్డముగ గోడలగట్టి దిటవుపరచి లోయలలో నగరమును గట్టిరి. హంపీకి దాదాపు పదునాల్గుమైళ్ళ దూరమున దుంగభద్రానది కానకట్టగట్టి, యాసీరమును బట్టణావరణములోనికి దెప్పించి, జనోపయోగమునకు, వ్యవసాయమునకు వాడుకొనిరి.

ఇట్లు కట్టనెంచినచోట వారికి రమారమి పదిమైళ్ళు వెడల్పు పండ్రెండుమైళ్ళుపొడవుగల భూభాగము లభించగా, దానిలోని లోయలను జదరముచేసి వీథుల నేర్పరచిరి. ప్రతి వీథికి నెదుట నొక దేవాలయమును గట్టిరి. దేవాలయమునకెదుర విశాలమైన ఘంటాపథమును వదలి, యిరుగెలంకుల గేహములను నిర్మించిరి. నివేశనస్థలములనొసగి కట్టుకొండనిన, యజమానులు తమతమ యిష్టములప్రకారము గృహములనిర్మించి పురసౌందర్యమును జెడగొట్టుదురన్న బెగడుచే, ఘంటాపథమునకు రెండువైపుల నున్నతమందిరాకారములగు గృహముఖముల బ్రభుత్వము వారే నిర్మించి, గృహనిర్మాణకులకు, వారియెత్తునకు దగిన ట్లిన్ని న్ని గృహముఖములని యొసంగినట్లు తోచుచున్నది. వెనుక నెట్లున్నను ఎదుర వీథియంతయు

మందిర పంక్తులతో నొప్పారుచుండెడిది. వీథినుండి వీథికి వీలైన చోట్ల ఘంటాపథ వైశాల్యముతో బాటల నమర్చిరి. వీలుకాని చోట కాలిబాటయే గతి. ఈయవస్థ ప్రదేశము కొండలతో నిండియుండుటంబట్టి తటస్థించియుండును. ఆవీథులకు వాని కెదురనున్న దేవాలయమందలి స్వామి పేరుతో పురములని పేరిడిరి. పోనుబోను దూరమున నందందు పల్లెలు, వాటికలు, నేర్పడెను.

ఇక నాపట్టణమున నే యేవర్ణములవా రెందుండినది. చెప్పుటకు నేడు సాధ్యముకాదు. ఆపట్టణము మంచిదశయందు న్నపుడు దానిని వర్ణించినవారు కొందరున్నను, వారు విదేశీయులు గనుక వారికి మనయాచారములు తెలియక పోవుటచే నావిషయమును గురించి వ్రాసినారుకారు: ముందు విధ్వంస మగునని యెంచియుండరుకావున మనవా రెవ్వరును దానిని వర్ణనముచేసి యుండలేదు. కాబట్టి దానిని కనుగొనుట యూహ తప్ప మరొకసాధన మగుపించదు. హిందూమత ధర్మసంరక్షణముకొర కేర్పడిన మహానగరమున, నన్నివర్ణములు నేటివలె కలిసి నివసించియుందు రనుటకు వీలులేదు. శూద్రులు వృత్తుల ననుసరించి ప్రత్యేకపురములలో నివసించి యుందు రనుటకు గొన్ని నిదర్శనములున్నవి. అప్పుడు వేశ్యకాంతలుండినవీథిని, లంజెలబజా రను పేరుతో నేడు అచ్యుతాలయమున కెదురుగనున్న వీథిని జూపుచున్నారు. శిల్పులు, వానికిసంబంధించినవృత్తులవారు విఠలాపురమున నుండిరని, పాశ్చాత్య ప్రయాణికు డొకడు చెప్పియున్నాడు. అటులనే మిగిలిన

వృత్తులవా రందం దుండి యుందురు. పంచములు దూరపు వాటికలలోనుండి యుందురు. వైశ్యులు వర్తకమున కెం దను కూలముగనున్న నందెల్ల నుండి యుందురు. ఇక బ్రాహ్మ ణులు క్షత్రియులు, సుప్రసిద్ధ దేవాలయములున్న వీథులలో స్నానసంధ్యానుష్ఠానములకొరకు నదీప్రాంతములలో నుండి యుందురు.

ప్రజల కందరకు గావలసిన యుదకము తుంగభద్రా నీరము, అందందు త్రవ్విన బావుల నీరము. నదీజలము తత్ప్రాంతములవారు నదినుండియే తెచ్చుకొను చుండిరి. దూరస్థులైనవారికి నీరము పురప్రదేశమున నెల్లెడల గజి బిజిగ గనుపించు కాల్వలగుండ వచ్చుచుండెను. త్రవ్విన బావులు నే డెన్నియో కాన్పించుచున్నవి. ప్రతివీథికిని చీకటిరాత్రులలో దీపములను వెలిగించుచుండిరి. అట్టి దీప స్తంభములు నేడు కొన్ని కనుపట్టుచున్నవి.

రాచనగరమునకు బ్రత్యేకావరణ ముండెను. ఆయా వరణములో వీథు లెట్లుండినది, కట్టడము లెట్లుండినది చెప్పుట కిప్పుడు సాధ్యముకానంత 'బీభత్సముగ' దురకలు విధ్వంస ముచేసియున్నారు. ఇప్పటికిని మిగిలియున్న కొన్నికట్టడము లనుబట్టి, పాశ్చాత్య ప్రయాణికులుచేసిన వర్ణనలనుబట్టి, రాజ సౌధము లతిసుందరములై, యమూల్యాలంకారశోభితములై, యుండియుండవలె సని చెప్పవచ్చును. ఆయావరణములో రాజులు తమకు గావలసిన సమస్తసదుపాయములను నేర్పర్చు కొనిరి. వారిపూజలకు దేవతాలయము లందే కలవు. కావ

లసిన విహారరంగములు నాట్యభవనములు నం దుండెను. స్నానము సేయుటకు నీదులాడుటకు ననువైన తటాకము లం దుండెను. సామ్రాజ్యవ్యవహారము సేయుటకు కచేరీ లందే యుండె. రాజసభామంటపములు, మంత్రాలోచనామందిర ములు నందే యుండె. రాచవారి యుపయోగము నిమిత్తమేర్ప డిన వాహనజంతువర్గము ప్రత్యేకభవనములలో నాయా వరణమందే యుండెను. ఇక నాయావరణములో దాదాపు మధ్యగ మరొక యావరణ మున్నది. అది రాణివాసమువారి భవనములుండిన ప్రదేశము. పాశ్చాత్యుడొకడు చేసినవర్ణన మునుబట్టి రాచవారికి వలయు వస్తుసామగ్రి సమకూర్చు విపణివీథి యొకటి యా ప్రథమావరణమున నుండెనా యనుపిం చుచున్నది. కమలాపురమున కేగు ద్వారమును దాటగనే యొకచిన్న మైదాన మున్నది. అందులో భీమసేను దర్వాజా కొక ఘంటాపథ ముండెను. ఆదర్వాజాను గ్రమించినంతనే యొక పెద్దబయలు కాన్పించును. ఆ రెండు మైదానములు దశరాత్రోత్సవములలో బహుళసంఖ్యాకమగుసామ్రాజ్యవరూ థినీ ప్రదర్శనమునకు ననుకూలించుచుండెడివట. అనుదినము రాచవారి వాహ్యాళి కుపయోగపడుచుండెడివట.

నీటి సదుపాయ మున్మడిగ నున్నయెడల ముట్టడి జరి గినపు డది శత్రువులచేబడిన రాచవారికి చిక్కునచ్చునను భయ ముచే, రాచనగరమునకు ప్రత్యేక జలసదుపాయము నేర్పా టుచేసిరి. చక్రవర్తులకు వలయు బానీయ మేబావులనుండియో నీళ్ళుచేసిన బిందెలలో ననుదినము తెచ్చెడివారట. అదిగాక

రాచనగరమున కవసరమగు జలమంతయు, దానికి దక్షిణమున నున్న యొక బావినుండి సంతనచేసికొనినట్లు సూచించు నాధారములు నేడు కాన్పించుచున్నవి.

విద్యారణ్యస్వామి శంకుస్థాపన చేయించిననాడే విజయనగర మిట్లుండె ననుకొనగూడదు. తరతరముల రాజులు తమశక్తినిబట్టి యవసరమునుబట్టి దానిని వృద్ధిచేయుచువచ్చిరి. ఏరా జెంత పెంచినది చెప్పుటకు శక్యముకాదు. కావున నుచ్ఛదశలో నెట్లుండినది పైన నిరూపించితిమి. స్థాపించిన ముహూర్తబల మెట్టిదో గాని, యప్పటినుండి నేలకొరుగువరకు, నిజధర్మమును నిర్వహించుకొనుచు, మొట్టమొదట కించిదైశ్వర్యముతో నొప్పి, పోనుబో నపరిమితైశ్వర్యముతో దులదూగి విరమించినది. ధర్మసంరక్షణ విషయము దర్వాత విచారించనెంచి ప్రకృతము దానియైశ్వర్యవిషయము నెత్తుకొందము. తూర్పుతీరమునుండి పడమటితీరమువరకు జరుగు వ్యాపారమున కాపట్టణము నిధానమయ్యెను. దాని యంగడులలో నవరత్నములు గుట్టలుబోసి యమ్మగా జూచితినని యొకపాశ్చాత్యుడు చెప్పియున్నాడు. మరొక డా పురమునకు వర్తకమునిమిత్తమై ప్రాతఃకాలమునసాయంసమయముల సరుకులు తెచ్చిన బండ్లు, పశువుల త్రొక్కిడిచే, గదల వీలులేకుండెనని చెప్పియున్నాడు. మరొకడు ఇప్పటి బొంబాయి కంటె నెక్కువ విలువగల వర్తక మాయూర నడచినదని చెప్పియున్నాడు. పట్టణైశ్వర్యము జరుగు వాణిజ్యమును బట్టియే యుండదు. అందలి ప్రజలసౌఖ్యమును బట్టికూడ నిర్ణయింప

వలసి యుండును. ఈ సందర్భమున దానిని మంచిదశలో జూచి నవారందరు అందలి ప్రజ లెట్టివంటికొరత లేక సుఖించుచుండిరని చెప్పియున్నారు. అందువలన నాడు బీదసాదలు లేరని గాని, దారిద్ర్యమే లేదనిగాని వారిభావము మాభావము కాదు. సవిమర్శదృష్టితో, నాటికి నేటికి తారతమ్యముఁ గమనించి విచారించినచో, నట్టిసామ్రాజ్యరాజధాను లన్నిటిలో, నాయూరిప్రజ లనుభవించిన సుఖమింకే పట్టణవాసులు ననుభవించి యుండలేదని చెప్పవలెను. అట్టిసౌఖ్యము, ఐశ్వర్యము ప్రభువులనుబట్టి, ప్రభుత్వమునుబట్టి యుండును. ఆప్రభువు లెట్టివారో, ధర్మసంరక్షణము నెట్లుజరిపిరో, తుద కాపట్టణ మేమయ్యెనో చూతము.

4 వ ప్ర క ర ణ ము.

## ధర్మసంరక్షణము – తల్లికోట.

ఆ పట్టణమును, అది రాజధానిగ నేర్పడిన సామ్రాజ్యమును, నాలుగు వంశములవారు పాలించిరి - సంగమ వంశమువారు, సాళువ వంశీయులు, తుళువ వంశజులు, ఆర్వీటి వారు. విద్యారణ్యస్వామి సంకల్పించిన ధర్మసంరక్షణము సాధారణ ప్రయత్నములతో దేలు పనికాదు. అది నెరవేరుటకు హైందవ శక్తిసామర్థ్యము లన్నియు నొకచోట సమకూడవలె. రానున్న యాపద నందరు గ్రహించి దానిని

నివారించుట కుద్యమించవలె. అట్టి మహాకార్య మా కాలములో సామ్రాజ్య సంస్థాపనమువలనగాని నెరవేరదు. కావున పట్టణమును గట్టినప్పటినుండి సంగమరాజుల కా పని వెంట బడెను. ఆ విషయమున వారు ప్రమత్తులు గాకుండ నావిద్వచ్ఛిఖామణి, పట్టణనిర్మాణముతో దన ధర్మము తీరినదని యెంచక, మంత్రిత్వము వహించి, దాదా పొక తరము వరకు లౌకిక వ్యవహారముల మీదవేసికొని కృషిచేసెను. స్వామివారి బుద్ధిబలమువలన, సంగమవారి బాహుబలము వలన, రెండవ హరిహరరాయలునాటికే, ఉత్తరమున కృష్ణా నది మొదలుకొని దక్షిణమున దిరుచునాపల్లి వరకు, విజయనగర సామ్రాజ్యము వ్యాపించి స్థిరపడెను. వాని తరువాత రాజ్యమునకు వచ్చిన రెండవ దేవరాయ లా సామ్రాజ్యమును బోకుండ బట్టి, తుంగభద్రానది కానకట్ట గట్టి, దాని నీరమును వ్యవసాయాద్యవసరములకు రప్పించి, గత ప్రకరణములో వర్ణించిన పట్టణమునకు రెండు మూడు వీథులను గలిపి, కోట యావరణముల బెంచి, క్రొత్తగోడలను గట్టించి, సర్వత్రి బలపరిచెను.

హిందువు లట్లు పట్టణమును గట్టుకొని సామ్రాజ్యమును బెంచుకొనుచుండ నుత్తరమున మహమ్మదీయు లూరకొనలేదు. విజయనగర మేర్పడిన పదునొకండు సంవత్సరములకు, వారిరాజ్య మొకటి కలబరగీనగరమున బయలుదేరెను. అదియే భామినీరాజ్యము. దానినిస్థాపించినది హసాన్ గంగూ అల్లాయుద్దీన్ భామినీ షాహ యను

వాడు. అతడు ఢిల్లీసుల్తాను సర్దారులలో నొకడుగనుండి మహా మ్మదు తుఘలక్ దురాగతములకు సైపలేక తిరుగబడి స్వతం త్రించినవారిలో నొకడు. సమర్థు డగుటవలన నత డతిశీఘ్ర కాలములో దనరాజ్యమును నలుదిక్కులను వ్యాపింపజేసి దాని నొక పెద్ద సామ్రాజ్యమునుజేసెను. దక్షిణమున నేర్పడ్డ హిం దూసామ్రాజ్యమునకు, నుత్తరమున నెదుగుచున్న మహమ్మదీ యసామ్రాజ్యమునకు గొంతకాలమునకు బోరు తప్పదయ్యె. ఆపోరు తొలుదొలుత కృష్ణాతుంగభద్రామధ్యప్రదేశము నకై బయలుదేరి, మొదలనుండి హిందూ మహమ్మదీయ భేదములతో బోషితమై వృద్ధియగుచు, మితిలేని ధనవ్యయ మునకు జనక్షయమునకు గారణమయ్యెను. దానిలో నొక ప్పుడు హిందువులు మరొకప్పుడు మహమ్మదీయులు జయిం చుచువచ్చిరి. రాజులు మారినపుడెల్ల నొకసారి రెండుసామ్రా జ్యములు బలాబలములు చూచుకొనుచుండెడివి. వారికి వీరికి ననేకపర్యాయములు సంధులు జరిగినవి. కాని వానిలోనొకటి కూడ పట్టుబట్టి యిరువదియేండ్లయిన శాంతి నొనగూర్చియుం డలేదు. కొంతకాలమునకు భామినీసుల్తానులు సుఖలోలురై పక్షపాతముతో బ్రభుత్వము చేయుటంబట్టి, వారి వజీర్లు తిరుగబడుటవలన, వారిసామ్రాజ్యము బ్రద్దలై యైదుముక్క లాయెను. ఆముక్కలన్నియు నొకపర్యాయము కొన్నికార ణములచేత నేకమై విజయనగరసామ్రాజ్యము పైబడువరకు, హిందువులకు కొంచెము విశ్రాంతి చేకూరెను.

మహమ్మదీయులతో నట్లు తటస్థించిన యుద్ధములలో హిందువుల కితరసాహాయ్యము లేదు. పయిగా నాకాలమున దూర్పుతీరమం దొక మహాసామ్రాజ్యము నేర్పరచుకొని బలవంతులై యున్న కటకరాజులగు గజపతులు, తమ హైందవత్వముమరచి, విజయనగర సంస్థాపనోద్దేశమునైన బాటి సేయక, మహమ్మదీయులతో గలిసి హిందూరాజ్యముతో బోరాడుచు, గలియనిపట్ల తురకవా రుత్తరమున బోరవచ్చినపుడు తూర్పుతీరముపై దండెత్తి దానిలో ముక్క వెంబడి ముక్కను దమసామ్రాజ్యములో గలుపుకొనుచు, విజయనగరమువారికి గొప్పసంకటమును గలిగించుచుండిరి. అట్టి తాకిడి కన్యసామ్రాజ్యములు నాడే అడుగంటి యుండవలసినది. హిందువుల యదృష్టవశమున నాకాలమున నొకచిత్రము జరుగుచు వచ్చినది. ఏసామ్రాజ్యమునకైన స్థాపించిన నాటి బలము చివరవరకు నిలువదు. దానికి కారణము చక్రవర్తు లందరు సమానమైన సమర్థులు కారు. బలహీనులు సింహాసనమునకు వచ్చినపుడు, ఉన్న రాజవంశము మారి, సమర్థుడైన మరొకవంశీయుడు రాజ్యమునకు వచ్చిన చో, నాసామ్రాజ్యమున కేలాటి ముప్పును వాటిల్లదు. హిందువుల యదృష్టముచేత, విజయనగర సంస్థాపనా ముహూర్తబలము చేత, నట్టియెడ నారాజ్యమున కాధిపత్యము వహించిన రాజవంశముల నాయకు లతిసమర్థులుగ నుండిరి. సంగమవంశము నంతరించి విజయనగర సింహాసన మధిష్ఠించిన సాళువ నరసింహరాయ లాకాలమున సమర్థులలో సమర్థుడు. అతని

కుమారులు బాలురగుటవలన, వారి నావల నుంచి రాజైన తుళువనరసనాయకుడు నల్లే సమర్థుడు. అతని తరువాత, వయస్సులో మృతినొందిన యన్నగారివెనుక చక్రవర్తియైన శ్రీకృష్ణదేవరాయలు, మహాచక్రవర్తులలో నొకడు. వారి వెనుక నచ్యుతరాయల యనంతరము రాజ్య మల్లకల్లోల మైనపుడు, సదాశివరాయని సింహాసనముపైనుంచి మంత్రిత్వము వహించిన యార్వీటి రామరాయలు పరిపాలనాదక్షాగ్రగణ్యులలో నొకడు. అట్టి సమర్థుల యాధిపత్యము లభించుటంజేసి విజయనగరసామ్రాజ్యమునకు మహమ్మదీయులవలనగాని, అనుకొనని దేశద్రోహము సేయుచు విజయనగరమును వేధించుచు వచ్చిన గజపతుల వలనగాని, యెట్టి కీడును వాటిల్లదాయెను. మహమ్మదీయుల వలని యాపద బలవంతమైన భామినీరాజ్యము బ్రద్దలగుటతో జాలవరకు తగ్గిపోయెను. శ్రీకృష్ణదేవరాయల పూర్వదిగ్విజయములో విరిగిన సేనలను గటకము వరకు దరిమికొట్టి కటకపురమును గాల్చినంతనే, గజపతుల దురభిమానసామ్రాజ్యావేశము, ప్రతాపాహంకారము; చప్పగ నణగిపోయె. కృష్ణరాయ లిక కొంతకాలముండిన, అచ్యుతరాయలు రాజ్యమునకు వచ్చిన నాటి శక్తిసామర్థ్యములను స్త్రీలోలుడు గాక చివరవరకు బట్టుకొని వచ్చిన; తరువాత వచ్చిన సదాశివరాయలు శక్తిమంతుడైన; అన్నియుగాక, ఆర్వీటి రామరాయలకు, యోధానుయోధత్వముతోబాటు ఆంధ్రనైజమగు నౌదార్యలక్షణము, దురభిమానతురుష్క సంపర్కముచే బాడు

గాకుండ యుండిన; కృష్ణరాయలు సంపాదించి యొప్ప గించిన సామ్రాజ్యమువంటి విశాలభూభాగము నేలుటకు గావలసిన నీతిసామగ్రి యమరియున్న మహనీయుడు, మరల నేవిద్యారణ్యునివంటివాడో, మంత్రి తిమ్మరుసువంటివాడో, యింకొకడు, హిందువుల యదృష్టమువలన మంత్రిత్వమును వహించియుండిన హిందూదేశచరిత్ర మిట్లు జరిగి యుండదు.

ఇక నెట్లు జరుగును? జరుగవలసిన దిట్లుండ వే రెట్లగును? సకలవిద్యాసముద్రిలును సర్వనీతిశాస్త్రపారంగతులును నగు విజయనగరరాజులకు, మంతురిలకు, మార్యసామ్రాజ్య మందలి ప్రజాపరిపాలనాతత్త్వము, నొకింతయైన, విజయ నగరసామ్రాజ్యపరిపాలనాతత్త్వమున నెక్కించ దోపదయ్యె! ప్రజావ్యక్తి గ్రామపంచాయతీల నతిక్రమించి సామ్రాజ్యమున కెక్కదయ్యె! అంతసామ్రాజ్యముపై, నట్టిసామ్రాజ్యముపై, ప్రజానురాగ మొక్కింతైన లగ్నము కాదయ్యె! అట్లుగాక, సామ్రాజ్య మంతయు, సామంతసైన్యబలముపై, మూలసైన్యబలముపై నాధారపడియుండె! సామంతులు స్వతంత్రించు సదుపాయములను వెదకికొనుచు, ప్రభుశక్తి మంతుడైన యణగియుండుచు, బలహీనుడైన దిరుగబడుచు కాలక్షేపము సేయుచుండిరి! మూలసైన్యముకూడ, షుమారు లక్షవరకు బెరిగియున్న తురుష్కధానుష్కుల బలముతో నమ్మోగినది కాకుండె! వారిసంఖ్య నాధనుష్కుళను హిందూ వీరుల కలవరచిన వెనుక తగ్గినను, జివరవరకు గొంద రెప్పు

డును మూలసైన్యములో నుండుచు వచ్చిరి. వారికి పట్టణపు కాపలాగుట్టు చాలవరకు విశదమైయుండెను! కృష్ణరాయల కాలమున సంభవించిన యపూర్వదిగ్విజయములచే భ్రాంతి వడి, యొకవిధమైన మైకముకప్పి, ప్రజలేకాక ప్రభువులు గూడ మహమ్మదీయబలశౌర్యముల నిరసింపజొచ్చిరి! ఆజయములు శతఘ్నులవలన లభించినవని, అట్టిశతఘ్నిబలమును సమకూర్చు నుపాయములు మహమ్మదీయులకుగూడ దెలియు నని విచారింపకుండిరి. కృష్ణరాయనికాలములో భరతదేశముపై దండెత్తివచ్చి, ఉత్తరహిందూస్థానమున పానిపట్టుయుద్ధమున ఢిల్లీసుల్తానును, సిక్రీయుద్ధములో రాజపుత్రవీరులను, జయించిన మొగలాయీ బేబరుయుద్ధనైపుణివి మహమ్మదీయసుల్తానులతో బాటు తాముకూడ నేర్చుకొనవలసియుండునని, కృష్ణరాయలతరువాత రాజ్యమునకు రాకపోయినను, సదాశివరాయని కాలములో 'బెత్తనము' వహించిన రామరాయలుగాని వానిసోదరులుగాని గమనింపకపోయిరి. పయిగా, నన్యోన్య కలహములతో గృశించుచున్న మహమ్మదీయు లేమిచేయగలరని యెంచదొడగిరి. వారిపోరులలో జయమందువారితో గలిసి పోరునపుడు, వారిదేశములపై దండెత్తి విడిసినపుడు, వారి మర్యాదల బరిగణింపరైరి. వారి మసీదులలో గుఱ్ఱములను గట్టించిరి! వారికాంతల నవమానపరచిరి! కడ కాయకృత్యములను సేయునపుడు సుల్తానుల యంతఃపురములనైన గౌరవించరైరి! వారిరాయబారులు సంధిచేసికొనవచ్చినపుడు వారికుచితాసనముల నొసగక, వారినవాబు స్నేహముచేసి

కొనవచ్చినపుడు వారిని ముట్టుకొని, అందుతో నపవిత్రులమై తినుని వారికి తెలియునట్లు, రామరాయలునంటి యాంధ్రవీరుడు వెంటనే చేతులు కడుగుకొనుచుండె! అట్లు చేయునపుడామహనీయునకుగాని, వానితోనున్న యాంధ్రవీరావతంసులకుగాని, కృష్ణరాయలు తనపాదమును ముద్దుపెట్టుకొనిన గాని సంధికియ్యకొన నని విజాపురముసుల్తానున కంపిన సందేశము నాడు మహమ్మదీయనవాబుల మనస్సులలో మొలకలెత్తిన పరాభవలత, యాకృత్యములతో దోహదమంది ఫలించునేమో యని తోచదయ్యె! లోకములో దేనికైన మితము కలదు. నల్వురు శత్రువు లుండి వారితో వారు పోరుపట్ల వారిలో గొందరు స్వార్థపరులై యితరుల సహాయ మపేక్షింతురుగాక. వా రంద రొక కులమువా రైనపు డాయితరులు వారందరకు నవమానమగురీతి ప్రవర్తించిన వారు కలియకుందురా? ఈ యనుభవము ప్రతికుటుంబమున నగపడదా? తాత్కాలిక కారణము లవలన నొక కుటుంబమువా రొండొరులతో బోరాడిన బోరాడెదరుగాక. చివరకు వారంద రొకటియగుట, పరులెన్నటికి పరులగుట, లోకములో జరిగెడు విషయమేకద! విజాపుర బీదరు సుల్తాను లెంత తమస్వార్థమునకై రామరాయల సహాయమునుగోరి యతనితో మిత్రులవలె ప్రవర్తించినను, దనకు సింహాసన మిప్పించినందులకు గోల్కొండ నవాబు తనపట్ల కృతజ్ఞతను పైపైన నెంత చూపించినను, అహమ్మదునగరముపై దండెత్తినప్పుడు, విజాపురముపై నెత్తి విడిసినపుడు, హిందువులుచేసిన దురాగతము లాసుల్తానులకు

మనశ్శల్యములు గాకుండునా? అదను గనిపెట్టి, వారిలో వారు గూఢాలోచనలు గావించి, ఒకరితో నొకరు రాయబారములు నడిపి, ఏది యెట్లు జరుగుచున్నదో విజయనగరమున బొక్కక ముందే సైన్యసన్నాహము గావించుకొని, నల్వురు సుల్తానులు, ఏకీభవించి కృష్ణానదీతీరమున విడియ వచ్చుచుండిరి.

ఆ సమాచారము విజయనగరములో దెలిసిన వెంటనే రామరాయ లేమాత్రము భీతిలక - (ఇన్నినాళ్లనుండి జయప్రదముగ నాడుచున్న తృతీయోపాయమున కవకాశము లేనందుల కేమైన ననుకొనెనేమో చెప్పలేము) - కొంత రాణువ నిచ్చి, కృష్ణ రేవులను గాచుటకు తమ్ముల నిర్వురను బంపి, మూలసైన్యముతో గదలి తానుగూడ వచ్చి విడిసెను.

రెండుసైన్యములు కొన్నాళ్లిట్లు కృష్ణదరుల విడిసియుండెను. హిందువుల కన్నొమరగించి కృష్ణను దాటుటకు మహమ్మదీయులకు వీలు గాకుండెను. మహమ్మదీయులు తమజన్మాంతరము వర కందే కాపురము సేయుమాదిరి నటింపజొచ్చిరి. దానితో హిందువు లొకింత మోసపోయి, దూరపు రేవుల గాచుచున్న సైన్యమును రప్పించి, దగ్గరవాటిని బలపరచుకొనిరి. అది కనిపెట్టి, యొకనాడు గాఢాంధకారనిశీథసమయంబున, మహమ్మదీయ వాహిని పశ్చిమోన్ముఖముగ గొంతపయనము సేసి, యందొక రేవున దాటి, తెల్లవారునప్పటికి కృష్ణానదీదక్షిణతీరమున తీరి నిలిచెను. ఆమెత్తును వెంటనే కనిపెట్టివచ్చిన హిందూ సైన్యము వారి నడ్డగింప వీలులేక, కొంత నైరృతిగ చని యా

గి, మహమ్మదీయసైన్యమునకు దక్షిణమున దీరినిలిచెను. ఇదియంతయు తళ్లికోట యన్నగ్రామముసమీపమున జరిగెను.

హిందూసైన్యములో నెడమవైపున తిరుమలరాయులు, మధ్య రామరాయులు, కుడివైపున వెంకట్రాయులు నధిపతులుగ మోహరించిరి. వారి నెదిర్చిన మహమ్మదీయసైన్యము, కుడివైపున విజాపురమువారు, మధ్య అహమ్మదునగరము బీదరులవారు, ఎడమవైపున గోల్కొండవారు నుండిరి. మహమ్మదీయవరూథినీమధ్యభాగమున పానిపట్టులోని బేబరుపద్ధతి నొకింత యనుసరించి, అహమ్మదునగరసుల్తాను తన శతఘ్నిబలము నేర్పరించి, దాని వెనుక తన గుఱ్ఱపుఫౌజును మాటియుంచెను. దాని కెదురుగనున్న హిందూసైన్యము మధ్యభాగము గుఱ్ఱపుదళముతో, దానివెనుక కాల్బలముతో దీరియుండెను. మిగిలిన యన్నిచోట్ల, గుఱ్ఱపుదళమువెనుక కాల్బలము తీరియుండెను.

యుద్ధము ప్రారంభమాయెను. హిందువు లతిసాహసముతో బోరి మహమ్మదీయపక్షముల నొత్తుచుండిరి. మహమ్మదీయమధ్యభాగమున శతఘ్ను లుండుటంబట్టి, హిందూరాతులు వానిపైబడి, వానిబారులకు మిడుతలవలె మడియుచుండిరి. అయినను వెనుదీయక, రామరాయప్రేరితులై ధైర్యసాహసముల నేమాత్రము లోపము లేకుండ, సముద్రమున దరంగము వెనుక తరంగము త్రోసుకొని వచ్చునట్లు, బారువెనుక బారు త్రొక్కుకొనుచువచ్చి, శతఘ్నుల బట్టుకొను ప్రయత్నము సేయుచుండిరి. కొంతకాలమునకు, హిందూపక్ష

ములు రెండు మహమ్మదీయపక్షస్థానముల నలంకరించునట్లు, మహమ్మదీయమధ్యభాగము వెనుక కొదుగునట్లు తోచెను. హిందువులు జయింతురను సడి, సైన్యమున నెల్లెడల వెల్వ డెను. అట్టియెడ, భగవంతుడు చిన్నచూపుచూచెను. కుడి వైపు సేన నేలుచున్న వెంకటాద్రియ లవని కొరిగె! దానిని గమనించి యాబలము పలాయనము కాజొచ్చె. ఆసంగతి తెలి యక, ఆసంకులసమరములో, రామరాయలు, నలువంకల బరి కించి విరుగుచున్న కుడిపక్షమును జక్కపెట్టక, జయించు చుండిరి కా దలచి, మరింత జయమున కుత్సహింపనెంచి, నిజాసనమును రణరంగమున వేయించుకొని, దాని నధి ష్ఠించి, యంతవరకు విక్రమముతో బోరిననాయకులకు, సైనికులకు, బహుమతు లొసంగు ననవసరపు బనికిమా లినపనిలో మగ్నుడయ్యెను. గోల్కొండవారి యొత్తిడి కా గలేక, హిందువులకుడిపక్షము మధ్యభాగముపై నొత్తుకొని వచ్చుచుండె. తిరుమలరాయలు మట్టుకు, ఒకకన్నుపోయి నను, వెనుకంజవేయక, విజాపురమువారిని వెనుకకు ద్రో లుచు విక్రమించుచుండె. గోల్కొండవారు ముందంజవేయుట జూచి యుత్సహించుచున్న అహమ్మదునగరమువారికి, రామ రాయల బహుమానములపంపిణి క్రోధోద్రేకము గల్గించెను. ఆసమయమున నేమి జరిగెనో యెవరు చెప్పగలరు? హిందూసైన్య మందు మహమ్మదీయమధ్యభాగముపై బోరుచున్న తురుష్క గుర్రపుఫౌజు, హఠాత్తుగా శత్రువులలో గలిసిపోయెను. అదియే సమయమని యెంచి, నిజాంషాహ (అహమ్మదునగరు

సుల్తాను) పురికొల్ప, వారిగుర్రపుదళము, దారియిచ్చినహిందూ తురుష్కదళరంగస్థలముపై నొత్తుకొని వచ్చుచుండె. ఆరంగస్థలమున నున్న హిందూకాల్బలము విరుగఁజొచ్చె. ఇప్పటికి జరుగుచున్న సకలము నవగాహనము చేసికొని, రామరాయలు సింహాసనము వీడి, వృద్ధుఁడగుట గుర్రముపై నెక్కక, ప్రక్కనున్న పల్లకీ నెక్కి, చేవీచి, యెలుఁగెత్తి, విరిగిన సేనల నిల్వరించుచుండె. అది యంతయు గనిపెట్టుచు, ఖాళీయగుచున్న రణరంగముగుండ వచ్చుచున్న అహమ్మదునగర అశ్వసేనాధిపతి, యతివేగగమనంబున బల్లకీని డగ్గరుచుండెను. ఆ ఘోరసంగ్రామమున మతిచెడిన యొక హిందూయోధుఁడు "అయ్యో! రాయలు చచ్చె, చచ్చె" నని యాక్రందనము సేయదొడఁగె. దానితో బల్లకీలోని పురుషుఁడు రామరాయలని గ్రహించి, ఆ యశ్వసేనాని పల్లకిని దాకి, రామరాయలను బట్టుకొనిపోయి, నిజాంషాహాయెదుట బెట్టెను. ఎన్నాళ్ళనుండియో రగులుచున్న కోపాగ్ని నాపుకొనలేక, రామరాయలకు పరమమిత్రుఁడైన గోల్కొండనవాబే తెంచిన నేమగునో యను బెగడు, కొంతమైత్రి ఘటించి రాయలతో గతసంవత్సరమువరకు ననుకూలుఁడుగ నున్న విజాపురముసుల్తాను వచ్చిన నేమి చెప్పునో యనుభయము, కలవరపెట్ట, తనకసిదీర్చుకొనుటకదను బోగొట్టుకొననొల్లక, నిజాంషాహ, శ్రీరామరాయల శిరచ్ఛేదముచేసి, యాతల నీటెను బొడిచి, హిందూసైనికుల కగుపరచి, రాయల మరణసమాచారమును వెల్లడించెను. రాయలు పట్టువడుటకే వెనుకాడుచున్న హిందూమధ్యభాగ

ము, రాయలశిరఃప్రదర్శనముతో విరిగి పారజొచ్చెను. అట్లు పలాయనము లగుచున్న కుడిపక్షమును, మధ్యభాగమును, జయమందుచున్న తిరుమలరాయ లెంతయాప సమకట్టినను లాభించదయ్యె. దానితో నంతయు ముగిసినదని గమనించి, తిరుమలరాయలు, విరుగుచున్న సేనను జాటుజేసికొని, రణరంగమును వదలి, రాజధానిదారి బట్టెను.

అట్లు చెదరి పారిపోవుచున్న మహాసైన్యమందలి యోధులస్థితి యెట్లుండియుండునో? నూతనాగతజయోన్మాద పూరితులగు మహమ్మదీయులు లేశమైన కరుణలేక వెన్నంటి యెందర వధించియుందురో?! మును పటువంటి పరాజయము తమసేనలకు గలిగినపుడు, విజయనగరయోధులు గావించిన క్రూరకృత్యములకు, వడ్డీతో బ్రతిక్రియ చేసియుండరా?! ఇట్లనేకులు మడియగ, మిగిలినవారిలో పలువురు, దారి తెన్ను దెలియక జరిగిన ఘోరకృత్యమునకు బిడుగులువడినట్లు నిర్విణ్ణులై, నిశ్చేష్టితులై నిలిచియుండ, దురకల కఱకుఖడ్గము లెందర దునిమియుండునో! ఎంతపనిజరిగినదని గుండెలుగొట్టుకొనుచు, మహమ్మదీయుల యొత్తిడిని తప్పించుకొని పారిపోయిన యోధులనేకు లెట్టకేలకు నిజనివాసంబులకో, దారిలోని బంధునివాసంబులకో, కాకున్న మిత్రనివాసంబులకో, కాకున్న దోడి హిందువు లగుట మహమ్మదీయులకు వెరవక సానుభూతి నగుపించి తలదాచుకొనుటకు జోటు జూపు పరోపకారులనివాసములకో, చేరియుందురు. మడిసినవారు మడిసినను, నాయకత్వపు లోటులేక శోభిల్లుచున్న తిరుమలరాయలసేనమట్టుకు,

మహమ్మదీయులు వచ్చి తాకినప్పు డెల్ల నిలబడి వారిని వెను కకు గొట్టుచు, ఆమహావీరునియండ రాజధానిమార్గమునం బోవుచుండెను. ఆగాయలుకూడ జయమొందిన వెనుక నెడ తెరపిలేకుండ దురుష్కు లేతెంచి రాజధానిపై బడుదురను భయముచే, నందందు కాందిశీకులై పరుగిడుచున్నవారికి ధైర్య ముసెప్పి సాధ్యమైనంతవరకు వారిని గూడగట్టుకొని, పోవు చుండె. అట్టియెడ నామహాశూరుని మన స్సెట్లుండియుండునో! హైందవగౌరవ మంతయు దనవంశముపై నాధారపడినందుల కిట్టు లగుట కెంత వగచుచుండెనో! అన్నగారు బహుమ తులు పంచిపెట్టక, నాల్గువైపు లరయుచు, వెంకటాద్రియుల మరణానంతర మాబలములకు దగిన యధినాథుల నంపి యెదు టనున్న శతఘ్నుల నిప్పుప్రయోజనములు సేయదగు మరొక పద్ధతి నెందుల కవలంబింపడాయెనా యని యెంత కుందుచుం డెనో! ఇది యంతయు గతజలసేతుబంధనము. పట్టణయంత్రి నిర్మాణము నాటి రెండుంబాతిక బీటికల ముచ్చట వృథా యగునా యని పొంగి పొరలివచ్చుచున్న దుఃఖము నణచుకొనుచు, నెంతసమాధాన పడియుండునో! అట్లు దీర్ఘాలోచనాతత్పరుడై యున్న మహానాయకుని గలిసికొని యుపనాయకులు, సోదరద్వయమరణములకు, మహాపట్టణము నకు సామ్రాజ్యమునకు గలిగినయాపదకు వారి నెంత యో దార్చియుందురో! ఆ యోదార్పులకు దలపంకించుచు, దైవ ఘటన దప్పించుకొన నేరి తరమనుచు, నడుమ నడుమ వేగువా ర్తల విని వానికి దగినయాజ్ఞల నొసంగుచు, బట్టణముగతి

యేమో యనివిచారించుచు, నెంత బరితపించుచుండెనో!
ఎవరి కెరుక ?!

దారిలో స్థితి యిట్లుండ- బట్టణములో, "శ్రీరామరాయలు తమ్ములతో సామ్రాజ్య మెన్నడును గూర్చని మహాసైన్యమును బోగుజేసికొని, మొన్న మొన్నటివరకు దమకు జరిగిన పరాజయముల మరచి కూడ ముట్టవచ్చుచున్న సుల్తానులపై నేగి యెన్నోదినములైనను, నేటివరకు వారి సమాచారము తెలియ లేదేలనో" యని, ముదుసలులు, పిల్లలు, నాడువారు, దారులు కాచుచు, ఉత్తరమునుండి వచ్చిన ప్రతిమనుష్యుని వార్త లేమి యని యడుగుచు, "అంత సైన్యము అట్టి వీరులక్రింద నేగి జయముగొనక మగిడివచ్చునా" యని యెంతో యాశతో వేచియుండిరి. అట్టివారి కొకనా డొకానొకసమయమందు, 'రామరాయల తల నరికిరి. వెంకటాద్రియులు మృతి నొందె. మహాసైన్యము భగ్నమైనది. మహమ్మదీయులు గెలిచిరి. శీఘ్రప్రయాణములు సేయుచు శత్రువులు రాజధానిపై వచ్చుచున్నారు.' అనిన వార్తలు వినిగుండెలు పగిలి కొట్టుకొనుచున్న వారికి, కొన్ని గడియలలో "దిరుమలరాయలు కొంత సైన్యముతో బట్టణములో బ్రవేశించినా" డని వినిన వెంటనే 'బ్రతుకు జీవుడా' యని తోచి, కొండంత ధైర్యము వచ్చి, వారిలో ననేకులు రాచనగరుకడ మూగియుందురు. అట్లు మూగియుండిన వారల తిరుమలరాయలు నిజమందిరోపరిభాగంబు పైనుండి చూచి, కనులకు గాన్పించని సామ్రాజ్యమును, కాన్పించు నీయనదలను, గాపాడ నుపాయం బేమియని కొంత

తడ వూహించి, తగువారి రావించి, "పట్టణపుగుట్టు నెరిగిన తురక రాతులు శాత్రివులం గలిసిరి. కొద్ది దినములక్రింద మహార్ణవంబు పగిది మొరయుచుండిన సైన్యము సన్నగిల్లె. ఇక నీ పట్టణమును గాపాడ బ్రహ్మతరముగాదు. అయిన, విద్యారణ్యుల నాటనుండి పూజించుచున్న దేవతల, మన తాత ముత్తాల వారి ముత్తాతల తరములనుండి నమ్ముకొని యున్న భూతలమును, నేడీ యరాతులవాత బడవేయ నొల్లము. చేవగలవారు, చేయగలవారు నిందాయుధ పాణులై యుండుడు. మిగిలినవా రంద రీరేయి పయనమై రాణివాసంబుతో జనుటయో, లేక తమ తమ దారుల జూచు కొనుటయో, యేదియో చేసికొను" డని చాటింపబంచి, కొంత రాణువను పురసంరక్షణమునకు నియమించి, మిగిలిన వారిని చక్రవర్తి రక్షణమునకు నిర్ణయించి, పయనంబు సెప్పి యుండనోపు. ఆ సాటింపు వినినంతనే, యనేకులు, మోయ గలిగినంత మూటలు గట్టుకొని, దాచగలిగినవాటిని భూస్థాపనము జేసి, నాటిరేయి యేడువందలయేనుగులపై నొంటెలపై నమూల్యవస్తువులు గట్టుకొని యేగుచున్న రాచవారితో నేగియుందురు. కొందరు ధైర్యవంతులు, చేవగలవారు, శస్త్రములు ధరించి కాపలారాణువ యండనుండ సిద్ధపడియుందురు. వారిలో కొంద, రాత్మకాంతల దురకల చేజిక్కింపనొల్లక, ఆత్మహస్తములతో వారల హత్యసేసి సిద్ధపడియుందురు.

ఇట్లున్న యూరిపై, నొకమహాసముద్రమువలె మహమ్మదీయసైన్యము వచ్చిపడినది. రాయలయాజ్ఞ ననుసరించి

సంరక్షకసైన్యము ద్వారములు మూసి, లగ్గల గాచి, మారొగ్గి నది. ఒగ్గిన నేమిసార్థకము? అంతపట్టణమును గాపాడగల సైన్య మేది?! అట్టి జయోత్సాహముతో యుద్ధము సేయవచ్చిన మహమ్మదీయుల తాకిడి కాగు యోధు లేరి?! పయిగా, పట్టణపు రహస్య మెరిగి, బలహీనభాగముల వెదకుకొని తాకుచున్న యాశూరుల నాగు టెట్లు?! రెండు మూడు తాకులకే కొన్ని ద్వారములు విచ్చినవి. మహమ్మదీయసైన్య మానెగొంది దర్వాజాగుండ బ్రవేశించుచుండ, వారలలో మెరికెలవంటివారు దాని గోడ నానుకొనియున్న ఘంటాపథముగుండ, బంపాసరో వరద్వారముల నూడదన్నుచు వచ్చి, యందున్న సైన్యమును హతముజేసి, తమకు కుడివైపున నేటివరకు వ్యాపించు బయ లుపై మోహరించియున్న కొద్దిసంఖ్యగల రాణువను నాశన ముచేసి, రాతివంతెనమీదుగ నదిని దాటి, యూరిలో నతి శీఘ్రకాలములో బ్రవేశించిరి. అనుకొననివైపునుండి వచ్చిన వా రితరమార్గముల వచ్చుచున్నవారు, నదీతీరమున గలిసి కొని, దానినంటుకొని వ్యాపించుచుందురు. ఎల్లెడల నేల యీనినట్లు కానవచ్చుచున్న యాసైన్యము నాగుట యసా ధ్యమని గుర్తించి, తిరుమలరాయలు తన యంగరక్షకులతో, రాచవారేగిన పెనుగొండదారి బట్టెను. ఊరనున్న మొండి వారు నిరర్థకమని యెరిగియు, నడుగడ్డునకు దురకల నెదిర్చి, వారి ఖడ్గముల కెరయగుచుండిరి. మహమ్మదీయులు పురా క్రమణ మతిలాఘవమని గుర్తించినంతనే, యతివేగముగ నానగరమం దెల్లెడల దిర్రిమ్మరుచు, గనపడ్డవారిని నరకుచు,

ధొరకినధనమును దోచికొనుచు, కాంతల నవమానముచేసి చంపుచు, మరియు చెప్పరాని ఘోరకార్యములు సేయుచు, హిందువుపురుగు లే దనిపించి, పట్టణ మంతయు నాక్రమించు కొని విడిసిరి.

విజయనగరముపని యైనది. వచ్చిన సుల్తాను లందరిలో, గోల్కొండ అహమ్మదునగరములవారికి పట్టణవినాశన మహాకార్యము నొప్పగించి, మిలిగినవారు, చేజిక్కిన ధనమును, నమూల్యవస్తువులను దీసికొని, తమతమ పట్టణముల కేగిరి. ఇం దున్నవారు తమ నియమితకార్యమును బరిపూర్ణముగ నొనరింప నిశ్చయించుకొనిరి. ఇండ్లను గూలద్రోసిరి. రాజదివాణములను మందిరములను నేలమట్టముసేసిరి. ఎందు బ్రాకుల దేవాలయములలో బ్రోగువెట్టి, యగ్గినంటించి, యామంటలతో నాయాలయముల భగ్నముచేసిరి. ఆలయములలోని విగ్రహములను బగులగొట్టిరి. ఆమహాపట్టణమును మునుపటిపోలిక లేకుండ బాడుచేసిరి. ఈ ఘనకార్యమును సేయుటకం దై దారుమాసములు మకాముచేసిరట. రెండురాజ్యముల సైన్యములకు నాశనముచేయుట కంతకాలముపట్టిన పట్టణ మెంతది యైయుండవలెనో మీరే యూహించుకొనుడు. ఇక పాడుసేయుట కేదియు లేదని, యిది మరల నివాసయోగ్యము కానేరదని తోచినతరువాత తిరిగిపోయిరి. కాని, యిందొక విషయమునుగురించి చెప్పవలసియున్నది అంత దృఢనిశ్చయులై, పట్టణము నంతయు నాశనమొనరించినవారు, విఠోబాలయమును శ్రీకోదండరామస్వామి యాలయమును

నెందులకు తాకరైరో? అందలి వారిలో గొంద రనునట్లు, వానిని సమీపించగనే యగ్నిజ్వాలలు బర్వి మహమ్మదీయుల వెనుకకు దరిమెనా?! కాక, యర్చకులు ఆయాలయములం దున్న యమూల్యమణుల లంచమిచ్చి వానిని కాపాడు కొనిరా? అట్లయిన, మిగిలినయాలయముల యర్చకులకు మాత్రి మంతమాత్రిము లంచమిచ్చు నుపాయము దోచ దాయెనా? దానినిజ మావిరూపాక్షకోదండరామస్వాములకే తెలియవలయును. అంత పట్టణములో వారియాలయములు మట్టుకు చెక్కుచెదరకుండనున్నవి.

ఇకముందు మన మాపట్టణమును జూడబోదము.

## 5 వ ప్రకరణము.

# మాతంగపర్వతము.

పూర్వవిజయనగరమును జూచుటకు రెండుసాధనము లున్నవి. హంపీ కేగిన వెంటనే, యొకింత విచారించినచో ఊరు జూపించు కూలీలు కొందరు దొరుకుదురు. వారిని నమ్ముకొనిన యెడల, మనకాళ్లశక్తికొలది యందందు ద్రిప్పి, యది యిది యని చెప్పుచు, ప్రభుత్వములోని * Archaelogical Department వారు వ్రేలగట్టిన సూచకపత్రములకు (Boards)

* శిథిల నిర్మాణములు లోనగు చారిత్రిక వస్తువుల సంరక్షణము కొరకేర్పడిన ప్రభుత్వశాఖవారు.

కొన్ని చోట్ల నందునట్లు, కొన్నిచోట్ల నందనట్లు, మరికొన్ని యెడల వాటికి మన యూహాలకు నతీతములగునట్లు, నా యీ కట్టడముల స్థలముల నిరూపించి, సాయంకాలమునకు బసకు జేర్చుచు రెండుమూడుదినములలో మనపర్యటనమును ముగింతురు. వారిపై నాధారపడినవారికి, విజయనగరమనిన గుండ్లు, రాళ్లు, గుళ్లు, గోపురములు, పాడుబడ్డయిండ్లు, కోతులు, కొండముచ్చులు, మంచిపాలు, పెరుగు నున్నయొకప్రదేశ మనిపించును. రెండవసాధనము, పై శాఖవారి కొకప్పు డధ్యక్షుడుగ నున్న లాంగ్‌హర్ట్సు అను నాయన వ్రాసిన పుస్తకము. అది యాంగ్లేయభాషలో నున్నది. దానిసహాయముతో బూర్వస్థితి కొంత తెలియగలదు. కాని, మన సంప్రదాయము నెరుగక, అందలి పెద్దలను విచారించక తయారుచేసిన పుస్తక మగుటవలన, కొన్నిచోట్ల నది బెడదారి బెట్టున్నదని మాయనుభవము. మే మచటికి పదమూడుసారు లేగియుంటిమి. ఈ రెండుసాధనములను సంపూర్ణముగ వాడుకొనియుంటిమి. అంచలి పెద్దలతో గొన్నివిషయములను గురించి ముచ్చటించియుంటిమి. అన్నిటికన్న నాపట్టణమును సామ్రాజ్యమును నేలిన శ్రీదేవరాయవంశసంభూతులగు నానెగొంది సంస్థానాధీశ్వరుల రాజబంధువు లిర్వురితో, పై పెద్దలతో బలె ముచ్చటించుటే గాక, కొంతకాల మాయావిషయములను గూర్చి చర్చించియుంటిమి. అట్లులనడినపరిజ్ఞానము ననుసరించి యిందలి పర్యటనక్రమమును సమకూర్చియున్నాము.

పూర్వము విజయనగర తైర్థికులు, రైల్వే గైడులు చదువుకొని, దొరలవలె, కమలాపురము చేరి, యందు బంగళాలో బ్రవేశించి, దానిలో గాపలాయున్న కింకరుని నమ్ముకొనినచో, నణుమాత్రము లాభించదు. అందున్న నాలు గైదు రోజులు సుఖముగ నుండుట కది మంచిమార్గమే కాని మునుపటి పట్టణవిషయము తెలుసుకొనుట కది సాధనము కాదు. అందలి కుర్చీలతో, బల్లలతో, నాగరకతాసూచనలతో, సగము రసభంగమగును. పాడువడినపట్టణముల జూడ నెంచినవారు పాడువడ్డ స్థలములలోనే నివాస మేర్పరచుకొని యొకవిధమైన భావము కలిగి, యందలివిషయముల సంగ్రహించుటకు వీలైన మనోగతి యొనగూడును. సరియగు మనోగతి లేనిదే ఎట్టి విషయమును బోధపడదని మేము చెప్పనక్కరలేదు. అట్లగుట నటువంటి తైర్థికులందఱు, హంపీలో బస నేర్పరచుకొనుటయే మా మతము. అందు బసచేయుట కనువైన తావు లుండునా యని సంశయింప నక్కరలేదు. శ్రీ విరూపాక్షస్వామి, తన యాలయములో, గొన్ని వందల మంది సుఖముగ నివసించుటకు వసతుల నొసంగగలడు. అది బహిరంగముగ నుండు ననుకొనువారికి, దాని నానుకొని యున్న మఠములలో గదులు దొరకును. కాకున్న హంపీ బజారులోని యిండ్లలో నొకదానిలో బ్రవేశింపవచ్చును. అట్లు కావించినచో నెటుచూచినను శిథిలనిర్మాణములు సర్వదా కంటబడుచుండును. దానితో యాత్ర కనుకూలమైన మనస్థితి యొదవును.

అట్టివసతి నేర్పర్చుకొన్న వెనుక "నడ్డగోలుగ" నెట నుండియో బయలుదేరి యెటో తేలుటకన్న, దొలుత నాపట్ట ణావరణము నంతయు నొకవిధముగ మనోదర్పణములో ప్రతి బింబించుకొనుట మంచిది. దాని కత్యనుకూలమగు సాధన మొకటి హంపీలో నున్నది. హంపీ పర్వతమయ మని యిది వరలో జెప్పియుంటిమి. ఆపర్వతము లన్నిటిలో నత్యున్నతమై నది, శ్రీ విరూపాక్షుస్వామి కెదురుగ నున్నది. అది మా తంగపర్వతము. దాని నెక్కుటకు పడమర, యుత్తరమున దక్షిణమున మూడు సోపానపంక్తు లున్నవి. అన్నిటిలో నతిశిథిలమైనను, బశ్చిమసోపానపంక్తియే యనాయాసముగ నెక్కదగినది. దానినిబట్టి పైకేగినచో శిఖరముపై నొక దేవాలయ మున్నది. ఆయాలయఘుడాబాపై కెక్కి నల్గడల జూచినచో, బూర్వపట్టణావరణ మంతయు గనులగట్టినట్లు కా న్పించును.

ఒకపర్యాయము చుట్టును తల ద్రిప్పి చూచిన నాపట్టణ ప్రదేశ మంతయు మెరకపల్లములతో, గుట్టలతో, లోయలతో నిండియున్నట్లును, మనకు జూపుమేర దూరమున జుట్టును బర్వతపంక్తు లావరించియున్నట్లును నగపడును. అట్లగపడుస్థల ములో బెక్కుకట్టడములు, పాడుగోడలు, నందందు వెదజల్లి నట్లు పొడకట్టును. సూక్ష్మపరీక్ష ప్రారంభించుటకు, మన కుత్తరమున బ్రవహించుచున్న నది తూర్పుయొడ్డునుంచి యారంభించి చుట్టుకొని వత్తము. తూర్పున దూరమున వృక్షమయముగ గనబడునది నింభాపురము. వాలికాష్ఠ మం.

దే యున్నది. దానికి పశ్చిమమున నొకరోడ్డు దక్షిణపువైపున కేగుచున్నది. అది పూర్వ మానెగొందినుండి కమలాపురమేగు ఘంటాపథము. మన కొకింత యాగ్నేయమున నొకపర్వతము దానిపై నొకయాలయము నున్నవి. అది మాల్యవంతము. దానిపై నున్నది శ్రీరఘునాథస్వామి యాలయము. దానిలో నేడుగూడ పూజావిధులు జరుగుచున్నవి. దాని కావల దక్షిణమున గొన్నియిండ్లున్నవి. అదియే కమలాపురము. దానికి కొంచె మీశాన్యముగ నొక దేవాలయమున్నది. అది పట్టాభిరామస్వామి యాలయము. కమలాపురము నానుకొని యొకతటాక మున్నది. అది యా యూరి చెరువు. ఇక మనకు దక్షిణమున నొక పెద్దయావరణము, నందులో మరొక చిన్నయావరణము కోటగోడలతో దీర్చిన ట్లున్నవి. అందులో బెద్దది రాచనగరు, చిన్నది రాణివాసము. ఆయావరణములలో గొన్నిగట్టడము లందందున్నవి. అవి బహువిశాలములైనవి. పట్టణము బాగుండియున్నపుడం దెన్ని సౌధము లుండెడివో? ఎన్నియశ్వములు నేనుగులు నుండెడివో? ఎందరు భటులు, పహరావారు, నిందందు సంచరించుచుండెడివారో? ఎంత శోభగ నుండెడిదో? సరే! ఈయూహ లారంభించిన మనపరీక్ష తేలదు. మనకు నైరృతిగ గొన్నికట్టడములు మందిరములు, కనబడును. అవి రాయలవారి గుఱ్ఱపుపౌ జుండుకొట్టములు. వాని కొకింత యుత్తరమున నొకపెద్ద భయంకరవిగ్రహ మున్నది. అది ఉగ్రనరసింహవిగ్రహము. దానియెదుర మందిరపంక్తి నరసింహాపురము. దానికి కొంచె మీశాన్యమున నొకయాలయ

ము, దాని ముందుకొన్ని పొడవులై నమందిరముల వరుస లున్న
వి. ఆమందిరములు వచ్చివచ్చి, మనమున్న పర్వతమునకు గడున
మీపమున నాగుచున్నవి. ఆ యాలయము కృష్ణస్వామియా
లయము. ఆమందిరములు కృష్ణాపురము. మనకు పడమర నొక
పెద్దవీథి, దాని కెదుర నొక పెద్ద యాలయము నున్నది. అది
విరూపాక్షాలయము, పంపాపురము. విరూపాక్షాలయమునకు
దక్షిణమున నొక పర్వతము, దానిపై చిత్రమైన గోపురములు
గల దేవళములగుంపు నున్నవి. ఆ పర్వతము హేమకూటము.
గుళ్ళు జైనుల దేవుళ్ళగుళ్ళు.

ఇక విరూపాక్షాలయమున కుత్తరమున దుంగభద్రా
నది ప్రవహించుచున్నది. ఆనది పడమరనుండి వచ్చి మన
కెదురుగ షుమారు మూడుఫర్లాంగులవరకు నుత్తరముగ బారి,
మరల దూర్పునకు దిరిగి, నింభాపురప్రాంతముల దిరుగ నుత్త
రముఖమై ప్రవహించుచున్నది. మన కెదురుగ నది కుత్తరపు
వైపున గుండ్లుపేర్చినట్లొక కొండ యగుపించుచున్నది. అదియే
ఋశ్యమూకము. మన కెదుర మరొక చిన్నగుట్ట యున్నది.
మనకు కాన్పించదుగాని, దానికిముం దొకయాలయ మున్నది.
అది శ్రీ కోదండరామస్వామివారి యాలయము. నేడందు
పూజ జరుగుచున్నది. ఆయాలయమున కెదుర నొక ఫర్లాంగు
దూరమున నది యుత్తరముఖమై తూర్పునకు దిరుగబోవుచోటికి
మధ్యభాగమున, నొకతీర్థ మున్నది. అది చక్రతీర్థము. దా
నిలో వైదికు లనేకులు గ్రుంకుచుందురు. మతంగపర్వతము
నానుకొని యీశాన్యమున నొక పెద్ద యాలయము దాని

యెదుర నొక పెద్దబజారు నున్నవి. అవి అచ్యుతాలయము, లంజలబజారు. ఆ బజారుచివర దూర్పున కొక దారి యున్నది. ఆ దారి యొక విశాలమైనచట్టుపై కేగుచున్నది. ఆ చట్టుపై దిగువ, అనగా నుత్తరమున నొక కొల నున్నది. అది సీతాసరోవరము. దాని యెదుట దారిప్రక్క కొన్ని జైనాలయము లున్నవి. మనకు ఈశాన్యమున దూరమున నొక పెద్ద యాలయము, దాని యెదుర నొక దీర్ఘమైన వీథి కన్పడుచున్నది. ఆ యాలయము విఠలాలయము. ఆ వీథి విఠలాపురము. ఆ వీథి మనము మొదల జూచిన యానెగొంది కేగు ఘంటాపథము నానుకొన్నదా యనిపించుచున్నది.

ఇక నది కావలియొడ్డున మన కీశాన్యముగ నగపడు కోట యానెగొంది. దానిద్వారమునకు బడమర నొక కొండ కలదు, అది తలారిగట్టు. దాని వెనుక పంపాసరోవర మున్నది.

ఇవి మనకు స్పష్టముగ గాన్పించుభాగములు. ఆపట్టణము నైరృతిని హొస్పుపేటవరకు వ్యాపించియుండెను. దూరమున గొండలపై నెన్నియో కోటగోడలు పహరామందిరములు గనబడుచున్నవి. "ఆ కోటగోడలతీ రిది: ఈ పహరామందిర మీభాగమునకు" అని చెప్పుటకు నే డేలాటి యాధారములు లేవు. ఊహించుదమన్నను మనయూహల కందవు. ఇక నెల్లెడల మనకు పెక్కుకాల్వలు కాన్పించుచున్నవి. అవియే యానకట్టనుండి వచ్చిన నీరును బట్టణములో బంచిపెట్టు కాల్వలు.

 

మన కనుమేర కాగినప్రదేశము షుమారు పండ్రెండు మైళ్ల పొడుగు పదిమైళ్లవెడల్పు కలది. ఇది యిప్పుడు నిర్మా నుష్యము కాకపోయినను చాలవరకు బాడుపడియున్నది. ఒకసారి పట్టణము సజీవమైయుండగ నాప్రదేశ మెట్లుండియుం డునో యూహించుకొనుడు. ఎంత సందడి యుండెడిదో? ఎంత మంది జనులు తిరుగుచుండెడివారో? ఆ బజారు లెట్లుండెడి వో? ఆయాలయము లెట్లుండెడివో? ఆనదీతీర మెట్లుండియుం డునో? ఆనదివంక సీతాసరోవరము వైపున నొకింత పరిశీలిం పుడు. దాని కొకింతయీశాన్యమున బడిపోయిన తాలివం తెన కాన్పించుచున్నది. దాని కవతలియొడ్డున నొకచిన్న బయలున్నది. అది యింకను నీశాన్యముగ వ్యాపించి దూర ముననున్న పర్వతపంక్తిగుండ బోయి యవ్వల మరొక బైలు లో గలియుచున్నది. భూదేవి కెంత దయ లేదాయె! ఇనుప పెట్టెవంటి స్థలములో నీ కన్నెంత పెట్టినది! అదియే విజయ నగరమును ధ్వంసముచేయుటకు మహమ్మదీయులకు దారి నిచ్చినవైపు. విజయనగరపరిపాలకు లా లోటు నెరిగి దాని నెంతో బలపరచిరి. కాని విజయనగరతురుష్కులపౌజు, ఆకిటుకు నెరిగి, తాము శాత్రవుల గలిసినప్పుడు, దానిని వారి కెరింగించి 'కొంపదీసిరి'. అది యరులకు వశ్యముకాకుండ చేయుట కా పరిపాలకు లెంత కృషిచేసిరో మన మానెగొంది కేగినపుడు పరీక్షింతము. అరినిర్భేద్యమగు పట్టణమున కం దొక్కచోట లోపము కలిగినది!

6 వ ప్రకరణము.

# దేవాలయములు:

మాతంగపర్వతశిఖరంబుననుండి పట్టణావరణమును స్థూలముగ బారజూచినపుడు మన కనేకగోపురములు కాన్పించును. అవి యన్నియు దేవాలయగోపురములు. పూర్వ మెన్ని దేవాలయము లుండినది నేడు చెప్పజాలము. తురకవా రనేకాలయముల బడగొట్టియుండవలయును. పోగా మిగిలినవే నేడు షుమారు నూ రున్నవి. ఆపట్టణప్రదేశములో నడచునప్పుడెట్టివానికి "ఇన్ని దేవళము లెందులకా?" యని పించకపోదు. కొంచెము సావధానముగ విచారించినచో దానికి కారణములు తెలియవచ్చును. అప్పటివారికి మతముపై, మన కిప్పుడు గ్రహించుటకు శక్యముగాని యభిమాన ముండెను. అందువలననే, చెక్కుటకు వీలైనరాయి దొరకినచో, శిల్పు లెల్లెడల దేవతావిగ్రహముల జెక్కివేసినట్లు కాన్పించును. చివరకు నదీతలమున నున్నశిలలపై, లింగములు, నందులు, నందందు కాన్పించును. అంతేకాక, పురప్రదేశనైసర్గికస్థితివలన నాలయబాహుళ్య మేర్పడినట్లు తోచును. అనుదినమును, కొన్నిపట్ల త్రికాలములయందు, దేవుని సేవింప నెంచిన, పుర మతిదూరస్థలాంచిత మగుటంబట్టి, యొకటిరెండు దేవాలయములతో నాకోర్కి ఫలించదు. అందువలన వానిసంఖ్య కొంతవరకు పెరిగియుండనోపు. ఇక, రాజులు పురనిర్మాణము సేయునపుడు ఒక్కొక వీధి కొక్కొ

కయాలయ మేర్పరచిరని చెప్పియుంటిమి. ఆవీథివారా యాలయమున బూజించుటే వారిమత మని మన మూహింపవచ్చును. మరియు నప్పటివారివిగ్రహారాధనాభిమానము తురుష్కవైషమ్యముచే నభివృద్ధిచెందియుండును. పురినిండ నాలయము లుండిన తమ కానందముగ నుండుటేగాక, తురకలకు గనులు గుట్టి నట్లుండునని, కొంత వానిసంఖ్య పెంచియుందురు. అన్నిటికన్న మనలో నాలయనిర్మాణము, దేవతాప్రతిష్ఠ, మహాపుణ్యకార్యములుగ నేటికిని బాటించుచున్నాము. అందుచే ననేకులు ధనికులు, తమకు శక్తియొనగూడినపుడెల్ల, నాలయముల నిర్మింపించియుందురు. తగినధనముండవలయునుగాని, దేవతాప్రతిష్ఠకు, మనమతములో నున్నయవకాశము, ఇతర మతములలో లేదు. కొన్నివందలయాలయములు కట్టించుట కవకాశము మనపురాణములలోని దేవతలసంఖ్య వలన లభించు చున్నది.

పై యూహలనుబట్టి యన్నియాలయము లేల కట్టించిరో తెలుచున్నది. కాని విజయనగరాలయనిర్మాణమునకు కేవల మతాభిమానమే కారణము కాదని మామతము. అది ముఖ్యోద్దేశమైనను, వీథుల కెదురుగనున్న యాలయములలో గొన్ని, శాత్రవులు పురములో బ్రవేశించినపుడు, ఆ వీథి లోనున్నవారు తలదాచుకొనుట కేర్పరచిన కోట లేమో యని మాకు పెక్కుసారులు తోచినది. నిర్మాణకుల కట్టియుద్దేశ ముండియుండిన రెండు కార్యములు నెరవేరుచున్నవి: వీథి ప్రజకు దాగికొన జోటు దొరకుచున్నది - ఆలయమందలి

దేవతావిగ్రహములకు దగినకాపలా జరుగుచున్నది. కాకు న్న, నాలయముల వైశాల్యమునకు అందులో బ్రిదక్షిణ స్థల వైశాల్యమునకు, వేరొక యుద్దేశ మగుపించదు. అంతేగాక కొన్ని యాలయములలో, గర్భగుడిచుట్టు చీకటికోణములుగ నున్న ప్రిదక్షిణస్థలము లున్నవి. అవి మాయూహ నింకను బలపరచుచున్నవి. అందు కొన్నివందలమంది దాగి, కొంత కాల మెంతమందినైన, గర్భాలయద్వారమును సమీపించ నీయకుండ బోరాడవచ్చును. ఇంత చెప్పినను ఇది వట్టియూ హ యని, నిజ మేమో మాకు స్పష్టముగ దెలియదని మనవిచే సికొని, యిక నాయాలయము లెట్లున్నవో వర్ణించెదము.

చిన్న దేవళములు మన యూళ్లలోనివానివలెనే కట్టి యున్నవి. వానిని వర్ణించుట ఇచట ననవసరము. పెద్ద యాలయములకట్టడ మంతేయు జాలవర కొకటే విధముగ నున్నది. అన్నిటికి నున్నత ప్రాకారములు గోపురములు గలవు. గోపురములలో గొన్ని పెద్దవి, కొన్ని చిన్నవి యున్నవి. ప్రాకారములు కేవలము ఇంటిగోడలుగాక, కోట గోడలుగాక మధ్యస్థములుగ నున్నవి. ఆ గోడలలో మూడు పొరలు కాన్పించును. మధ్య సున్నముతో గట్టిన యిటుక గోడ, దాని నానుకొని లోపల వెలుపల రాతిగోడలు. ఆ రాతి పొరలరాళ్ళు, పొడవు, మందము కలవి, చక్కగ జెక్కినవి. రాతికి రాతికి కప్పులు తీసి కూసములు గొట్టి బిగించిరి. కాని సున్నముతో గట్టలేదు. కాబట్టి, ఎవరైన వానిని పడ గొట్టనెంచిన మొదట రాతిగోడపొరను, వెనుక నిటుకగోడ

పొరను, ఆపైన మరల రాతిగోడ పొరను బడగొట్టినగాని ప్రాకారము పడదు. ఆయాలయము లొక్కొకపట్టున గోటల వలె నుండవలె ననుకొనకుండినపక్షమున, నాగోడల నంత దృఢములుగ నేల కట్టించిరో!

ఆలయములో సింహద్వారముగుండ ప్రవేశించినంతనే కొన్నియాలయములలో నతివిశాలమైన ఖాళీస్థలము కాన్పిం చును. కొన్నిచోట్ల నాస్థలములలో వందలకొలది నివసింప వసతి యున్నది. కొన్నియాలయములలో నాలయముచుట్టు, ప్రాకారము నానుకొని, అనగా దానిని వెలుపల గోడజేసి, యెన్నో మందిరములు కట్టియున్నారు. అవి స్వామిని సేవింప వచ్చిన తైర్థికులకోసము ద్దేశించినట్లే తోచును. ఇక స్వామికి కళ్యాణాది యుత్సవకార్యములకు గావలసిన మంటపము లనే కము లుండును. ఆమంటపములు వట్టి స్తంభములపై నిలువక ముఖ్యముగ విఠలాలయములో, నతిసుందరమైన శిల్పముతో నిండియున్న స్తంభములపై నున్నవి. ముఖమంటపములు, గర్భాలయములుకూడ నట్లే శిల్పశోభతో నొప్పారుచున్నవి. కొన్నియాలయములలో బైజెప్పిన రహస్య ప్రదక్షిణప్రదే శము లున్నవి.

ఆలయములలో బ్రితిభాగము రాతికట్టడమే యని చెప్పనక్కరలేదు. ఎట్టివానికిని వానిని నొకింత స్థూలముగ బరీక్షించినతోడనే "ఈయాలయములలో దూలముల క్రింద పట్టెలకిరింద పైకెక్కిన రాళ్ళు, చక్కగ జెక్కిన యా చూరు రాళ్లు, ఒక్కొకసారి నలుబది యేబది యడుగులపొడవున,

నలువైపుల షుమారు రెండడుగుల వెడలుపున నున్నవే! వీని నొకపదియడుగులు నేలపై గదిలించవలెనన్న నెన్ని యె డ్లనో, యెంతమంది మనుష్యులనో నియమించినగాని కద లవే! అస లూరక నొకపక్కకు బొరలించ నెంచిననే షుమా రిరువది పలుగులతో మీటినగాని కదలవే! అట్టిచో నంతంత భారములైన శిలలను, రమారమి పండ్రెండడుగులు మొద లుకొని యిరువది ముప్పది యడుగులయెత్తున కెట్లు లేపిరా! లేపి, కొల్తలు తప్పకుండ నాయాచోటుల నెట్లు నిల్పిరా! ఆ పని చేసినవారు మనుష్యులా! దేవతలా! లేక రాక్షసులా!" యని యాశ్చర్యము తోపకపోదు. దానికి సమాధానము మన మూహింపవలసిన దేగాని యింకొకసాధనము లేదు. మన వాస్తుశాస్త్రములో దీని కేలాటి యుపాయమును జెప్పి యుండలేదు. నేడు జీవించియున్నవారిలో నెవ్వరు, మనపూ ర్వు లాయద్భుతకార్యము నెట్లు నెరవేర్చిరో చెప్పెడువారు లేరు. కావున మన కూహతప్ప మరియొక యాశ్రయము లేదు. ఒక పాశ్చాత్యుడు వ్రాసినట్లు "యేవిద్యుచ్ఛక్తిచేతనో యా రాళ్లను బైకెత్తి నిల్పిరి" యనుట హాస్యాస్పదులమ గుటకు మార్గమే కాని యారాళ్ల నొకయంగుళము కదల్చు టకు మార్గము కాదు. మాకీయచ్చెరువు చాలకాల ముండి, మేము ఎనిమిదవపర్యాయ మందేగినపుడు చెంగప్పయని - ఇంకను బాపము! జీవించియున్నాడో, లేడో - యందున్న గోసా యి నొకని పృచ్ఛచేసితిమి. దాని కతఁడు తడవుకోకుండ - అత డు తెలుగు, అందులో నచ్చతెలుగు, కడుచక్కగ మాట్లా

డును - "అం దేమబ్బురం సామీ. మేరువలుగట్టి పైకి దొబ్బి" గని చెప్పెను. ఆమాటలు వినినంతమాత్రమున మా కావిషయములో మునుపటికన్న జ్ఞాన మెంతమాత్రము నభివృద్ధి కాలేదు! మావెల్ల మొగములు జూచి యతిని యచ్చ తెలుగు ముద్దుపల్కులతో సమాధానమును విప్పిచెప్పెను. దాని కర్థమిది. "మేరువ గట్టి బలమైన దూలములను ఏటవాలుగబెట్టి - ఆరాళ్లను - పైకిదొబ్బిరి= పైకిత్రోసిరి." కాబట్టి కొయ్యదూలములనో, రాతిదూలములనో, కావలసిన యెత్తుకు నేలమీదనుండి యేటవాలుగ నిలుచున్న స్తంభము మీదికి మోపి, మనుష్యులచేతనో, లేక యేనుగులచేతనో, యారాళ్లను పైకిత్రోయించిరియని యర్థము. అది యుక్తికి సరిపోయినది. అంతేగాక, పూర్వ మేన్గులచే ననేక కార్యములను జేయించెడువారు. ఇప్పటికిని బర్మాదేశములో - అదియే యేన్గుల జన్మభూములలో బ్రధానమైనది - పెద్ద పెద్ద టేకు దూలముల నేన్గులచే మోయించి దూరస్థలములకు గొంపోయి, ప్రోగులువెట్టించుచున్నారు. కొయ్యదూలముల నెత్తిన యేన్గులు రాతివాటి నెత్తలేవా? తరిఫీదుచేసి, నాలుగైదేనుగులచేత నొకటేసారి యొకపెద్దదూలము నెత్తించవచ్చును. ఈకట్టడములలో నట్టిరాళ్లను జాలవర కేన్గులచేతనే పైకెత్తించి రని మాయభిప్రాయము. విజయనగరమువారికి కొన్నివేలయేనుగు లుండెనుగదా! యుద్ధములు లేనపుడు వానిచే నీపని చేయించియుందురు. దీని కొకటే పూర్వపక్షము. "పదియడుగుల యెత్తైనసరే: అంతకన్న పై యెత్తు ఏయేన్గ కంది

నది'' యని. దానికి సమాధానము. "ఆయెత్తుకు లేచినరాతి నందు నిలిపి, పైకి ఏకప్పీలమీదనో త్రాళ్ళతోనో, గొలుసులతోనో, మనుష్యులచేతనో, యేనుగులచేతనో లాగించి, కావలసినయెత్తున నిల్పెదువారు.'' ఈ యేన్గుల "మేళము" లేకుండ మొదటినుండి కావలసియెత్తునకు స్తంభములను బాతి, వానికి పెద్దపెద్ద కప్పీలనుగట్టి, యారాళ్ళను మనుష్యులచేతనో, యేన్గులచేతనో లాగించెదువారు. ఇది యన్నిటికన్న సులభమైన మార్గము.

ఇట్లు కట్టించిన మంటపములకు, నాలయములకు, లోపలిభాగ మొక్కొకప్పుడు సున్నముతో గిలాబాచేయించి నట్లు తోచుచున్నది. విరూపాక్షాలయముఖమంటపములో నొకవిచిత్రము చూచితిమి. దానికప్పు లోపలిభాగమున ననేక చిత్రము లున్నవి. అవి కొంచెము నిదానించి చూచినచో మాంచిన్నతనమున గాజుమీద దేవతావిగ్రహముల రంగులతో జిత్రించి యమ్మెదువారు. అట్టి పటములు ఇప్పటికి కొందరిండ్లలో గాన్పించును. ఆపైభాగముననున్న బొమ్మలన్నియు నట్లే చిత్రించినట్లు తోచుచున్నది. చాకలివాని కుంచె వానిని గజిబిజిగ నలికిపెట్టినది కాని, చక్కగ గడిగించిన, నవి యెంత శోభాయమానముగ నుండునో! మరియొక చిత్రము! దాని నందేగాక విఠలాలయమున గూడ జూచితిమి. ఆచిత్రములు గీయుటయం దొకయూహాయున్నట్లు తోచును. నే డొక మూర్ఖుని గొంపోయి యాచిత్రముల జూపించి, మన పురాణములలో ననేకకథల నతిసులభముగ నతనికి చెప్ప

వచ్చును. కాబట్టి చిత్రమునఁగూడ మనపూర్వులు పురాణ గాథాప్రదర్శనము చేసియున్నారు. అందువలన నచటికేగిన ప్రతిభక్తునకు పురాణాభిమానము పైబడి, దేవతాపూజకు బురికొల్పుచుండెను. అట్లు మందిరము లన్నియు బురాణ చిత్రసుచిత్రితములై యుండ నాయాలయము లెట్లుండియుండె డివో! విఠలాలయమున పైచిల్కలకు, రాతులకు, షుమారు మూడువందల సంవత్సరములనాడు వేసిన రంగులు నేటికిని మాయలేదు. నేటి రంగు లొక నెల, కాకున్న యేడాదిలో, మాసిపోవుచున్న వే! ఆరంగుల నేపదార్థములతో గలిపిరో? దానికి రసాయనశాస్త్రజ్ఞులు సమాధానము చెప్పుదురు గాక.

ఆలయములలో మూలవిరాట్టు లతిసుందరముగ నుండెడి వని చెప్పవలసినదే గాని, యిట్లుండె నని వర్ణించుట కంతగ వీలులేదు. మన మహమ్మదీయసోదరు లేతెంచి నపుడు, వారి కావిగ్రహములు తొలిముద్దలై యుండవలెను. అందువలన నాలయములలో నవి పెక్కులు కాన్పించవు. ఇక నున్నవాటినిబట్టి యూహింతము. ఆలయమంటప స్తంభము లపై నంత చక్కని విగ్రహములను జెక్కించినవారు, ఆల యమందలి మూలవిరాట్టుల నంతకన్న జక్కనివాని జెక్కించి యుందురు. పూజ జరుగుచున్న శ్రీ కోదండరామస్వామి విగ్రహము, మాల్యవంతమందలి శ్రీ రఘునాథస్వామివారి విగ్రహము జూచినచో, నితర దేవళములలోనివి కూడ నట్లేయందముగ నుండియుండు ననిపించును. పూజా పురస్కార

ములు లేక, ముక్కులు తెగి, కాళ్ళు తెగి, చేతులు తెగి, యందందు పడియున్నవానిని జూచినను, నా విగ్రహములు కడు సొంపులుగ నుండెడివని యనిపించకపోదు. ఈ సంద ర్భమున మనము రెండు విషయములను గమనించవలెను. ఆ కాలములో విజయనగరపట్టణము, దక్షిణ హిందూస్థానమం దెల్ల వ్యాపించిన సామ్రాజ్యమునకు రాజధాని. ఏ వృత్తిలో నైన, ఏ పనిలోనైన, నారి తేరినవారు, ప్రయోజకులు నక్కడ జేరియుందురు. అట్లు రాక కొందరింటిపట్టుల నున్నను వారికీర్తిని విని రాజులు వారి నెట్లయిన రాజధానికి రప్పించి యుందురు. గొప్ప గొప్ప కవులు, గాయకులు, నందు మూగి నట్లే, గొప్పశిల్పులుకూడ నందు చేరియుందురు. కావున నావిగ్రహము లన్నియు మంచి ప్రవీణులైన శిల్పులచే జెక్కించియుందురు. అందువలన వానియందమున నెట్టిలోప మును నుండియుండదు. రెండవది - విజయనగరరాజులకు ముఖ్యముగ, శ్రీకృష్ణదేవరాయలకు, విజయనగరమును దక్షిణ హిందూస్థానమున నెల్ల బట్టణరాజ మనిపించవలెనని, వీలైన చో, నన్నింటిలోను బుణ్యస్థల మనిపించవలెనని కోర్కి యుండినట్లు కొన్నిటివలన మనకు దోచుచున్నది. అందువ లన దూరదేశమున నున్న మంచివిగ్రహములను దెచ్చి విజ యనగరమున బునఃప్రతిష్ఠలో, లేక ప్రతిష్ఠలో - బహుశః రెండవదియే యైయుండును - చేయించినట్లు తోచును. కృష్ణ రాయ లుదయగిరిదుర్గమును బట్టుకొనినంతనే, యందున్న కృష్ణ స్వామివిగ్రహమును - అది పూజాపురస్కారయుతమై యుం డెనో లేక యుండలి యాలయమున బ్రతిష్ఠించ జెక్కించి

యుంచిరో తెలియదు - జూచి, అది యతిసుందరమైనదని దలచి, దానికై విజయనగరమున విరూపాక్షాలయమున కన తిదూరముగ దక్షిణమున నొక యాలయమును గట్టించి, యావిగ్రహమును విజయనగరమునకు దెచ్చి, యందు బ్రతిష్ఠిం చెను. అక్లే పంథర్ పురముననున్న విఠోబాయాలయ మాస్వామి మహత్తునకు దగినట్లు లేదని విచారించి, యాభూపాలు డాస్వా మి కనువగు నాలయమును, విఠలాలయమను పేర నొకదానిని విజయనగరములో గట్టింప బ్రారంభించె. దురదృష్టవశమున నాలయము పూర్తి కానిదే మృతినొందె. ఆయన తరువాత వచ్చిన రాజు లాస్వామివిగ్రహమువంటి దానినే చెక్కించి యందు ప్రతిష్ఠించి రందురు. దీనినిబట్టికూడ తమరాజ్యము లో నందమైనవిగ్రహము లున్న వానిని సాధ్యమైనపు డెల్ల రాజధానిలో జేర్చుచుండిరి. అందుచేగూడ నావిగ్రహములు అందములో వేనికిని దీసిపోకుండెనని యెంచవలసియున్నది.

పూర్వవిజయనగరమందలి దేవాలయముల సంగతి వ్రాయునపుడు, విజయనగరాధీశ్వరుల కిలవేల్పై, నేటికిని వారివంశీయులకొరకొక ద్వారమును దెరపించుచు, ప్రతి మాసము కొన్ని వేలభక్తులపూజ లందుచున్న శ్రీవిరూ పాక్షస్వామివారి యాలయమును వర్ణింపకుండుట మాయాస్తి కత్వమునకు లోపమగును. శ్రీ స్వామివారి యాలయము తుంగభద్రానదీతీరమున నేటి హంపీబజారున కెదురుగ నున్నది. ఆలయము తూర్పుముఖమైయున్నది. దానిప్రాకా రమున నాల్గువైపుల నాలుగు గోపురము లున్నవి. ప్రాగ్గోపుర

మన్నిటికన్న నున్నతమైనది. ఆగోపురముక్రింద పెద్దదర్వాజాను దాటి లోనికి ప్రవేశించినంతనే, కొన్నివందలమందికి వసతిగల ఖాళీస్థల మున్నది. కుడి యెడమవైపుల నాద్వారమున కెదురుగ రెండుపెద్దమంటపము లున్నవి. ఆగోపురమున కెదురుగ నింకొక చిన్న గోపుర మున్నది. అది మరొక గోడ నడుమ నున్నది. దానిగుండ లోని కేగగనే కుడియెడమవైపుల దూర్పుపడమర గోడల నానుకొని, విశాలములైన మంటప పంక్తులు కలవు. దానిద్వారమున కెదురుగ ధ్వజస్తంభము, శ్రీ కృష్ణరాయశాసన స్తంభము, గర్భాలయము, ముఖమంటపము కలవు. వానిని ప్రదక్షిణముజేసి ముఖమంటప మెక్కి-పై భాగము చూచినచో నెట్లుండునది యిదివరకే వర్ణించియున్నాము. దానిని నలువైపులజూచి లోని కేగగనే, ప్రాగ్దక్షిణోత్తరపశ్చిమద్వారము లగుపించును. ఉత్తరద్వారము శ్రీ ఆనెగొందిసంస్థానాధీశ్వరులు దేవుని సేవింపవచ్చినపుడుమట్టుకు దెరచెదరు. పాపము! ఆరాజులకు నేటికి మిగిలిన గౌరవములలో నిది యొకటి! మామూలు నందీశ్వరుడు, నన్నియు నం దున్నవి. గర్భాలయములోని కేగినంతనే, యాత్రికులతొ్రిక్కిడి కాగుట కీమధ్య నేర్పరచిన యినుపకమ్మీల తలుపొకటి కలదు. ఆడువారిని బ్రాహ్మణేతరవర్ణములవారిని లోనికి రానీయరు. శ్రీవారి కభిషేకము సేయుసందర్భమున మాకు లోనికి బోవుపుణ్య మబ్బినది. మూలవిరాట్టు పానవట్టము, స్వయంభువములని యందున్న దీపకాంతితో జూచినంతనే యగుపడును. శ్రీ విరూపాక్షలింగము మాజేనతో జేనెడుపై నొకబెత్తెడు

న్నది. అం దాసీనులమై పూజసేయుచున్నంతకాలము, నెట్టి వారమైన, నపరిమితభక్తిరసావేశుల మగుదు మనుట కెట్టి సందేహమును లేదు. అంతయు జీర్ణించి, భక్తిగుణ మాత్మ తత్త్వములో సగపడ బల ముడిగి కృశించియున్న యీకాల ములోనే యట్లనిపించిన, ఆకాలములో ఆస్వామి యీప్సి తార్థముల దప్పక నొసంగునని, ఆస్వామి కన్నుదెరచిన సకల చరాచరసృష్టిప్రపంచము భస్మమగునని, నమ్మినకాల ములో నెట్లుండియుండునో ?! ఇక గర్భాలయమునకు వెనుక మొదల మనము చొచ్చిన ప్రాకారమును చుట్టుకొనిరా బశ్చి మమున నేర్పడ్డగోడ, దానికొక ద్వారము కలదు. ఇక ప్రాకారోత్తరద్వారముగుండ నేగినచో, మరొక గోపురము, శిథిలసోపానములు, తుంగభద్రాస్రవంతి కాన్పించును.

పట్టణమందలి యాలయములకు నీటివసతి నతిసుకర ముగ గల్పించిరి. కలదుగదా ఆనకట్ట పుణ్యమాయని యూర ప్రవేశించిన తుంగభద్రానీరము ?! ఎక్కునంతవరకు దానిని కాల్వలగుండ నాలయములలోనే ప్రవహింపజేయుచు వచ్చిరి. అట్టికాల్వ శ్రీ విరూపాక్షాలయములో నేటికిని ప్రవహించుచున్నది. అభిషేకమునకు నీరు దగ్గరనుండిన బాగుండునని యెంచి యొకశివాలయములో - ఉగ్రనృసింహ విగ్రహమున కెడమవైపుననున్న దానిలో- ఆలయము లోతట్టు నొక తటాకమునుజేసి లింగమును దానిలో నిల్పిరి. ఆనీర మెక్కని యాలయములకు బావులను ద్రవ్వించి, దాని నీర మును రాతికాల్వలగుండ నాయాలయములకు రప్పించిరి.

అట్టివానిలో విఠలాలయ మొకటి. మొత్తమునకు 'నిత్యకర్మకు, గావలసిన నీటిసదుపాయ మాలోచించనిదే యాలయములను గట్టించలేదనవచ్చును.

'అనుదినము ఇన్ని యాలయముల పూజావిధు లెట్లు జరిగెడివో? దానికి గావలసిన ధన మెందుండి వచ్చునో?' యని మనకు తోచకపోదు. ఈ ఆలయము లన్నిటిమీద నొక యధికారి, వానికి తగు సిబ్బంది యుండెడివారు. ఆ దేవుల నిత్యపూజలకును నుత్సవములకును గావలసిన ధనము దానములవలన, భక్తులు నిత్యము వచ్చి యిచ్చి పోవు సుంక ములవలన దొరకుచుండెను. ఆ దానము లనిన కొంతధన మిచ్చి పోవుటకాదు. రాజు లొక్కొక దేవతకు, దమ రాజ్యములో గొన్ని గ్రామములనే మాన్యముల నిచ్చుచుండిరి. అట్లిచ్చిన శాసనము లా యాలయ భిత్తికలమీద నేటికిని జదువవచ్చును. వారేగాక చూడవచ్చిన గొప్పవారు, బహుళ ధనవిరాళ ములను, గొన్నిమార్లు నిత్యకర్మల కింతింతయని విరాళము లను నిచ్చి పోవుచుండిరి. వీటి నన్నిటిని జాగ్రత్తపరచి వాని ఆదాయ వ్యయముల లెక్కలు వ్రాయించి, తనిఖీ చేసి; యాలయముపైన బైజెప్పిన యధికారి 'యజ్మాయిషీ' చేయు చుండెడివాడు. అన్నిటితో బాటా లెక్కలుగూడ అనుదినమో వారమునకు, పక్షమున కొకసారియో, మంత్రియో, చక్రి వర్తియో, లేక యిర్వురునో తనిఖీ చేయుచుండిరి.

తల యెత్తినపుడెల్ల గాన్పించు విషయము కనుక, మనమతమునకు ముఖ్యమైన విషయము గనుక, యింతమా

త్రము వ్రాయకున్న అప్పటివారి కందఱికి మతపుపిచ్చి పట్టి 'వే లంవెఱ్ఱిగ' దేవళములను గట్టించి రనుకొందురని వానిని గురిం చియింత 'కాలక్షేపము' చేసితిమి. ఇకముం దూరు చూడ బోదము.

## 7 వ ప్రకరణము

# రాచనగరు-కచేరీలు.

మనకు పురాణచర్చతో, జరిత్రావలోకనముతో, మరి కొన్ని విషయములతో నింతవరకు గాలయాపనమైనది. ఆసం దడిలో నూరుచూచుపని వెనుకబడినది. ఇంతట నాపని మీద బయలు దేరుదము.

విరూపాక్షాలయమునుండి దక్షిణోన్ముఖముగ బోద ము. దానికి వందగజముల దూరములోనున్న గణేశాలయ మును జూతము రండు. చూడు డావిగ్రహ మెంతదియో! షుమా రిరువది ముప్పదియడుగుల యెత్తుననున్నది. అయిదారు గజముల వెడల్పున్నది. పాపము! ఈవినాయకునకు బాదపూ జయేగాని శిరస్సున బూజనేయించుకొను గీత లేనట్లున్నది. అప్పటి మనుష్యులు రాక్షసులు కారుకదా! కాని చూచితిరా యీవిగ్రహమును జెడగొట్టవలెనని మన తురకతమ్ములు పడినపాట్లు! ఆకొండను బొడిచేయుట వారి కలవియైనదికాదు కాబోలు. ఇచ్చటనుండి దక్షిణమున కొక ఘంటాపథమేగు చున్నది. ఆకనబడు మందిరములు పంపాపురదక్షిణద్వార

మందిరములు. వానిలో బాటపాడునడియున్నది. దానిలోగుండ నేగితి మనకొందము. ఒక పెద్దయాలయ మగుపించుచున్నది.

అదియే కృష్ణస్వామి యాలయము. దానిగోపురము, ద్వారము శిథిలావస్థలో నున్నవి. అందులకని ప్రభుత్వమువా రాదారిమధ్య నొక ఫోటీ స్తంభము కట్టి యాకట్టినారు. కాని యెదురుగనున్న మందిరపంక్తుల నొకసారి తిలకింపుడు. అదియే మునుపటి కృష్ణాపురము. మనుష్యనివాసము లున్న పుడు ఎట్లుండియుండునో! సరే! దక్షిణద్వారముగుండ లోని కేగుదము రండు. అబ్బా! ప్రాగ్గోపురమునుండి ఆలయమువరకు నెంత విశాలమైనస్థల మున్నది? ఆగోపురముపై చిత్తరువు లలో నొకసైన్య మెందో యేగుచున్నది? అప్రతిమలలో నెంత జీవ మున్నదో చూడుఁడు. ఆలయమునకుముం దొకశాసన మున్నది. అది శ్రీ కృష్ణరాయలశాసనము. ఉదయగిరి విజయము లోనగువిషయముల వర్ణించుచు నాలయస్థాన మును గురించి చెప్పుచున్నది. ఇక నా ముఖమంటప మెంత సొంపుగ నున్నది? ఎంత విశాలముగ నున్నది! కాని నెత్తినబడు నేమో యనుపించుచున్నది. గర్భాలయములోని కేగుదము. అందేమున్నది? ఏమి లేదు. విగ్రాహ్యగ్రహము లేదు. ఆలయ ముచుట్టు విశాలముగనే యున్నది. ప్రాకార మెంత యెత్తుగ నున్నది! కోట గోడలవలె నున్నది. ఆలయమునకు దక్షిణ మున నొక కట్టడ మున్నది. బహుశః అది ధాన్యపుకొట్టని తోచుచున్నది.

అక్కడనుండి కృష్ణాపురపు దక్షిణపు దర్వాజాగుండ నరసింహాపురమున కేగుదము. మనకు గుడివైపున రెండు ఆలయము లున్నవి. అవి నరసింహాలయము, శివాలయము. ఉగ్రనరసింహవిగ్రహము దూరముననే భయంకరముగ నున్నది. దాని యెదుర, మునుపటి వీథిగృహశ్రేణులైన మందిరములలో, దక్షిణపు వరుసగుండ, పురాభృత్యమువారు దారి నమర్చినారు. సమీపించిన నా విగ్రహ మింకను భయము గొల్పుచున్నది. మనలో బొడగరి యెక్కినచో స్వామి మోకాలుగూడ యందకున్నవి. ఆ గణేశ విగ్రహమువలెనే యెత్తుగ వెడల్పుగ నున్నది. మహమ్మదీయ సోదరులు కసిదీర కాలుచేతులు దెగవేసిరి. పాపము! హిరణ్యకశిపున కా స్వామి చేసిన శిక్ష కినుమడిగ దురకలు తల నరకినారు. కాని, యేమి యీ చోద్యము! నృసింహు డెక్కడ నున్నాడు. కొంచెము పురాణము జ్ఞప్తికి తెచ్చుకొందము. వర మేమని? వాని మరణము "ఉన్న సృష్టిలో నెద్దానిచేతను గాదు. భూమ్యాకాశములలో నెందును గాదు." అని కాదు? హిరణ్యకశిపుని "హిరణ్యాక్ష" వరము! ఇక్కడ నృసింహస్వామి శేషునిచుట్టలపై గూర్చునియున్నాడు. అవిగో! నెత్తిమీద నాదిశేషుపడగలు! అర్థ మేమో! ఓహో! హిరణ్యకశిపుని వధించుటకు స్థలము, ఏమీలేని యెందును గాని స్థలము కావలె. అంత విగ్రహము నిరాధారముగ వ్రేలాడలేదుకద? అందులకని శేషునిచుట్టలపై గూర్చుండ బెట్టినాడు. శేషునిలో నేమున్నది?. సర్పరాజు వాయుభోజ

నుండుకదా! కాబట్టి గాలిపై నరసింహవిగ్రహమును గూర్చుండబెట్టినాడు. విగ్రహ మెంత భీకరముగ నున్నదో శిల్పికవిత్వ మంత గంభీరముగ, మనోహరముగ నున్నది.

ఇక దానికు త్తరముననున్న శివాలయమును జూతము. లింగము షుమారు పండ్రెండడుగుల యెత్తున నున్నది. ఆలయము లోతట్టు తుంగభద్రోదకము కాల్వగుండ నేటికిని బారుచున్నది. ఇదియే యభిషేకమునకు కడు వీలుగ నున్నదని గతప్రకరణములో జెప్పిన యాలయము. విజయనగరాధిపులు మహారాజులు. వారు తలచికొనిన నేది కొదవ? తుంగభద్రనే యాలయములో బారించినారు.

ఇటనుండి దక్షిణమేగుకొలది రెండుమూడు ఫర్లాంగుల వరకు నొకపెద్ద బయలువలె కాన్పించుచున్నది. కాని యందందు కట్టడములు మందిరస్వరూపములు కనబడుచున్నవి. అవి యన్నియు మును పేవీథివో గాని యిండ్లు. ఆయూరు చంద్రశేఖరపురమేమో! ఏలన, మన కెదురుగ జంద్రశేఖరాలయ మగపడుచున్నది. దాని కొకింత పడమరగ మందిరముల వరుస లున్నవి. ఇది పూర్వము రాతు లుండిన స్థలమట! అందుచే నింత శిథిలమైనదేమో?! మహమ్మదీయు లూరిలో ప్రవేశించినపు డిచ్చోట నెంతయుద్ధము జరిగియుండునో! లేకున్న నూ రిచట నింతపాడువడి బయలుగా నున్న దెందులకు?! చంద్రశేఖరాలయములో నేటికిని పూజ జరుగుచున్నది. లోనికేగి దేవునికి నమస్కరించి విభూతిని బుచ్చుకొని పోవుదము రండు.

అచ్చటనుండి మన మార్గ మొకింతదూరము దక్షిణ మేగి తూర్పునకు దిరుగుచున్నది. కొంతదూర మేగి మరల దక్షిణమునకు దిరిగి మరల తూర్పుముఖ మగుచున్నది. ఈ మలుపులు తిరుగగనే కాన్పించు ఆ పెద్దకోటగోడను చూడుడు. పామువలె కొండలపై బ్రాకుచు నుత్తరదక్షిణముల కేగుచున్నది! అదియే మునుపుచెప్పిన రాచనగరునకు మొదటి యావరణము. ఇదిగో! ద్వారము. దారి యెట్లు మలుపుతిరిగిన దో చూచి లోనికిపోదము. మలు పెందులకో?! క్రిందనడుచువారు ఆబురుజుమీదనున్న ఫిరంగిదెబ్బను దప్పుకొనగల రేమో విచారింపుడు.

అక్కడనుండి షుమా రొకటిన్నర ఫర్లాంగుదూర మేగునప్పటికి, ప్రభుత్వము వారు నేడు మనవంటి యాత్రికుల కోసము మునుపటి ఘంటాపథముపై నమర్చినరోడ్డు రెండుభాగము లగుచున్నది. కుడివైపుది కమలాపుర మేగును. మగిడివచ్చునపు డద్దానిపై వత్తుము. ఎడమవైపుది ఒకపాడుబావి నానుకొని అసలు రాచనగరులోని కేగుచున్నది. కాని అవి రెండును జీలెడుచోట రెండు పెద్దబండ లున్నవి. చూడుడు! వానిని 'నక్కా చెల్లెలుగుం' డ్లందురు. వానిలో నొకఫిరంగిని బెట్టిన నా దారిని నడచుట దుర్లభము. అ ల్లెడమవైపురోడ్డున బోవునపుడు మనము కొన్నిదిబ్బలపై నేగుచున్నా మని యనుమానము తోచును. వానిని త్రవ్వించినచో గొన్ని పూర్వనగరవిషయములు బయల్పడగలవు. సరే! మనకు గుడివైపున నగుపించు దేవాలయమును జూతము, రండు.

అది పాతాళశివాలయము. అనగా దానిలోని కేగు కొలది నది పాతాళలోకములోని కేగుచున్నట్లు తోచును. పోవుకొలది క్రిందికి దిగవలెను. పండ్రెండు మాసములలో షుమారెనిమిది మాసములు, గర్భాలయము నీటిలో మునిగి యుండును. వేసవికాలములోమటుకది యెండియుండును. లోనంతయు తురకలధాటికి పాడువడియున్నది. దానిలో నొకరాతి బల్లయున్నది. ఎంతసొంపుగ జెక్కిరో! కూర్చుండుభాగ మెంత నున్నగ 'జతిగి' బట్టిరో చూడుడు! సరేకాని! ఈ పాతాళాలయము యెందులకు? ఎవరుచెప్పగలరు. ఏవిజయనగరమహారాజున కాయూహ తోచెనో "భూమిపై నే యాలయము లేల యుండవలె, భూమిలోనికి త్రవ్వి యొకదాని నేల నిర్మింపరాదు?" అని. ఈయాలయము తయారైనది. ఒకమూల బగులగొట్టిన విగ్రహము లున్నవి. అందముగనే యున్నవి.

అందుండి ముందునకు బోవునపుడు చిన్నచిన్న యడ్డదారు లగపడును. అవియన్నియు ప్రభుత్వమువారు నేడు కట్టడములజూడవచ్చినవారికొరకు నేర్పరచినవి. మనము ఎడమవైపున బోవు పెద్దమార్గముననే పోదము. అది ప్రాఙ్ముఖమగు చోట నొక యావరణము కట్టడము నున్నవి. దానికి ప్రభుత్వమువారు 'ధననాయకుని భవనము' అని పేరిడి యున్నారు. ధననాయకుడనగా కోటకధికారి. ఎక్కడనైనకలదా! కోటకధికారికి రాచనగరములో భవనమును గట్టించి యిత్తురా! ఉండమనిన నందుబాటులో రాచనగరమునకు దగ్గరలో నుండునట్లు విధింతురుగాక! నిజమునకది "చాకలిదాని మేడ"

ఏమీవిపరీతము? రాచనగరమేమిటి చాకలిదాని మేడయేమిటి? రాయలవారి బట్టలుతికిన చాకలిదానిదా ?! చాకలివాడు లేడా ?! చాకలిదానికేల ప్రాముఖ్యతవచ్చె ?! అని మీరు శంకచేయకూడదు. మనము చూచుచున్నది రాచనగరు ఎవరిరాచనగరు ? భూపాలుర నగరు. ఆరాజులలో నొక్కొకరు కొన్నివందలమందిని వివాహమాడెడువారు. శ్రీ కృష్ణదేవ రాయలకు కొన్నివందలమంది భార్యలో, యుంపుడుకత్తెలో, యుండిరని యొకపాశ్చాత్యప్రయాణికుడు చెప్పియున్నాడు. అట్టిచో నేరాయలకైన, నొక చాకలిదానిని దగ్గరకు దీయ వలెనని తోచకూడదా ? తోచినది. ఆయదృష్టవంతురాలికి రాచనగరులో నొక సౌధము ఏర్పడినది. దానినే మనము చూచుచున్నాము. పైయంతస్తు, ఎంతచల్లగనున్నదో చూడుడు! అందులో నెడమవైపుననున్నగదిని చూడుడు!

దిగివచ్చినంతనే యాయావరణములో నెన్నిరాళ్లముక్క లున్నవో గమనింపుడు. అట్టి రాళ్లగుట్టలు రాచనగరమునిండ నున్నవి. దానికి తురకలంత జాగ్రత్తగ నందలి సౌధముల పాడుచేసిరని యర్థము.

అందుండి చాకలిదాని మేడకు దక్షిణముననున్న భవనమును జూచితిరా? దానిపై "తురకలమసీదు" అని పట ము న్నది. లోనంతయు "ఆర్చి"లతో నిండియున్నది. బహువిశాలముగనున్నది. చక్కనిగచ్చు. ఇప్పటికిని చెక్కుచెదరలేదు. కాని యది మసీదా? ఉత్తరముఖముగనున్న మసీదు నెందైన జూచితిరా! అయిన మసీదని యేలవ్రాసిరి? "విన్నన్న చెప్పి

నది వేదము !" అది మంత్రిగారి కచేరీసావడి. అన్నిశాఖల గుమాస్తాలకు స్థల మున్నది. దానిముఖభాగమును దురకలు చెడగొట్టిరి. దానినిండ గుమాస్తాలు, ఎదుర పహరావారు నుండగా, మంత్రిసత్తముడు కచేరిచేయుచుండగ నెట్లుండియుం డునో !

దాని కొకింత పశ్చిమమున నొక పహరా కొట్టున్నది. దానిని మహమ్మదీయ బాంకుగది యనిచెప్పుచున్నారు. అయి న గావచ్చును. వారు పురధ్వంసముకొరకు కందు మకాముచేసి నపుడు కట్టియుందురు. అది యొంటి స్తంభపుమేడ. పై కెక్కి యాచల్లగాలికి కొంచెము సేదతీర్చుకొందము రండు.

ఇక్కడనుండి యిదివరకు మనమువచ్చిన మార్గమును విడిచిపెట్టి, మనకాగ్నేయముగ బోవుచున్న చిన్న రోడ్డున బోయి యందలి కట్టడముల జూతము. కొన్ని ఫర్లాంగులవరకు నెందుజూచిన రాళ్ళగుట్ట లధికమగుచున్నవి. దానికికారణము మహమ్మదీయులు తమకు రాయలవంశముపై గల క్రోధము నంతయు నిందు తుదముట్ట దీర్చుకొనినట్లు కనబడుచున్నది. ఆ రాళ్ళనుగూడ జూర్ణము చేయనెంచిరా యనినట్లు తోచు చున్నది. ఈప్రదేశములో నిదమిద్ధమని తేల్చుటకు, పాశ్చా త్యప్రయాణీకుల వర్ణనలుతప్ప మరొకయాధారములేదు. మన కు గుడివైపున నొక పెద్ద యావరణ మున్నది. దానిని టంకసాల యని పటము సూచించుచున్నది. ఎంతచక్కగ ధ్వంసముచే సిరి ! అందొక్క రాగినాణెముకూడ దొరకెడియోగము లేదు. కావున మన కెడమవైపున నున్నవానిని చూతము.

మన కిప్పుడు భద్రింపువరకు మిగిలిన యొకకట్టడము కాన్పించుచున్నది. దాని నెక్కుటకు నిరుగెలంకుల నేనుగుల తలాటములతో మెట్లున్నవి. ఆ గజములెంత యందముగ నున్నవో చూడుడు. సజీవములై అతిశీఘ్రగమనోన్ముఖముగ నున్నవి. దాని నెక్కినంతనే యాదిబ్బ యెంత విశాలముగ నున్నది! ఇదిగో దానిమీద రాతిస్తంభములో, కొయ్యస్తంభములో, నేవియో నిలబెట్టుట కేర్పరచిన పల్లములు, దానికి పశ్చిమమున నొక మెట్లకోన మేర్పచిన పునాదియో, యేదో కాన్పించుచున్నది. ఈకట్టడమును రాయల సభామంటప మని వ్రాసియున్నారు. అట్లైన:—

క॥ భువనవిజయాఖ్యసంస
ద్భవనస్థితభద్రపీఠిఁ బ్రాజ్ఞులగోష్ఠిఁ
గవితామధురిమ డెందము
దవులం గొలువుండి సదయత౯ నను బల్కె౯.

అని పెద్దనగారన్న 'భువనవిజయ' సభామందిరమిదియే యైయుండనోపు. అట్లైన నేరాయలో దిగ్విజయానంతరము కట్టించినదై యుండవచ్చును. ఇంత మీ భావనాబలము నొకింత లేవగొట్టి రాజసభ యెట్లుండియుండునో మనుచరిత్రములోని

సీ॥ ఇందీవరంబుల • నీను క్రాల్గన్నుల
శరదిందుముఖులు చా•మరము లిడఁగ
బణినసూనుకణాద• బాదరాయణసూత్ర
ఫక్కి విద్వాంసు లు•పన్యసింపఁ

బార్శ్వభూమి నభీరుభటకదంబక రాళ
హేతిచ్ఛటాచ్ఛాయ నిరులుకొనఁగ
సామంతమండనోద్దామమాణిక్యాంశు
మండలం బొలసి యిరెండఁగాయ

గీ॥ మూరురాయరగండ పెండారమణిమ.
రీచిరింఛోళిఁ గలయ నావృతము లగుచు
నంకపాళి నటద్దుకూలాంచలములు
చిత్రిమాంజిష్ఠవిభ్రిమశ్రీ వహింప.

అని శ్రీకృష్ణదేవరాయలి సభావర్ణనమును జక్కఁగ నర్థముచేసికొని కొన్నిభేదములతో నన్ని విజయనగర రాజ సభలు నట్లుండియుండును గదాయని యూహించుకొనుడు.

ఈ సభామందిరముపక్క షుమారు నలుబదిమై దడుగుల పొడవు ఒకగజము లోతుగఁ ఒక రాతితొట్టెను జూడుడు. సూచనఫలక మది యేన్గులు నీరుత్రావుతొట్టి యనుచున్నది. ఇంతకన్న హాస్యాస్పదమైన నామకరణము సేయుట కష్టము. ఇచ్చటి కొకమైలుదూరములో దుంగభద్రానదియుండ, నిచటి కనతిదూరములో దాని కాల్వ లనేకము లుండ, నేన్గులు నీరు త్రాగుట కొకరాతితొట్టి కావలసివచ్చినదా? కాక రాజుగారు సభకు వచ్చుట కెక్కివచ్చిన యేన్గునకు దాహమైనపుడు నీరు ద్రావించుట కేర్పరచిన తొట్టియా! అట్లుకాదు. ఆతొట్టి గుఱ్ఱపుపిల్లలకు బాలుపోయించి త్రాగించుటకు జెక్కించిన దని యానెగొంది వారి రాజబంధువులలో నొకరు మాతో చెప్పి యున్నారు. వారిమాట నమ్మదగినదని మనవిచేయుచున్నాము.

దానికి తూర్పుగ నొకమందిర మున్నది. ఇది పాతాళ మందిరము. దీనిలో దిగి చూడవచ్చును. కాని చీకటిచే మన కేమియు నగుపించుట లేదు. కొంచెము గమనించి చూచిన చో, నది యంతయు లోన నాకుపచ్చకావురాతితో గట్టిరని తెలిసికొందుము. ఈపాతాళమందిర మెందులకో ? బహుళః యిది మంత్రాలోచనామందిరములలో నొకటియై యుండ వలెను.

ఈమందిరమునుండి దక్షిణమున కేగెడు మార్గమున భోయి షుమా రొక ఫర్లాంగు దూరములోపల నగుపించు పెద్దదిబ్బను చూతము. షుమా రిరువది యడుగుల నెత్తున నున్నది. ఎక్కుట కుత్తరపు వైపుననుండి చక్కని సోపానములు కలవు. ఆదిబ్బలో రెండు భద్రింపులు కాన్పించుచున్నవి. భద్రింపులచుట్టు, నతిసుందరమైనశిల్ప మున్నది. ఆశిల్పమున జీవకళ యెట్లుట్టిపడుచున్నదో చూడుడు. ఇక నీదిబ్బ వైశాల్యమున భువనవిజయమంత గాకపోయినను, దానిలో ముఖ్యాతికమైన గలదు. ఇదియే మహార్నవమిదిబ్బ. ఈదిబ్బ కీపే రీమధ్య యేర్పడినది. అప్పుడు దాని నేమనువారో తెలి యదు. పూర్వము దసరారోజులలో విజయనగరమున గొప్ప యుత్సవము జరుగుచుండెను. ఆసంప్రదాయము ఆసామ్రాజ్య సామంతరాజ్యములలో నగ్రగణ్యమైన మైసూరురాజ్యమున నేడును నిలిచియున్నది. ఆయుత్సవములో ననుదినమును రాయలు సభచేయు మంటప మిదియే. దీనిపైకట్టడము కొయ్యతో నుండెడిదని పాశ్చాత్యపరియాణికుడు వ్రాసియు

న్నాడు. దానికి దక్షిణ భాగమున రెండుమెట్లవరుస లున్నవి. అవి రెండును దిబ్బక్రింద నొకగదిలోనికి దిగుచున్నవి. అందులో భేతాళవిగ్రహ మున్నది. రాయ లాదశరాత్రోత్సవదినము లలో ననుదినము నాగదిలోనికి ముందు వచ్చి, యందు భేతాళ పూజ చేసి, పైకెక్కి సింహాసనము నధిష్ఠించెడువారు. తురక వారు దీనినిగూడ తమశక్తివంచనలేకుండ బాడుచేసినారు. నాటియుత్సవదినములలో నాదిబ్బచుట్టును నెట్లుండెనో, ఆదిబ్బ పై సభ యెట్లుండెనో "పయస్" అను పోర్చుగీసువాడు వ్రాసిన వర్ణనలను జదివి మీ రూహించుకొనుడు. ఆవర్ణన సీవెల్ వ్రాసిన "మరచిపోయినరాజ్యము" అను నాంగ్లగ్రంథములో నున్నది.

ఈ దిబ్బకు వాయవ్యముగ ననతిదూరములో నొక పెద్దగచ్చు జలక్రీడామందిర మున్నది. అది రాచవారి జల క్రీడామందిరము. ఎంత విశాలముగ, లోతుగ నున్నదో చూడుడు. ఒక చిన్న తటాకమువలె నున్నది. దానిలోనికి నీరము పై నుండి వచ్చుచుండె ననుకొనుటకు వీలుగ గాల్వలు గాన్పించుచున్నవి. ఆ తొట్టెను గడుగుటకు, నీరమును బైటికి వెడలగొట్టుటకు క్రింద తూము లున్నవి. దానిలో రాచవారిలో మగవారు తమ యిష్టమువచ్చిన ట్లీదులాడెడు వారు కాబోలు!

దానికి నైరృతిగ షుమారు మూడు ఫర్లాంగుల దూర ములో నింకొక జలక్రీడామందిర మున్నది. దీనిని భవన మన వచ్చును. ఇది యతిమనోహరముగ నున్నది. లోపల లోతైన

తొట్టె చుట్టును నార్చిలతో డోములతో గప్పిన వసారా-దానిలో నందందు గూర్చుండుటకు దొట్టి నానుకొని తిన్నెలు. ఆ తొట్టిలోనికి నీరు పైనుండి వచ్చుచున్నది. తూములగుండ బైటి కేగి చుట్టును నగడ్తవలె దిరిగి యెందో జనుచున్నది. దీనిని రాణివాసమువారి జలక్రీడాభవనమని సూచనఫలక మనుచున్నది. దీని కొకటే సందేహము. అట్టి భవనము రాణివాసమున కంత దూరమున నుండునా? యని.

ఇక నీ జలక్రీడామందిరములలోనికి నీరము దక్షిణ మున నొక బావినుండి వచ్చియుండనోపు. అందు కనుకూ లించు రాతికాల్వను మనము దారిలో దాటి వచ్చినాము. ఆ కాల్వను మెరకపల్లముల ననుసరించి, నేలమీద స్తంభ ములమీద, నడిపించినారు.

ఇవియేగాక యింకను ననేకములైన కట్టడముల పునా దులు భరంతులు గాన్పించుచున్నవికాని యవి యెవ్వియో మనము గుర్తింపలేము. ఇప్పటికి యున్నమట్టుకు రాచనగర మండలికచేరీల యావరణమును జూచినాము. ఇక దివాణమున కేగుదము.

## ౭ వ ప్ర క ర ణ ము.

# రాచనగరు — దివాణము.

నేడు పడిపోయినది కాని దివాణమునకు బ్రత్యేక మొక ప్రాకార మున్నట్లు తోచుచున్నది. దానిలో రాణి వాసమున కింకొకటి యున్నది. మొదటి ప్రాకారములోని సౌధములలో రాయలువారు వారిదగ్గరబంధువులు వారి పట్టపురాణులు గాక మిగిలినరాణులు, నివసించుచుండెడు వారు. పట్టపురాణులు రాణివాసపుప్రాకారమందలి భవన ములలో నుండెడువారు.

ఆ మొదటిప్రాకారములోనికి మార్గము, పశ్చిమో న్ముఖమై నేడు అరుగులు మాత్రము మిగిలియున్న హజార ములోగుండ నుండెను. ఆ యరుగు లెంత యున్నతములుగ విశాలములుగ నున్నవి! వానిపైన గప్పుండి, పహరా లుండి నపు డెట్లుండియుండెనో! దానిని దాటి లోని కేగగనే మన కొక యాలయ మగుపడుచున్నది. అది హజారరామ చంద్రాలయము.

ఆ యాలయమును జూచుముందు దానినిర్మాణమును గురించి యొకింత విచారించవలెను. రాచనగరులో నందందు గొన్ని దేవాలయము లున్నవి, కాని వానిలో నొకటి గూడ దివాణమువారి కందుబాటులో లేదు. ఘోషాస్త్రీలు పూజించు టకు వీలైనవి లేనేలేవు. శ్రీకృష్ణదేవరాయ లాలోపము బాపుట కీయాలయమును, హజారము నానుకొని దివా

ణపుటావరణములో గట్టించెను. వైష్ణవమతాభిమానముతో దానిని రామచంద్రాలయమును జేసెను.

ఇక నాలయ నిర్మాణములో, విజయనగరమందలి యాలయము లన్నియు నొకయెత్తు, ఈ రామచంద్రాలయ మొకయెత్తు. దీనిలోని రాతిజాతి, దానిపసందు, అందుపై నున్న శిల్పచాతుర్యము, నికయేయాలయములోను గనుప ట్టదు. ప్రతివిషయములో నిది యన్నిటికన్న మిన్నయని పించవలెనని యూహించి కట్టించినట్లు తోచుచున్నది. దీనికి రెండు నిదర్శనములుమాత్రము చూపింతుము. గర్భగుడికి ముందున్న మంటపమందలి నాల్గుస్తంభములను బరిశీలింపుడు. రాయి నల్లరాయి. వట్టినలుపు కాదు-నలుపులో నలుపు, కారు నలుపు. అట్టిరాయి, అన్ని పర్వతము లున్నను, విజయనగర ములో నెందును మాకు కాన్పించలేదు. ఇక వానిపై జెక్కిన విగ్రహము లద్భుతశిల్పకౌశలమును బ్రదర్శించు చున్నవి. పురాణగాథలను నాటక మాడించుచున్నది! చూడు డాచిత్ర ము. పట్టణము నంతయు బరశురామప్రీతిచేసి, పనివడి కచ్ఛతో గట్టడములను విగ్రహములను శకలములు చేసిన మహమ్మదీ యుల కఠినహృదయములుగూడ, నాశిల్పచాతుర్యమును జూచి యా స్తంభముల సౌందర్యమును జూచి, కరగిపోయినవి. లేకు న్న నేదీ వారి గదాఘాతము, వారి పలుగుపోటు, ఎందును గాన్పించదే?! అట్టివారికిగూడ వానినిముట్టుకొనుటకు జేతు లాడించనంత యద్భుతసౌందర్యశోభ వానిలో నున్నది.

రెండవసిదర్శనము: ఒకపర్యాయము ప్రిదక్షిణముచేసి వత్తము రండు. గోడలపైనున్న శిల్పమును జాగ్రత్తతో బరిశీలింపుడు. శ్రీమద్రామాయణ మంతయు నొకచే చిత్రదృశ్య ప్రబంధమైనది.

గర్భగుడిలో విగ్రహము లేదు. స్తంభములను ముట్టుకొన నొల్లకుండిరి గాని మిగిలినపట్ల మహమ్మదీయు లీయాలయముపట్ల నేలాటిపక్షపాతమును జూపించలేదు. దీనిలోగూడ జెట్లగుట్టవెట్టి నిప్పుముట్టించిరి. విగ్రహములను బగులగొట్టిరి. అట్లు కావించినను నేడే యెంత సేపటికి మనకు విడిచిపోబుద్ధి పుట్టదే! ఆయాలయము బాగుండి పూజావిధి జరుగుచున్నదినములలో నెట్లుండి యుండునో?!

దివాణపు టావరణములో నెటుజూచిన రాళ్లముక్కల పోగులు విపరీతముగ బడియున్నవి. "పయస్" అను నొక పోర్చుగీసువాడు కృష్ణరాయలప్రభుత్వకాలములో విజయనగరమునకు వచ్చెను. ఒకనా డతడు దివాణమును జూచునభిలాష ముండెనని మనవిచేసుకొనెనట. పరదేశీయు డగుటవలన దానికి రా జంగీకరించి, వానికి నంతేయు జూపించ నియమించెనట. చూచిన సకలమును వర్ణించియున్నాడు. మొదల తనకండ్లకు గంత గట్టిరట! దివాణములో ప్రవేశించినంతనే గంతను విప్పి లోపల సకలమును జూడ నిచ్చిరట! ఆసౌధములను వానియందలి యాసనములను, వానిలో గొన్నిగోడలకు గప్పులకు దొడిగిన వెండి బంగారు రేకులను, అందలి వెండిబంగారు పాత్రిలను, కొన్నిపెట్టెలలో నిలువచేసియుంచిన ధనరాసులను

అందందు వ్రేలుచున్న బంగారపు తూగుటుయ్యేలలను ముత్యాలరత్నాలతోరణములను, రాయల విగ్రహములను, మరియు నెన్నేని విచిత్రవిషయములను నాయన పూసగుచ్చి నట్లు వర్ణించియున్నాడు. దానిని చదువునప్పుడు విజయనగర మందలి రాజసౌధములు ఇంద్రభవనములని, అందుల వైభవ మనన్యసామాన్యమని తోచకపోదు. అట్టి భవనములలోని వెండిబంగారమును, వజ్రవైడూర్యములను దురకవారు తమరాజధానులకు గొంపోయి, యాభవనములను నేలమట్టముచేసిరి. అట్లుచేసినవారియోపిక కచ్చెరువగుచున్నది. కట్టడమునుగూల గొట్టిపోక, దానిని కట్టిన రాళ్ళను 'గంకర' ముక్కలకిరింద గొట్టించి గుట్టలు బోయించినవారి నేమనవలె? ఆ గుట్ట లతి విపరీతముగ బడియున్నవి. అందువలన నా యావరణములో రాయ లిం దుండెడివారు, వారివా రిందుండిరి, యనిమనము చెప్పలేకున్నాము. శక్తి యున్నయెడల 'పయస్' వ్రాసిన వర్ణనను జదువుకొని ప్రతి యాత్రికుడు గొంత కవీశ్వరుడై 'ఆహా! యిం దిదికదా, అం దదికదా, ఈ భవన మి ట్లుండి యుండును, ఆ భవన మట్లుండియుండును." అని భావనా బలముతో నూహించుకొనవలెను. మరొకమార్గము లేదు.

ఇక నా రాళ్లగుట్టలను జూచుకొలది దుఃఖముతో కడుపు తరుగుకొని పోవుచున్నది. మన కుత్తరముగ నొక డొంక పోవుచున్నది. అదిగో! ఆదారి దూరమున మాతంగపర్వత మున కేగుచున్నది. దానిని వదలి యిప్పుడీ యెదురనున్న యావరణములోనికి బోయి రాణివాసమును జూతము రండు.

దానిలోనికి ద్వారము చిన్న క్రంతవలె నున్నది. కాని అన్నిటి వలె ద్వారము కాదు. దివాణపుటావరణములో బహుశః పహారాయున్న జాలు కాబోలు. రాణులుండు నావరణమునకు ద్వార మక్కరలేదనుకొని యుందురు. కాని యిదేమి చిత్రము! రెండుకట్టడములు, ఒక భద్రింపు, ఒకతొట్టి, మూలల పహారా కొట్లు తప్ప యిందు మ రేమియు లేవే! ఆరాళ్లగుట్ట లిందును బ్రత్యక్షమైనవే! ఇదిగో "రాణినివాసము" అని ఫలకము చూపుచున్న భవనమును బరీక్షింతము, రండు.

ఈ భవనము పైకెంత యందముగనున్నది! కొంచెము సూక్ష్మముగ జూచిన దీనియాకారము పద్మాకారమా? దీనిని పద్మాలయమందమా-యేమందము? దీనికి రెండంతస్థు లున్నవి. క్రిందియంతస్థు చిత్రముగనున్నది. ఆర్చిలతో డోములతో నమరియున్నది. గోడలులేవే! చిత్రముగనున్నది. పైకెక్కుదము రండు. అబ్బా! మెట్లు కడునిరుకులుగనున్నవి. పై నీగూడెందులకు? పహారా దాసీ కూర్చుండుటకా ఎదురనున్న క్రింతగుండ క్రిందనేమిజరుగుచున్నది, యెవరువచ్చుచున్నది కనుగొనవచ్చును. పైయంతస్థు క్రిందిదానివలెనే యున్నది. అన్నీ ఆర్చిలే. అన్నీ డోములే. పై నమటుకు గోడ లందం దున్నవి. బైటి కేమియు కానరాదు. కాని లోనివారికి బయల నేమిజరుగుచున్నది కన్నులగట్టినట్లు కనబడును. ఆచుట్టునున్న గూళ్లు కొన్నికిటికీలూ కప్పులు, కూసములు కాన్పించుచున్నవి. సరే గాని ఆలయములలో నన్నిరంగులు వేయించి చిత్రవిచిత్రములైన బొమ్మలతో నలంకరించియుంచిరే, మంటపములను, రాణీ

గారి మహాలులో నట్టి యలంకారము లెందును గాన్పించ వెందులకో ? ఓహో తెలిసినది. ఆర్చిల చంకలలో నీ క్రింత లెందులకు ? ఇవి యే పట్టెలను బట్టియుండును. ఈ గోడ లన్నియు, ఆర్చిలన్నియు, డోములన్నియు మొకమల్ గుడ్డతో గప్పియుండురు - పయస్ వర్ణించెనుగదా. అందువలన నట్టి యలంకారము లింక దగుపించవు. ఆ మొకమల్ పై నెట్టియలం కారము లుండెడివో ? ఆవిజయనగరరాజులు రాణీలేచెప్పవలె, కాకున్న వానినెల్ల నొల్చుకొనిపోయినవారు చెప్పవలె, మన కెట్లు తెలియును?

ఈ పద్మభవనమున మరొక విచిత్రము ! మన మెందైన నొక డోముక్రింద నిలుచుండి బిగ్గరగ సంభా షించిన, మన మాటలకు బ్రతిధ్వని బయలుదేరును. అట్టిచో నీ భవనమున నిన్ని డోము లున్నవి - రాణీలు, వారి చెలి కత్తెలు మాట్లాడినపుడు ఏ ప్రక్కజూచిన బ్రతిధ్వని పలు కుచు, చెవులు "గింగురు" మనిపించినపుడు గందరగోళముగ నుండియుండదా ? అట్లయిన నా భవననివాసము సుఖప్రదమా? అయిన జూతము. ఒకరిని కేకపెట్టుమందము. "ఓ పట్ట మహిషులారా! యీ మేడపై నెట్లుంటిరమ్మా" - అరే! యేమి యీ యాశ్చర్యము ! ప్రతిధ్వనిలేదు సరికదా మన యెలు గెంతమాత్రము పెరుగలేదే ? కారణమేమో ? ఆర్చిల చంక లను జక్కగ బరీక్షింపుడు. గచ్చుగిలాబా చేయునపుడో, ఆయార్చిలను గట్టునపుడో, చంకలను గొంచె మర్ధచంద్రాకృతులుగ బెంచి, యీ భాగములను మన వైపులకు ద్రిప్పి

యున్నారు. ఆ యర్ధచంద్రాకృతిం గొన్న భిత్తికభాగ
ములు క్రిందినుండి వచ్చుధ్వని విశేషము నాగి చెదరగొట్టు
చున్నది. "ఏమి విచిత్రము! మీరన్నట్లే విస్సన్న చెప్పినది
వేదమా! పదునాల్గవ పదునారవ శతాబ్దముల మధ్య
నున్న మన పనివాండ్ల కింత తెలివి యెక్కడిది?" అని
మీలో గొందర నుచున్నారా! ఆగుడు. విఠలాలయము
నకు బోవుదముగదా! అందేగినపుడు మనవారి పనితనమును
జూచెదరుగాని.—ప్రస్తుత మీభవనమందలి గచ్చునొకింత
చూడుడు. ఈమేడను 1565 సంవత్సరమున, విజయనగ
రము వినాశనమయిన సంవత్సరమున, మహమ్మదీయులు
శేపో మాపో వత్తురనినపుడు ముగించిరందురు. నేటికి మూడు
వందల అరువదియేడు సంవత్సరములాయెను. మేడపై జాల
భాగ మీగచ్చు చెక్కుచెదరకుండ నెట్లున్నదో చూడుడు.
దానిలో నేమేమిపదార్థములు కలిపిరో?! ఒకపాలు బెల్లమేనా
మరియేపదార్థములనైనను సనా! మనమీరోజులలో బాలగచ్చు
చేయించినచో, దరమునకు పదిసార్లు మరమ్మతును గోరుచుం
డునే! ఇది రోజుల మహత్త్వమై యుండనోపు. అంతేగాక
నొకసారి చూచుక్రింద బరీక్షింపుడు. గిలాబాతో నాగొలుసు
లను అందందు జిలకలను నెట్లమర్చినారో! లోభాగమంతయు
మొకమల్‌తో దళదళ లాడుచుండ, నాచిలుకలు, గొలు
సులు రంగులతో శోభిలుచుండ, నాభవనాంతరంబున సూర్య
కాంతిగాని, దీపకాంతిగాని ప్రకాశించుచుండ నెట్లుండి యుం
డునో ?

అట్టియూహాలకు మితములేదు. వాయవ్యముననున్న భవంతిని చూచివత్తము. దానివెనుక పహారాగదులనుజూచి, తరువాత నీభద్రింపువరకు మిగిలియున్న భవనమును వచ్చి చూతము.

ఈ భవంతి చిత్రముగనున్నది. చుట్టును నరుగులపై వసారా, మధ్యలో తగుప్రదేశము. ఇది మరల నేదియో జలక్రీడాభవనమా? కాదు కా దట్లయిన నీటి కాల్వలుండవా? అయిన నిదియేమి నాట్యశాలయా? అట్లే తోచుచున్నది. 'పయస్'తనవర్ణనలో, రాజకాంతలందరు నాట్యమున నారితేరిన వారని, రాయలయెదుట నప్పుడప్పుడు నాట్యము నేయుచుందురని చెప్పలేదా? అందుల కేర్పరచిన భవంతియైన గావలయు, గాకున్న పట్టమహిషులు నట గాయక ప్రదర్శనముల జూచి యానందించుచోటైన గావలయు. వసారాలుకూడ జాలవరకు మనము జూచివచ్చిన జలక్రీడామందిరమందలి వసారాలను బోలియున్నవి. బాగుండినపుడు, వానిపై రాజదంపతు లాసీనులై యుండ, నేమేళమో యాడుచుండినపు డెట్లుండియుండునో? పాప మాభవంతి యప్పుడెంత శోభతో జెన్నారెడిదో? నేడు పాడువడి గబ్బిలములకు దావైనది. కాని, యీభవంతిలో వెలుగు విశేషముగ లే దెందువలననో!

ఇక, తూర్పువైపున మూలలనున్న యొంటిస్తంభపు కట్టడము లేమిటివి? పహారాగదులా లేక పట్టమహిషులు ఉత్సవసమయంబుల రాజసభలో మహర్నవమిసభామందిరములలో జరుగుచున్నవిషయముల జూడ నేర్పరచిన కట్టడములా, రెం

డునా! మనము చెప్పజాలము. కాని, లోనేమి జరుగు చు న్నది బయటికి తెలియదుకాని, బైటజరిగెడు విషయము ల న్నియు బైయంతస్థునుండి కనులగట్టినట్లు లోనున్నవారి కగు పించును. వానిలో నుత్తరపు కట్టడము దక్షిణపుదానికన్న విశాలముగ సుందరముగ నున్నది.

ఇంతట భద్రింపువరకు నిలిచియున్న భవనమును జూడ బోదము. ఇందులో గొంత భాగము మిలిగినదానికన్న మెరకగ నున్నది. ఇందుమీాదనున్న కట్టడమును దురకలు పడగొట్టిరి. ఏమైన కడువిశాలమైన భవనమై యుండనోపు.

దానికి దగ్గరనున్న జలక్రీడామందిరము జూడుడు. నీటి సదుపాయమితర జలక్రీడామందిరములలోవలె నున్నది. మం దిరము విశాలముగనే యున్నది. ఆ తొట్టియంతయు నీటితోనిండియుండ సుందరీమణులం దీదులాడునపు డెట్లుండి యుండునో! ఆసమయమున నొక్కొకప్పుడు సార్వభౌము డందుల కేతెంచియుండకుండునా? వారితోగలిసి జలక్రీడ లాడకుండునా? కావున మన కావ్యములందలి జలక్రీడాభివర్ణ నములన్నియు, జరిగినవిషయములేగాని యబద్ధములుకావని మన మనుకొనవచ్చును.

ఈ యావరణములోగూడ రాళ్ళగుట్ట లున్నవి. కొంత భాగము దిబ్బవడియున్నది. అవియన్నియు బహుశః యిం దలి కట్టడములలో దేనికో సంబంధించియుండును. ఇంతె పశ్చి మద్వారముగుండ వెలుపలికేగి, మన కుత్తరముగ గాన్పించు భవనమును ఈశాన్యముననున్న కట్టడమును జూచిపోదము.

ఉత్తరముననున్న దానికి కప్పులేదు. కాని, మనము చూచివచ్చిన నాట్యపుభవంతిని బోలియున్నది. ఇం దెవరుండి యుందురో? అది పహరావారికట్టడమని దానిపైనున్న ఫలకము చెప్పుచున్నది. పహరావారిదియా, లేక నగారానపుబో త్థానాదియా? ఏమనుటకు వీలులేదుకాని, యిది యత్యున్నతముగ, విశాలముగ నున్నది. పహరావారన్న నాడువారై యుండనోపుదురు. విజయనగర రాణివాసములో ఆడుపహరా వారు కొన్నివేలమంది యుండిరని, వారెప్పుడు నాయుధపాణులై యుండిరని, రాజుగారు రాణివాసములో బ్రవేశించినంతనే వారికాపలాభారము నాయాడువారు నిర్వహించుచుండిరని వర్ణనములు కలవు. బహుశః యట్టివారు కావలె, మగ పహరావారిని రాణివాసమున కంతదగ్గరలో నుండనిత్తురా?

దానిదగ్గరనున్న కట్టడమేదియో? ఏన్గులచావిడి యని సూచకఫలకము చెప్పుచున్నది. కట్టడ మత్యున్నతముగ నున్నది. ఇందలిగదు లతివిశాలముగనున్నవి. వానిలోపలిభాగము, పైభాగముగచ్చుచేసి యున్నారు. ఆగదులలోగొన్ని వలయాకారముగ నున్నవి. మధ్యగదిగుండ పైనెక్కుటకు సోపానపంక్తిగలదు. దానిడాబాపైనెక్కి, క్రింద గదులడోములన్నియు నెంతపెద్దవియో చూడుడు. స్పష్టముగ గన్పడుచున్నది. పడిపోయినదో, పడగొట్టనిదో, పైభాగ మందందు గలదు. ఇదియేన్గుల సావిడియనియే తోచునా? దీనిగదులలో బట్టపుటేన్గు లుండెడివా? అప్పటి మోటారుకార్లవియేకదా! ఆపర్వత ప్రదేశమున వానిమీదదిరిగినంత సులభ

ముగ నితరజంతువులపై నేగుట కష్టముకదా! పెద్దనగారుకూడ

"ఎదురైనచో దనమదకరీంద్రము డిగ్గి"

యని కృష్ణరాయని వర్ణించియున్నాడు కదా! దానిలో నారాజునకు గజమే యభిమానవాహన మనిపించుట లేదా? మిగిలినరాజులకు నట్లైయె యుండకూడదా? కాబట్టి వారికి కావలసినప్పుడెల్ల నెక్కిపోవుటకై తమగజబలములో నెల్ల మంచివానిని కొన్నిట నేరి యిందుంచుకొనిరా? అయినం గావచ్చును, గాని యీయూహ కొక యభ్యంతరమున్నది. ఆగజనివాసమును రాణివాసమున కంత దగ్గరలోనుంచు దురా? మావటీలు మగవారా యాడువారా? ఇవి రాజవరులకైగాక పట్టమహిషిలకై యేర్పడ్డయేన్గులా? అనుమానాలు తోచకపోవు. వానికిదగిన సమాధానమును జెప్పుట కిప్పుడేమాత్రము వీలులేదు. కాని దీనిని విడిచిపోవుముం దొకింత తలయెత్తి డోములలోపలిభాగమును జూడుడు. దానిని రాతిముక్కలతో గట్టిరి. ఆముక్కలను మనతాగనుబిళ్లలను 'లాది' నట్లు లాదిరి. అంతముక్కలు లాదున కెట్లమరెనో? సున్నము వట్టిసున్నమా దాని జిగి యెక్కుడగుటకు ఏదైన పదార్థమునుగలిపిరా? మనకుతెలియదుగాని అంతముక్కలలాదిన పనితన మతిస్వతంత్రముగను, సాహసముగను నున్నది.

ఈ యేన్గులసావడి కాగ్నేయముగ గమలాపురమున కేగురోడ్డున కొకింతదూరమున మరొకకట్టడమగుపడుచున్నది. దారిలో నెన్నియో దిబ్బలు కనబడుచున్నవి. వానిని త్రివ్వి

యెప్పటి కవి యివియని తేల్చుదురో! త్రివ్వినను తేల్చలేరో! దారిలో రెండు పాడుబడ్డ యాలయములు కూడ నున్నవి. వాని కేమి, మనము చూడబోవుకట్టడమును దగ్గరుకొలది చిత్ర ముగ నున్నది. దానిప్రక్క నొకకట్టడమున్నది. దానికెందును దర్వాజా కానుపించదు. సూచనా ఫలకము, అష్టముఖ జల క్రీడామందిర మనుచున్నది. లోనికేగి చూతము. నిజమే, లోపల నెన్మిదిముఖములున్నవి. షుమారు పదియడుగులలోతున మధ్య తొట్టి, తొట్టికినడుమ చుట్టువసారాయెత్తున నొకదిమ్మ, ఆదిమ్మలో జలయంత్రముండెడిదేమో నేడు తేలదు. ఇకనా తొట్టెలో మనుష్యుడు వసారాయంచుపై గూర్చుండి, కాళ్ళను దిగవిడిచి, క్రిందికి దిగి, షుమారు నడుములోతు నీళ్ళలో నిలబడుటకు వీలైన యొక మువ్వాతిక వెడల్పుగల రాతితో గట్టిన యరుగుతొట్టె చుట్టును నున్నది. ఆ యరుగు రాళ్లను బరీక్షింపుడు. ఒక్కొక్కముఖమున కొక్కొకరాయి - ఏకాండపురాయి. ఎంతసొంపుగ జెక్కిరో! ఇక వసారాపై కప్పులో నెటువంటి పటాటోపము, నలంకారములేదు. అంతయు సాదా డాబా. ఇక ప్రక్కననున్న తలుపులులేని కట్టడ మీజలమంది రమునకు వలయు నీరమును భద్రపరచు నెత్తైనతొట్టి. దాని యుపయోగ మిప్పుడు తెలిసినది. ఎట్టి వేసవికాలమైన, బయల నెంత యెండకాయుచున్న నీ జలక్రీడాభవనములో బ్రవేశించినతోడనే, (నేడు త్రాగుటకు సరికదా, పుక్కిలించి యుమియుటకు, గనులు గడుగుకొనుటకైన, జిట్టెడు నీళ్లులేవుగాని) యెంతచల్లగ నుండును! బైటనుండి వట్టివేళ్ళ తడికెలుగట్టి

నీళ్లుబోయుచుండిన నింటిలోనికి వచ్చిన ట్లుండును. ఇప్పుడే యిట్లున్నదే, నీరమందుండి యందు రాజకుమారులో దంపతులో, బంధుగులో, గాకున్న దాని యజమానులెవరో వారు జలక్రీడలాడి యామధ్య తిన్నెపై గూర్చుండి యుండునప్పు డెట్లుండియుండునో ?

ఇప్పటికి ప్రొద్దుగ్రుంకు వేళ యగుచున్నది. ఇంతట తిరిగి బస కేగుట మంచిది. ఇటనుండి దక్షిణముగనున్న దారి యొకరోడ్డును గలియుచున్నది. అటనుండి తూర్పునకేగిన గమలాపురమునకు బోవును. పడమర కేగిన బోయిపోయి మనము వచ్చిన హంపీరోడ్డును, నక్కసెల్లెంద్ర గుండ్లకడ కలియును. ప్రస్తుతమీరోడ్డున బోదము. మన కెడమవైపున నొక కోట గోడ యున్నది. అది రాచనగరు దక్షిణపుగోడ. మనమింత వరకు జూచిన కట్టడములన్నియు మనకు గుడివైపున నున్నవి. అదిగో దూరమున రాణివాసపు టావరణము—అదుగో దాని ప్రక్క రామచంద్రాలయము, దానియెదుట మహార్నవమి దిబ్బ, పోనుబోను మనకు గుడిచేతివైపున నీటికాల్వ, దాని జలక్రీడామందిరము కానుపించుచున్నవి. అదిగో ! ఆవల టంకసాల కచేరీలు, చాకలిదాని మేడ, పాతాళ దేవాలయము. ఇవిగో మన కెడమప్రక్కన నక్కసెల్లెంద్రగుండ్లు - అల్లదిగో దర్వాజాబురుజులు - ఇదిరాచనగరు తూర్పుదర్వాజా - పడమరదర్వాజా, మనము జలక్రీడామందిరమును వీడివచ్చి యీ రోడ్డున నిట్లువచ్చితిమి—అట్లురాక పశ్చిమమున కేగియుండిన ననతిదూరమున నొక దర్వాజా వచ్చెడిది. అదియే పడమర

దర్వాజా. దాని యావలనున్న యూరు కమలాపురము. తూర్పుదర్వాజాగుండ వచ్చినదారినే పోదము. ఇదుగో చంద్ర శేఖరాలయము - అదుగో దూరమున నుగ్రనృసింహాలయము. ఆవల కృష్ణస్వామి యాలయము. ఆమెరకను దాటినవెంటనే విరూపాక్షాలయ మగుపించును.

విరూపాక్షాలయమునకు దక్షిణమున నొకగుట్ట, దాని మీద కొన్ని చిన్న దేవాలములు నున్నవి. అవియేవో చూచి బస కేగుదము. ఆగుట్టను హేమకూట మందురు. ఈయాలయ మెట్లున్నదో చూడుడు. ముఖమంటపములో భక్తులు కూర్చుండుటకు నున్నటియరుగు లున్నవి. లోన నొకసానదీ యావల గర్భగుడి యున్నవి. ఆలయగోపురము, చౌకపురాతిపలకలు కొన్ని, యొకదానిపై నొకటి, మధ్యల కొంచె మెడము విడిచి నిలబెట్టి యమర్చినట్లున్నవి. ఇవి మనయాలయములు కావు. జైనాలయములు. అన్నియు నొకటేమాదిరి నున్నవి. ఇట్టియాలయములు కొన్ని మన కూరిలో నందం దింకను గాన్పించును. దానినిబట్టి యాయూరిలోబూర్వము జైనమతస్థులు చాలమంది యుండెడివారని యూహింపనగును. కాబట్టి మన తిక్కన సోమయాజిగారివంటి మహనీయులు, కాకతి గణపతి దేవచక్రవర్తివంటి మహాసార్వభౌములు, నెంతపట్టుబట్టి వారిని నరికించినను, జైనమతస్థులు మనదేశములో లేకుండ బోలేదు. అందలివారో, మనదేశమునుండి వలసబోయిన వారో, కొందరు విజయనరగరమున నుండిరి. ఆచక్రవర్తులు, పౌరాణిక హిందూధర్మ సంరక్షణమునకు గంకణముగట్టు

కొనినను, ఒకపరి శైవమతాభిమానులు, ఒకపరి వైష్ణవమతాభిమానులు నైనను, జైనమతస్థులను దమరు ముందేగిన చక్రివర్తులవలె బాధింపక, తమ ప్రజలలో వారుకూడ చేరిన వారేయని, వారిపూజావిధానములను నిరాటంకముగ జరుగ నిచ్చిరి. దాని కాచక్రవర్తుల నెంతయు బొగడవలసియున్నది.

ఈయాలయములనుండి విరూపాక్షాలయపు బడమటి యావరణము నానుకొని పోవుచున్న కాలిబాటను బోవుదము. ఇదిగో యెడమవైపున తుంగభద్రకాల్వ - దానికావల చుట్టు మంటపములు,మధ్యకొలను. ఆకొలనునిండ తుంగభద్రోదకము మరల నాకాలిదారిని బోవ మనకు విరూపాక్షాలయ పశ్చిమ ద్వారము కనుపించును. దానికెదురుగ నొకచిన్న యాలయమున్నది. అందొకచిన్నవిగ్రహము, షుమారు నాలుగడుగుల యెత్తుకలది నల్లరాతిది యున్నది. అది విద్యారణ్యస్వామివారి విగ్రహము. ఆముఖకళ దిలకింపుడు. ఆచెవులెంతపెద్దవియో పరీక్షింపుడు. ఆనుదు రెంత విశాలముగ నున్నదో చూడుడు. దీనిని బట్టి వారిమేధాశక్తి, మూర్తిమత్త్వము, పరుల వశముచేసికొను శక్తి, మనకు విశదము కాగలవు. విగ్రహ మతిసౌమ్యముగ, శాంతరస మొల్కుచున్నదికాని, రాజస మావంతయైన నెందును నగుపడదు. ఒకింత సావధానులమై దానియెదుటనిలబడిచూచు కొలది మనయూహాలు పరిపరివిధముల బోవుచున్నవి. వేదములకు భాష్యములు వ్రాసిన మహనీయు డీయనయేనా యని పించును! హైందవ మాచముట్టుగ నాశనముగాకుండ, గాపాడయత్నించి జయించిన మహానుభావు డీయనయేనా

యనుపించును! మామటుకు మాకెప్పుడేగినను నావిగ్రహమును జూచినపుడెల్ల విడిచిపో బుద్ధిపుట్టదు. ఆమహనీయుని పేర నొక మఠమున్నది. దాని కధికారులు, మూలధనమును బ్రత్యేకముగ నున్నవి. ఆమఠ మీయాలయమునకు దూర్పుననున్నది. దానిముందుభాగమునంతయు దురకలోగాకున్న భవనములకుజాతిశత్రువగు కాలమో (బహుళశః మొదటికారణమేగావలయు) పాడుచేసిరి. లోనికేగిన జుట్టును వసారా నానుకొని గదులు, మధ్య నీటితొట్టి యున్నవి. ఆతొట్టిలోనిదితుంగభద్రానీరమే. ఇటనుండి దక్షిణమేగినచో మనకు తుంగభద్రదారి దొరకును.

౧వ ప్రకరణము.

# హంపీనుండి విఠలాపురము.

నేడు హంపీబజారులోగుండ దూర్పున కేగుదము. ఈ బజారులోనున్న యిండ్ల నొకింత చూచిపోదము. ఇం దిప్పుడు మందిరములే యగుపడుచున్నవి. వెనుకభాగములన్నియు బడిపోయి యున్నవి. అందుచే నప్పటి గృహనిర్మాణము ఎట్లుండి యుండునో చెప్పుటకు వీలులేదు. కాని మన వారి పట్టుదలల మన మెరుగుదుము. కాబట్టి వాస్తుశాస్త్రసమ్మతములై యుండవలెనని తీర్మానించుటలో దప్పేమియు నుండదు. ఈ మందిరములు కూడ నేటివలెవట్టిరాతివికావు. వాని లోతట్టున నందందు గచ్చు గాన్పించును. దానిని బట్టి

లోపల వెలుపల గూడ గచ్చుగిలాబా చేసియుంచి, పైన సున్నము గొట్టించి యుందురని, యా మందిరము లన్నియు సౌధనామమును సార్థకముగ ధరించి యుండునని యెంచవల యును. వీనిలో గొన్ని మేడలయాకారమున నున్నవి. వాని నెక్కుటకు మెట్లుకలవు. చిట్టచివర దీపస్తంభమున కెదురుగ నున్న మందిరములవరుస యెవరో భాగ్యవంతునివో లేకున్న సామంతరాజునవో భవనము లనిపించును. ఇక నొక్కింత యావలకు బోయి యా పెద్ద నందిని చూచి పోదము. ఎంతయెత్తుగ నున్నది. మునుపటివారు విగ్రహము లెంత పెద్దవిగ నున్న భక్తి యంత యెక్కువ యనుకొనిరా, కాకున్న బెద్దవానిని చెక్కుటలో దమ తెలివితేటలు ప్రక టనచేయ నెంచిరా? ఏ కారణమైన, బెద్ద విగ్రహము లం దం దున్నవి. అందులోనది యొకటి, చూడుడు - తురకవారు దాని మూతి నెంత ఘనందుగ చెడ జెక్కిరో! వారిశక్తి నేమంద ము! ఎందేగిన సృష్టికి బ్రతిసృష్టి నతివిపరీతముగ జేసియున్నారు. సగము ముక్కు, మూతి, ఒక్కటే చెవి ఇవి యన్నియు సృష్టిలో వారుతప్ప మరియెవరు సంకల్పించి యొనర్చి యుండ లేదు! దాని ప్రక్కనున్న యా పహారామందిరము చూడుడు. ఇట్టి వెన్నియో పట్టణప్రదేశమునం దెల్లెడ గాన్పించుచున్నవి. సాధారణముగ రెండంతస్థులుగ నున్నవి. క్రింద మూడుమంది రములు పైన మూడుమందిరములు. నలువైపుల గోడలు లేక ఖాళీగనుండును. ఇవి పహారాకా, మరియొక దానికా! మనము చెప్పజాలక తోచినవరకు బహారా కని సిద్ధాంతము

చేయుచున్నాము. అట్టి మందిరము లన్నిటిలో నీమందిర మొకింత పసందుగ నున్నది. దీని స్తంభములు కడు నంద ములుగ నున్నవి. రాయికూడ మామూలు తెల్లరాయి కాదు. కడు నున్నగ జెక్కియున్నది.

అటనుండి కొంచెము పడమర వచ్చి, యుత్తరమున కేగెడుడొంకను బటుకొని పోయిన నదియొక ఫర్లాంగున్నర దూరములో బూర్వము నదీతటమున నేర్పడినదారిని గలియు చున్నది. దానిపై బోను బోను, మఱల నొక 'యక్కచెల్లెం డ్ల గుండ్లవంటివి, వీనిని 'రామలక్ష్మణ గుండ్లందురు, రెండు పెద్దబండలు కాన్పించును. మనదారి యీబండల క్రిందుగ నేగుచున్నది. క్రిందిబండలు ఆరు శతాబ్దముల రాపిడితో గడునున్నబడినవి. ఏమరి నడచినచో గాలు జారునట్లున్నది. వాని మధ్యభాగము వెలుగుతక్కువ. దాటి బైటికివచ్చి మలుపు తిరిగినంతనే మన కెదురుగ నది కావలియొడ్డున ఋశ్యమూకము మనకుగుడివైపున మెట్లవరుస, వానిపైన మందిరములు, వాని యావలదూరమున శ్రీకోదండరామస్వామివారి యాలయము గాన్పించుచున్నవి. ఈ మెట్లవరుస సరే, తుంగభద్ర పూర్తిగ బ్రవహించునపు డిందలివారు నీటికై దిగుటకు గట్టించిరి. కాని పైన మందిరములెందులకో ? ఇవి యిండ్లకోసము కట్టినవాని వలె నగుపడవు చక్రతీర్థమున గ్రుంకవచ్చిన తైర్థికు లుండు టకా? ఏమో చెప్ప జాలము. ఇదిగో! శ్రీకోదండరామస్వామి వారి యాలయము. ఎదుట నినుపకడ్డీలతో గట్టించిన యావర ణము నీమధ్యనేభక్తుడొచిరుతపులులు లోనికి రాకుండ గట్టిం

చెనని, యందలి యర్చకు డొకడు మాతో జెప్పినాడు. ఈయాల యము చిత్రముగ నున్నది! ఆలయమా, మతమా! ఎదుర విశాలమైన సావిడి—దానిమధ్యలోపలి నొకచిన్నగది అం దులో శ్రీవారివిగ్రహము! విగ్రహమును జూడుడు—ఒక మనుష్యుని యెత్తుననున్నది—అందముగనేయున్నది—పూజ జరుగుచున్నది.

ఇటనుండి చక్రతీర్థమున కేగి చూచివత్తము. నది వా నలలో బ్రవహించునపుడు తీర్థమునకు దారి కించిద్దూరమని పించును. చక్రతీర్థమేమిటి! చక్రియను దాని కర్థమేమిటి? తుంగభద్రానీరమందు చంక్రమణముసేయుచున్నది. ఇందున్న కొండపై నొకమంటపము, గుడి యున్నది. వీనికేమి, ఎక్కడ జూచిన గుళ్లకు, మంటపములకు, నీ పట్టణప్రదేశమున గరవు లేదు. ఇక తిరిగి మరల మనమువచ్చినదారిని గలుసుకొని ప్రాగ్ప్రదేశమును జూడబోదము.

శ్రీకోదండరామస్వామివారి యాలయమునకు నూరుగజ ములదూరములోపల నొక మందిరపంక్తిద్వయము మనకు నైరృతిముఖమై బోవుచు జివర నొక యాలయమునొద్ద నాగు చున్నది, సూచనఫలక మిది 'లంజలబజా' రని చెప్పుచున్నది. అనగా నిదిపూర్వవిజయనగరవేశ్యావాటిక కాబోలు! వేశ్యలం దరు నిందే యుండిరనియా, కాక అచ్యుతాలయాశ్రితలగు వేశ్యలుమాత్ర మిందుండిరనియా? బహుశః రెండవపక్షమే మైయుండును. కాకున్న నంతయూరికి యీచిన్నబజారులో నుండెడు వేశ్యసంఖ్యయే సరిపోయెనా? అట్లైన ప్రతిదేవాలయ

మునకు నిట్టి యొక బజా రుండెడిదా? అట్లనుట కాధారములు లేవు. ఇక నెందును నట్టిబజారు నెవరును జూపించి యెరుగరు. అయిన వీరికి ప్రత్యేకముగ నొక బజారు నేర్పరచుట యూరిలోని భాగమును బాడుసేయుట కాదా?! ఒక పాశ్చాత్యుడొక నాడీ బజారున కొంతమంది యుద్యోగులతో నేగుచుండెనట! వారిలో నొకరిద్దరు పట్టపగలే యాయిండ్లలో జొరబడిరట. అది విపరీతమనితోచి, యాయన రాజసభ కేగగనే యిదియేమని రాజసన్నిధిని పృచ్ఛచేసెనట. దాని కందరు ముసిముసి నవ్వులు నవ్వుచు నూరకుండ నందొకపండితుడు, "దీని తప్పేమి! మన్మథోత్సవమున కనుకూలమైన దినములు మా పంచాగములలో నెప్పుడెప్పుడోగాని దొరకవు. ఈమధ్యమాగతి......"అని యేదో వేదాంతము జెప్పెనట! అట్టి యూహ లప్పటి గృహస్థు లందర కుండినచో నట్టివాటిక లెన్ని యున్న బట్టణమున కంతశోభయనుకొని యుందురు. కాని తప్పనియెంచియుండరు. సరే! మనమీ ధర్మసందేహము నాలోచింపుచు వీథినిచూచుట మానినాము. రెండు మందిరపంక్తులకు వెనుక గోనేరులు మంటపములు నున్నవి. ఎందులకో? అదిగో! అచ్యుతాలయము అనగా అచ్యుతరాయలు అచ్యుతుని పేర గట్టించినదియా? అట్లయిన నింత వేశ్యావాటిక మన కర్థమగుచున్నది. అచ్యుతరాయలు విజయనగరసింహాసన మెక్కినశృంగారపురుషులలో నొకడు. మొట్టమొదట మహాప్రవీణతతో రాజ్య మేలినను, బోనుబోను విషయాసక్తిం దవిలి, రాజ్యభారమును బావమరదియగు సలకతిమ్మన కొప్పగించి కాలక్షే

పము చేసెను. ఆ సందర్భమున నీ యాలయనిర్మాణము వేశ్యవాటికానిర్మాణము జరిగియుండెనోటు! సరే సరే అర్థమైనది.

ఈ యాలయ మతివిశాలముగ నున్నది. కాని తురకలు దీనిరాళ్ళపై దమప్రతాపము నపరిమితముగ జూపించినారు. ఇది యేదో మన కుడితట్టున నొక మంటప మున్నది. చూతము రండు. దీనిమీద నీ శిల్పమును బరీక్షింతము. ఓహో! వర్ణించుటకు వీలులేదే! కట్టించిన మహారాయల వారి మనోగతిని సూచించుచున్నది. అగును! కళాశాస్త్రముమటుకు శాస్త్రము కాదా? "మంటపములపై పురాణగాథలను జెక్కించినపుడు కళాశాస్త్రమందలి బంధముల నేల చెక్కించగూడదు, తానైన నట్లొనరింపకున్నా నా శాస్త్రమును గౌరవించువా రెవరు?" అని యా రాజావతంసమునకు దోచియుండవచ్చును. ఇంతకు, దేవాలయము కద! దేనినైన భరించగలదు.

దీని పశ్చిమద్వారము మాతంగపర్వతపు టుత్తర సోపానముల నందిచ్చుచున్నది. దక్షిణపుద్వారముగుండ నేగిన, నా కొండను దిగి యందుండి రాచనగరు కేగు ఘంటాపథమును గలుసుకొనవచ్చును. ఈ యాలయము పట్టణమందలి పెద్ద యాలయములలో నొకటి.

వచ్చిన దారినే తిరిగిపోయి తూర్పున కేగుచున్న పథమును గలుసుకొందము. లంజెలబజారు కెదురుగ నొక యాలయ మున్నది. ఇది తురకల మొదలు బట్టణములో

బ్రివేశించిన దారిలో నుండుటంబట్టి, వారు మన మే దేవా
లయమో యానవాలు పట్టలేనంత తున్నముగ ధ్వంసము చేసి
యున్నారు. ఇచ్చటికి కొంతదూరమున దారికి కుడివైపున
నొక చిన్న యాలయ మున్నది. అందులోని శేషశాయి యెంత
యందముగ నున్నాడో చూడుడు! అం దొక పెద్దశిలయందు
దానిలో నీ విగ్రిహము నెవడో శిల్పి చెక్కెను. ఆ శిల వెనుక
నుండి చీకటికోణమగు ప్రదక్షిణస్థల మున్నది. ఈ విగ్రి
హము చెక్కిన పనితనము మిక్కిలి ముద్దుగ నున్నది.

ఇటనుండి యొక ఫర్లాం గేగినచో నొక పహారామందిర
మగుపించుచున్నది. దాని వెనుక నొక జైనాలయ మున్నది.
వాటిరెంటికి నైఋతిదిక్కున వీటితోనూలుబట్టి కట్టినట్లు
మరొక పాడువడిన పహారామందిర మగుపడుచున్నది. ఇట్టి
మందిరము లెటనుండిన, యవి పురద్వారంబులని, యందొక
వీథియున్నదని యనుకొనవలయును. ఆవీథికి లంజెలబజారు
నకు మధ్య నొకకొండ యడ్డ మున్నది. ఆపాడువడ్డ మందిరమును
దాటినంతనే యొక లోయ - ఆలోయ మాతంగ పర్వతమునకు
దక్షిణముగనుండి తూర్పున నానెగొంది ఘంటాపథమువరకు
బడమర కృష్ణాపురమువరకు వ్యాపించియున్నది. ఈ రెండవ
మంటపమునకు జవా బెందును లేదు. బహుశః తురకలు
పడగొట్టియుందురు. రాచనగరు నానుకొని యుత్తరమున
నొక బజా రున్నదని, దానిని తూర్పుపడమర లేగు మరొక
బజారువచ్చి కలుసుకొని రెండుబజారులు నిందు సంధించి
నాలుగువైపుల నాల్గేర్పడుచున్నవని, యొక పాశ్చాత్యమహా

ష్మదీయ ప్రియాణికుడు వర్ణించియున్నాడు. అవి యిం దేమో యని మాయనుమానము. ఏమైన, దురకలు మొదలవచ్చిన దారి యిది కనుక, యిం దేమాత్రము మునుపటిపోలిక లేకుండ నన్నియు బాడయి యున్నవి.

మరల మనము మొదలిటి పహారామందిరముకడ కేగుదము. దాని కెదురుగ నొక పెద్దపల్లపురాతిచట్టు కలదు. ఆచట్టుచివర నెదురుగ నొక గుహ కలదు. అదియే సీతాదేవి నగలమూటను వానరులు దాచిన గుహ యందురు. ఆగుహ యొకచిన్నతిప్పలో నేర్పడియున్నది. ఆగుహ కెదురుగ సీతా సరోవర మున్నది. తైర్థికులిందు గ్రుంకి యాగుహను దర్శించి పోదురు. ఈ సరోవరమను పల్లములోనికి తుంగభద్ర దరులనాని ప్రవహించునపు డొకప్పుడు నీరువచ్చిన రావచ్చును. కాదేని చుట్టుపర్వతములపై బడ్డ నీ రిందుబడిన బడవచ్చును. ఏమైనను దీనిబూర్వముగూడ గౌరవించిరనుటకు దూర్పున దక్షిణమున గట్టిన మెట్లవరుసలే నిదర్శనము. ఆగుహవెనుక నొక పర్వత మున్నది. దానివెనుక తుంగభద్ర.

ఇక నీ పహారామందిరముకడనుండి తూర్పున కేగునపుడు, దీనికిదగ్గరగ గుడివైపున నొకకొండ యున్నది. ఇటనుండి యొకఫర్లాంగునరకు మనయెడమవైపున దారి నానుకొని యేటివరకు వృక్షమయము, ధోరణిచూడ నిం దేదియైన నుద్యానవన ముండెనా యనిపించును. ఇండ్లుండినగుర్తు లెవ్వియు గాన్పించవు. అందందు గోరంటమొక్క లుండి, యీశా

న్యమునకు బోనుబో నవి యొకమహావనమై, యడవివలె నది వరకు వ్యాపించియున్నవి. వానిరహస్య మెవ్వడు చెప్పగలడు?

మన మిక్లేగ నేగ రెండుఫర్లాంగులదూరములోగుడిమొ డమవైపుల, రెండు పాడువడిన యాలయము లున్నవి. వాని కీశాన్యమున నేబదిగజములదూరమున, నొక ద్వార మున్నది. ఆద్వారము నానుకొని యొక బలమైన కోటగోడ తూర్పున కేగుచున్నది కాని దాదాపు నేలమట్టమువరకు పాడువడి యున్నది. ఇందు రాళ్ళగుట్ట లందంధు కలవు. ఆద్వారము గుండ నేగితిమేని, యొకింత యీశాన్యముగ బూర్వపు రాతి వంతెన కాన్పించును. ఇది తురకలు నదినిదాటి వచ్చినదారి! అందువలననే కోటగోడ మొదలైనవి యట్లున్నవి!

ఇక నీవంతెన నెవరెప్పుడు కట్టించినది మనకుఁ దెలి యదు. దీనిని గురించి గ్రంథములలోగాని, శాసనములలో గాని, జనుఃలవాడుకలలోగాని యేమియు దెలియదు. దీని నెట్లు గట్టిరో చూతము. తుంగభద్రి అపరిమితవేగస్రివంతి, వంతెనల గట్టనిచ్చెడిదికాదు. అయిన దేవునిదయవలన బ్రిదే శ మంతయు బర్వతమయమని చెప్పియుంటిమికద! ఆపరిహారి యదృష్టవశమున, నిం దానది లోతట్టున నొకచట్టున్న దేమో చెప్పలేము కాని, యందందు పెద్దపెద్ద శిల లున్నవి. వానిని పునాది చేసికొని వంతెనను గట్టిరి.

ఆ వంతెననుగూడ నతిచిత్రిముగ గట్టిరి. విజయనగర శిల్పులకు నాలుగురాళ్లనుజెక్కి, వానిపై నాలుగువైపుల నాలు గడ్డపట్టెలను నిలబెట్టి, యందుపైన నడ్డరాళ్ళను బరచి, మందిర

మునుగట్టుట యతిసులభ కార్య మయిన ట్లగపడుచున్నది. క్రింద లభించిన బండలకు లోతుకప్పుల గొట్టి, మందిర స్తంభములకు లావైన కూసముల జెక్కి, వానిపై నిలబెట్టిరి. వానిపై నిలువు పట్టెలనడ్డపట్టెలనమర్చి, అన్నియు రాతివే, ఈయొడ్డునుండి యా యొడ్డున కొకకేమందిరపంక్తిని గట్టిరి. వానికప్పుపై భాగమున వంతెన యేర్పడినది. ఆ కప్పు షుమారు పదిపం[డెం] డడుగుల యెత్తున నున్నది. నది యిం దతివిశాలముగ బ్రవహించుటచే, యెట్టివరదలలో నైన, బదియడుగులకంటె నెక్కువయెత్తుగ బ్రవహించలేదు. ఒకసంవత్సరపు వరదలో దక్షిణపువైపుననిల్చియున్న రెండుమూడుమందిరములపై నెక్కిచూచితిమి. మా కట్లు తోచినది. ఇక నావంతెనపై నేన్గులుగూడ నవలీలగా నడువవచ్చును. దాని వైశాల్యము షుమారు పదిపండ్రెం డడుగులుండును. ఆవంతెన యంతయు నిప్పుడు పాడువడియున్నది. ఇది కాలముచేసిన మార్పుకాదు. ఆవంతెనను మహమ్మదీయులకు వాడుకొన వీలులేకుండ హిందువులు పాడుచేసిరో, లేక మహమ్మదీయులు, ఊరును బాడుచేసి పోవునపు డన్నిటితో బాటు దానినికూడ బాడుచేసి పోయిరో, చెప్పజాలము. అది యేమైనను ఆవంతెన యున్నంతకాలము, జనుల కత్యుపయోగముగ నుండెడిదని, నే డానదిని దాటవలసివచ్చిన ప్రతిమనుజుడును దప్పక యనుకొనును.

అన్నిటికన్న నాపట్టణము బాగున్నప్పుడు వేసవికాలములో సాయంసమయముల నావంతెన యెట్లుండియుండునో? నేటి మదాౖసుబీచివలె నుండియుండకుండునా? చల్లగాలి కెం

దరు వచ్చి యావంతెనపై విహరించుచుండిరో? అందలి నదీతీర మెంతయందముగ నుండియుండెడిదో? దానిని కనిపెట్టి, యే రాయలో, లేక యేభాగ్యవంతుడో, పురజనవిహారార్థము గాని, ఆత్మవిహారార్థముగాని, దానికి నైరృతిగ సీతాసరోవర మువరకు వ్యాపించిన యుద్యానవనమును వేయించెనేమో? అప్పటి యాసందడి, యానావాహనవిలాసము, తుంగభద్రితో సరసములాడు ప్రజాకలకలము, ఆ విటగాయకసమావేశము- ఆవిలాసముల నెవరు నేడు వర్ణింపగలరు! ఈవంతెన యొద్ద కొన్ని వేలమంది యాసీనులై యిష్టాగోష్ఠి గాలక్షేపము సేయుటకు వీలున్నది. ఇప్పుడో! పక్షుల కలకలరావములు ఒక వెయ్యి హేకోసెంటుడబ్బాలు గుప్పుమ్మరించినట్లు గుప్పెడు గోరంటపూతల పరిమళము, తప్ప నాటిశోభను మనమనస్సునకు దెచ్చువిశేషము లొండేమియు లేవు. కాల మేలాటిమార్పు చేసినది!

ఈవంతెనకు దగ్గరలో నొకింత నాగ్నేయముగ నొక మోటమాదిరియంత్రము కాన్పించుచున్నది. అందువలన లభించిన నీరము రాతికాల్వకుండ విఠలాపురమున కేగుచున్నది. ఇదియొక బావియై యుండనోపు.

వంతెనకడనుండి యాగ్నేయముగ నేగిన మరొక ద్వారము కాన్పించును. దాని నానుకొని దానికి కుడివైపున నొకబురు జున్నది. ఆబురుజు నాధారము చేసికొని బలమైన కోటగోడ యిందగపడుచున్నది. కొంచెము వెనుక కేసి, యందున్న కొండపై నొకింత యెక్కి, యీదర్వాజాలు రెంటి

మధ్యభాగముగ నగపడు కోటగోడ కెదురుగ నిలుచుండి వంతెనవైపున జూడుడు. ఇందలి కోటకట్టడ మసాధారణ ముగ నున్నది. అతి బలమైనదిగా గాన్పించుచున్నది. దానికి కారణము మే మిదివరలో జెప్పిన కావలాలోనిలోపమేగాని వేరు కాదు. తుంగభద్రికావల బయలు; ఇందు తుంగభద్రి విశాలమగుటచే లోతు లేదు. అందువలన మనుష్యయత్న ములో లోపములేకుండ గోటను గట్టిరి. పాపము! ఎంతకృషి చేసిరి! ఏమిసార్థకము! చివర కీవంతెనను ఇందున్న కోటబురుజు లను గాపాడగలవీరభటులు లేకపోయిరి! 'తగుసంఖ్యవా రుం డిన గొన్నినెలలవరకో, లేకున్న నెప్పటికినో, తురకల నావ లియొడ్డుననే యాపియుందురు. అని యూహించియేకద పాప మారాజులు, ఈ వంతెనను, దాని కావల గాన్పించు మైదాన ము పోయి కలియు పంపాసరోవరప్రాంతప్రదేశమును, దమ శక్తివంచన లేకుండ బలపరచిరి. ఇందులకై యందెట్టి గోడ లను, దర్వాజాలను గట్టినది, పంపాసరోవరమున కేగినపుడు చూతముగాక! బలపరచిన నేమిసార్థకము. ఇంటిగుట్టెరిగిన తురకలు "తిరిగిపోయి" నంతనే, నిందలిలోపము శతృవులకు దెలిసిపోయె. వా రతివేగగాములై వచ్చి యూరిలో బడిరి. "తా నొకటి తలప దైవమొకటి తలచును" అనుట కిదియేగద యర్థము!

మొత్తమున కీ ప్రాంతముల నెందు జూచినను "ఇది యొక యూరు. ఇం దెన్నడో మనుష్యులు నివసించిరి" యను జాడలకన్న "ఇది యొకప్పు డొక కోట. ఇది యుద్ధములు

సేయ నేర్పడినది. అందులో నీ తావు శతృవుల కభేద్యముగ నుండునటుల గట్టించినారు" అని తోచకపోదు. అంతయు సక్రమముగ నుండినపు డిందొక సైన్యమే కాపలాకు నియమితమై యుండెడిదా యను సందేహము తోచకపోదు. అన్నిటినిబట్టి యోజించగా, విజయనగరపట్టణమున కిది కంఠప్రాయమై యుండనోపు నని అనగా, పట్టణముపై నేతెంచిన వారి కీ భాగము చే జిక్కినచో మిగిలినదాని నతిసులభముగ నాక్రమించు కొనగలరని మా యభిప్రాయము.

## 10వ ప్రకరణము.

# విరలాపురము.

ఆ రెండవదర్వాజానుండి యొకింత తూర్పుగ నేగినంతనే, ఒక పహారామందిరము కనబడుచున్నది. ఈ పహారామందిరములు రెండువిధములుగ నున్నవి. కొన్ని హంపీబజారులో జూచిన దానివలె వట్టి మందిరములే. క్రింద పైన మూడేసి నాల్గేసి మందిరము లుండునట్లుగా గట్టినవి. కొన్ని యట్లుకాక హజారద్వారములపై నిల్చియున్నవి. ఇందు మనకు రెండవమాదిరి దగుపించును. ఇది యెడమవైపున నొక కొండను, కుడివైపున మన మింత క్రితము చూచిన కోటగోడను, ఆనుకొనియున్నది. ఆ కోటగోడయిటనుండి తూర్పున కేగి యేటియొడ్డుననున్న కొండను గలియుచున్నది. ఈ మందిర మన్నిటివంటిదిగాక శ్రద్ధతో

గట్టిన వానిలో నొకటిగ గన్పడుచున్నది. దీని కిరుగెలంకుల నొక్కొక చిన్నగది యున్నది. ఆ గది, బహుశః, పహారా వారికి గావలసిన మందుగుండుసామానులును దాచుకొనుటకై గట్టినట్లు తోచును. అట్టి కొట్లు అన్ని హాజారములలో గాన్పించవు; ఇందుమట్టు కట్టివి యేర్పడియుండుటను జూడ, గతపరికరణాంతమున మేము చెప్పిన లోపమును జ్ఞప్తి యుంచుకొని, ఆ తావున కిది సమీపమగుట, దానివలన రాగల యాపదల నివారించుటకై నింత శ్రద్ధగ గట్టిరని పించును. ఈ హాజారము బహుశః మనము గడిచివచ్చిన భాగమం దుండిన యిండ్లకై యేర్పడిన ట్లున్నది.

ఈ హాజారమునకు షుమారొక యరఫర్లాంగుదూరములో తులాభారము దూగుట కేర్పరచిన రెండు పెద్ద స్తంభములు, పైనొక యడ్డపట్టె యున్నవి. తులాభార స్తంభముల, నీస్థలములో నెందులకు నిలిపిరో చెప్పలేము. ముందున్న విఠలాపురమునకు సంబంధించినచో, దానిహాజారమున కావల యుండవలె!

దానిని గడచి యొకింత జనినంతనే, మరొక పెద్దహాజారముగాన్పించును. ఈహాజారపుటడుగుగోడలమీద నతిచిత్రమైన శిల్ప మున్నది. ఇది విఠలాపురమునకు బడమర హాజారము. దీనిని దాటినంతనే విఠలాలయము, విఠలాపురము కనబడును. ఆయాలయము, వీథియు నతిదీర్ఘములుగ నున్నవి.

విఠలాపురము తూర్పుపడమరల నడువక యొకింత యీశాన్యముగ నడుచుచున్నది. ఈహాజారమునుండి నది

వరకు నతివిశాలమగుప్రదేశ మున్నది. అది యంతయు నిండ్ల తో నిండియుండెను.

విఠలాలయ పశ్చిమగోపురము భగ్నముచేసినట్లున్నది. ప్రభుత్వమువారీపోటీ స్తంభముల గట్టనిమెడల, నీగోపురము నాడే భూపతనమై యుండును. ద్వారపుపట్టెలపై బొమ్మలను జూచినంతనే మహమ్మదీయశౌర్యచిహ్నము లగుపడును. లోనికేగి నలుగడల జూచినంతనే తురకలు బాగుగ పాడు చేసిన యాలయములలో నిదియొకటి యని తోచును.

విఠలాలయము విజయనగరాలయములలో బెద్దవానిలో నొకటి: పంథర్పురవిఠలేశ్వరునకై యుద్దేశించినది కావున, విజయనగరసార్వభౌములలో నగ్రగణ్యుడగు శ్రీకృష్ణరాయలు ప్రారంభించినది కావున, యిది మిగిలినవానికన్న ననేక విషయములలో నుత్తమ మనిపించుకొనవలెను. ఆలయమును బరీక్షించి మనము వెడలిపోవునప్పటికి మన కెట్టియభిప్రాయము తోచునో చూతము.

ముందు మన గుడివైపుననున్న మంటపమును జూతము. బైటనుండియే యింతయందముగ నున్నదే! ఒక్కసారి దాని చూరును జూడుడు! ఒక్కరాతి నిట్లు వెండిగిన్నెయంచు వలె నుండున ట్లెట్లు చెక్కిరో! చెక్కిరిగాక - అంతయెత్తున కెట్లెత్తి యం దేవిధమైన లోపము లేకుండ నెట్లు నిల్పిరో?! ఆయంచున దోరణములకై యేర్పరచిన కిరింతల జూడుడు. లోని కేగుదము. ఒకపరి తలయెత్తి నాల్గువైపుల బైన జూచి నంతనే-అరరే! ఏమిశిల్పము! ఏమి యలంకారము! ఏమిశోభ

యని మనమనములు నివ్వెరబోవుచున్నవి! ఒకంత నిదానించి చూచినవెంటనే "యిది కల్యాణమంటపము" అని తట్టును. మంటపమధ్యముననున్న తిన్నెపై నెక్కి కప్పును జూచినంతనే మన యచ్చెరు వధికమగుచున్నది. పద్మములో బద్మము నిమిడ్చి యాపెద్దరాతిపలకల బై కెట్లెత్తిరో?యందెట్లునిల్పిరో? చూడు డాచిల్కలసొరు! బ్రతికియున్నవా యేమి? ఏమిజీవము! వాని రంగు లెంత పసందుగ నున్నవి. నిన్ననో మొన్ననో కుంచెతో బనిచేసిన ట్లున్నదే! ఏమహాత్ము డవ్వారి కావిద్య నేర్పెనో.

దీని స్తంభము లెంత విచిత్రముగ నున్నవి! ఈసింహాములు గుర్రములు వానిపై రాతులు మనపై దుముకుదురా యేమి? ఈరాతులు తురకలా, హిందువులా? మనవారే. వారి నిందేల జెక్కుదురు. ఇక నీస్తంభములమీది శిల్ప మెంత సొంపుగ నున్నది! కొంచెము పరిశీలించి చూతము. ఇవి మన యూళ్ల దేవాలయములలో నున్నవానివలె వట్టి బొమ్మలా లేక వీని కర్థమేమైన నున్నదా! ఓహోహో! ఈశిల్పి యీ స్తంభములపై దశావతారములను జెక్కినాడు, చూడుడు! ఇదిగో! మత్స్యావతారము, ఇదిగో! కూర్మావతారము, ఇదిగో! వరాహావతారము, ఇదిగో! నృసింహావతారము! ఇదిగో! యిదిగో! యిదిగో! మిగిలినయవతారములు. ఎంత సొంపుగ జెక్కియున్నాడో! అంతటితో నాయెనా? ఇదిగో! పురాణములందలిగాథ. ఇటుచూడుడు మరొకగాథ యున్నది. ఈవిధముగ గొన్నిపురాణగాథలను గనులకు గట్టినట్లు! చూపించుచున్నాడు. వెలుపలి స్తంభములు నట్లే యున్నవి.

పురాణగాథాప్రదర్శకములుగ నున్నవి! కేవల మాగాథ లతోనే శిల్పి కాలక్షేపము సేయలేదు. అందందు దన కవితాశక్తి నగుపర్చినాడు. చూడుడీ గొల్లవా డెట్లున్నాడో! నెత్తిమీద గొంగళిమొదలుకొని, చేతిలో గొంకెకర్రవరకు సకలపరికరములు, నొక్కటియైన దప్పకుండ జెక్కినాడు. ఆకౌతుల దుస్తుల జూడుడు. పదునైదు పదారవశతాబ్దము లందు ధరించిన చర్మకవచములే గాని, యేదో, యెన్నడో, యెవ్వరో, చెప్పినది విని, వీనిపై గప్పి యుండలేదు. ఇట్లే యనేకవిషయములలో శిల్పనైపుణ్యము కనుల గట్టిన ట్లగ పడుచున్నది. చూడజూడ, నీమంటపముకడకు పురాణ వేత్త నొకని వెంటబెట్టుకొని వచ్చి, రెండురోజులు కూర్చుం డి, యతనివలన నిందలి శిల్పమునుగురించి విననగాని, దీనిని మనము పూర్తిగ నర్థము చేసికొనినవారముగా మని పించును. ఈమంటపపు వెలుపలి స్తంభము లందందు బీటికలు వాసినవి. అవి పడిపోకుండ నేటిప్రభుత్వమువారు వానిని ఇనుపరేకులతో, నిత్తడిరేకులతో బిగించినారు.

ఈ మంటపమున కుత్తరముగ నాలయమున కెదురుగ నున్న యీ చిత్రమును జూడుడు! ఇదొక చిన్న రాతిరథము! ఎంత చక్కగ నున్నది! ఆ శిల్పి యెనడో కాని దీని నొక్క రాతిలో జెక్కినాడు. దానియాకృతి దూరమునుండి చూచిన నిది కదులునా యనిపించును. కాని కదులుట కేర్పడినది కాదు. దానిపై నెక్కుట కొకరాతినిచ్చెన నమర్చినారు. ఎక్కి చూతము. ఈ రథముపై నుత్సవవిగ్రహముల నిల్పు

టకుతా వున్నది. ఆహా రథ స్తంభములు, పట్టెలు, బొమ్మలు, నన్నియు నచ్చపురథమునకు వలెనే యున్నవే! ఈ విఠలేశ్వ రుని యదృష్టము. ఊరేగుట నటుంచి వారు వాంఛించినచో ననుదినము రథోత్సవము సేయించుకొనగలరు. మహాను భావుడు - మహారాజుల పూజలందు దేవుడు - ఆయన కేమి కొరత! సరేకాని ఈ రథమునకు దక్షిణపువైపు చక్రము లలో నెదుటిచక్రపుటిరుసేలొకో యింత యరిగియున్నది! ఆ చక్రము నెన్నిసారులు త్రిప్పిన నంత పుణ్యమను నమ్మ కముచే, దరతరములనుండి, త్రైర్థికులు దానిని త్రిప్పి త్రిప్పి యా యిరుసు నీ గతికి తెచ్చిరి. మరికొన్ని తరములలో నిరుసు విరుగగలదు. 1565 నకు పూర్వ మీ చక్రము నెవ్వరు త్రిప్పియుండరు. ఇప్పటి ప్రభుత్వమువారి కీ సంగతి తెలియదు కాబోలు. తెలిసినచో దాని నంటకుండ నేదియో యేర్పాటును జేసియుందురు. ఇంతనైన నట్టి 'బందోబస్తు' జరుగకుండిన, గొంతకాలమున కీ రథము మూడు చక్రముల రథము కాగలదు.

ఈరథమున కెదురుగ శ్రీ విఠలేశ్వరాలయముఖ మంటపము, గర్భాలయము లున్నవి. ముఖమంటప సోపాన పంక్తి నానుకొనియున్న యేనుగులనొకసారి చూడుడు. ఏలొకో యాతొందర? ఎందేగనుండె? వట్టినడక కాదే, పరుగిడుచుండె! శిల్పములో జీవమన నట్లుండవలె! కాళిదాసు, తిక్కన కవిత్వ ములవలె నున్నది. పైకెక్కిచూచిన—"ఏమిది! ఏమి యీ వైశా ల్యము - ఏమి యీ స్తంభములు! అరరే! కప్పు కొన్నిచోట్ల

ఛప్పగ బడిపోయినదే: అయిననేమి! బాగుండినపు డెట్లుండి యుండునో యూహించుటకు గావలసినంత యింకను మిగిలి యున్నది - అనిపించి, చూచుకొలది, ఆహారావము లుప్ప తిల్ల, మనము చేష్టలు దక్కి నిలబడునట్లు చేయగలిగి యున్నది.

ముఖమంటపగర్భములను జూడుడు! మధ్యగర్భము కొలంకులవానికన్న విశాలమైనది. షుమారు ముప్పది నలుబది యడుగుల వెడల్పు కలది. దానిపై కప్పు షుమా గిరువది, యిరు వదియై దడుగల యెత్తున్నది. అది చాలవరకు అరగజము మొదలు ముప్పాతిక గజము వెడలుపుగల యేకాండపు బండ లతో గప్పియున్నది. ప్రక్కగర్భములు, స్తంభములపై మంటపాకారములు ధరించి, పైకప్పు శిల్పచాతురిని వెదజల్లు పద్మములతో నొప్పియున్నది. దానికి మన మెంత సమాధాన ముల నూహించినను ఆయేకాండపు బండలు, ఆపద్మములు, ఒక్కొకపరి యాచవుకపుకప్పురాళ్లు, అంతయెత్తున కెట్లు లేచి నవా, ఆయాచోట్ల నూలిచూపునకు దప్పకుండ నెట్లు నిల్చి నవా యని పదేపదే మన కాశ్చర్యము కలిగించుచున్నవి. అది యేగాక ఆచూరురాయి గిన్నెయంచుల ఆకారముతో జెక్కినవి, అంతపెద్దవి, అంతపొడవులైనవి యెట్లు లేచి నిలిచినవా యని కూడ నచ్చెరువగుచున్నది! తరువాత, నింత విశాలమైన ముఖమంటపము సాధారణముగ నేయాలయములలో నుండదే, యింత దేందులకు నిర్మించిరా, దీనిలో నేమిచేయ నెంచిరా యని కొంత యబ్బుర మగుచున్నది! ఇక దీని స్తంభముల సంగతి.

వాని యెత్తింతయని మంటపపుపై త్తెరిగినవారికి చెప్పనక్కర లేదుకద! ప్రతిస్తంభము, పురాణకథాసంశోభితమేగాని వట్టి దికాదు కద! మంటపమున కెదురనున్న స్తంభములు చూడుడు!

ఒక పెద్దస్తంభములో లావులో నొకదాని నొకటి పోలకుండ నెన్నియున్నవో చూడుడు! ఇన్ని యెందులకో? మన చేతనున్నకర్రతో వాయించి చూతము. ఇ దేమివ్రోత? దేని నో యనుకరించియున్న దే? మన మెరిగినయేధ్వనినో పోలియు న్న దే? ఓహో అదియా! షడ్జస్వరధ్వనియా! సరిగమపధని సలధ్వనియా! ఆహా! యివి సంగీత స్తంభములా! వీని సంగీత మున కేనా యీ భోగముమేళ మాడుచున్నది. ఈమేళము నేగోడలమీదనో చెక్కక, ప్రత్యేకముగ వానిని మందిరము లో నిలబెట్టినారు. ఈశిల్పులకౌశలము నెట్లభివర్ణింతము?

ముఖమంటపమునుండి లోనికేగినచో నొక పెద్దచావడి యున్నది. కానిదీనికప్పంతయుబడిపోయియున్నది-అనినప్పుడు మహమ్మదీయులు పడగొట్టిరి అనినమాటమరువకుందురుగాక. ఈసావడికి నెదుట గర్భగుడి, మిగిలినమూడువైపుల మూడు ద్వారములు కలవు. ఆగర్భాలయపు మొత్త నానించియున్న ద్వారపాలకవిగ్రహములను జూడుడు. ఎంతయెత్తుగ గంభీర ముగ నున్నవో! అంతద్వారపాలకులు తురకల బారదోలి లేకపోవుట నటుంచి, వారిధాటికి తమ ఆయుధములు గాక తామే మొక్కవోయి యున్నారు! గర్భాలయమునకు ముం దు మొత్తల నిరువైపుల నీ క్రంత లేమిటి? అది ప్రదక్షిణస్థలము చీకటికోణముగ నున్నది. లోని కేగి చుట్టును దిరుగుకొలద

యాలయశోభ గాన్పించుచున్నది. పైసందునుండి క్రిందికి జిమ్ముచున్న వెలుగులో నాపనీరు బుడ్డెంత కనులపండువుగ నున్నవో చూడుడు ! ఈ రహస్యప్రదక్షిణస్థలములో షుమారు వందమంది యోధులు దాగి గర్భగుడిలోని కేగనున్న శాత్రవుల నిరుగెలంకుల వేధించి వధించగలరు. గర్భగుడి సామాన్యముగ నున్నది, అంత పెద్దదికాదు. ఏమైననేమి, యిప్పుడు ఖాళీగా నున్నది. ఈయాలయములో బ్రతిష్ఠ జరిగినదా లేదా ? ముందు చూతము.

ఆలయము నొకసారి చుట్టివత్తము. వెలుపలిగోడక్రింద వైపున నాలయముచుట్టునున్న శిల్పమును జూడుడు. మధ్య మధ్య మూడునాలు గడుగుల యెత్తుగల విగ్రహములను నిలబెట్టుట కేర్పరచిన గూళ్లను జూడుడు. ఆగూళ్లలోని విగ్రహములముక్క లందందు పడియున్నవి. అవి నల్లరాతివిగ్రహములు. ఆగూళ్లలో నవియుండ నీగోడలెంత యందముగ నుండెడివో! అంతేగాక గోడలపైనెన్ని శాసనములున్నవో చూడుడు. తెలుగుకన్న కన్నడభాషలలో నెక్కువగ నున్నవి. వానిలో గొన్నిటినిబట్టి యాలయములో బ్రతిష్ఠయైనదని తెలియుచున్నది, లేకున్న నాదానముల జేసియుండరు కదా.

ఉత్తరపువైపున గోపురము, ద్వారము నున్నవి. వెనుక ప్రక్కను బ్రాకారము నానుకొని యెన్నిమందిరము లుండెడివో పడిపోయిన వానిని లెక్కింపుడు. ఇవి యైత్రికుల కుద్దేశించినవైయుండనోపు. దక్షిణపువైపున కల్యాణమంటపమును, పడమరనున్న యీపెద్దమంటపమును జూడుడు. బహుశః

యిది వాహనములను దాచెడు చోటయి యుండనోపు. దీనికి జవాబుగ దూర్పున నిట్టిపెద్దమంటప మొకటియున్నది. వీని లో మనమంత గమనించి పరిశీలించవలసిన విశేషములులేవు. ఒక్క విషయముమాత్రము కలదు. ఈ తూర్పుమంటపపు కప్పు చూడుడు. కట్టినవాడు బల్లపరుపు మాని మూల పరుపు తెలివి చూపినాడు. ఆ పరుపులో మూల లెంతచాక చక్యముతో గప్పి కలిపినాడో విచారింపుడు.

అన్నివిషయములను బరిశోధించినచో, నిది దేశములోని యందమైన యాలయములలో నొకటియని తోచకపోదు. విఠలేశ్వరుని మాహాత్మ్యమునకు శ్రీకృష్ణదేవరాయల సార్వభౌమత్వమునకు దగియుండ గట్టిన యీయాలయమిం కెట్లుం డునః? ఎట్లున్నను నీయాలయమును దురకలు తమ తనివితీర బాడుచేసిరి. వారుపెట్టిన మంటలవలన కప్పిన గవురు ఆలయ స్తంభములపై, దానికప్పురాళ్ళపై నందం దిప్పటికిని బొడ సూపుచున్నది. చేతు లెట్లాడెనో యనకుడు-మనకిట్టి దీయాలయ మును గట్టించు టెంతపుణ్యమో, వారి కట్టివానిని నాశనము చేయుట యంతపుణ్యము !

తూర్పుగోపురముక్రిందనున్న దర్వాజాగుండ బయటికి పోయిచూచినంతనే మనకెదుర విఠలాపురము కన్పడును. మన యెడమవైపున నుత్తరముగ నదివరకు నింకొకవీథియుండినట్లు తోచును. ఇదిచిన్నదికాని యెదురవీథిమటుకు గడుపెద్దది. హంపీబజారుకన్న పెద్దదనియే చెప్పవచ్చును. మామూలు మందిరపంక్తు లున్నవి. పంక్తికి పంక్తికి నడుమ, నెంతవైశా

ల్యమున్నదో చూడుడు! మదాసులోని మౌంటురోడ్డుకంటె విశాలముగనున్నది. ఈమందిరపంక్తులలో నందందు సందు లున్నవి. ఆసందులకెదుర వట్టి మంటపము లున్నవి. ఎందు లకో మనమిప్పు డేమాత్ర మూహించలేము. పంక్తులమధ్య నున్న ఘంటాపథముపై రాళ్ళు పరచిన ట్లందందుగాన్పించును. దీనినిబట్టి నగర ఘంటాపథములన్నియు రాళ్ళు బరచినవని యూహింపవచ్చును. అది నిజమని, హంపీబజారులో నైదా రడుగులు త్రవ్వించిన రాళ్ళపరుపు బైటబడునని, మేము 1917 సంవత్సరములో నేగినపు, డప్పటి హాసుపేట గ్రామ మునసబుగారు మాతో జెప్పిరి. దానికి తార్కాణముగ 1918 సంవత్సరములో మేమేగినపు డెందులకో యావీథిలో నొక గొయ్యి త్రవ్వించుచు కొన్ని పరుపుబండలను దీసి బైట బడవే సిరి. ఆపరుపు సరియైనస్థితిలో నున్నపుడు వీథి యెంతయంద ముగనుండెడిదో, మందిరము లెంత యున్నతములుగ నుండె డివో యాయాత్రిలో భావించుకొంటిమి.

ఈ వీథిలో దురకలధాటి చక్కగ బ్రదర్శితమైనది. మందిరములలో బైయంత స్తెందును లేదు. వారికి దారిలో మొట్టమొదట గాన్పించిన దిదియే కావున విఠలాపురమును మనసార నాశనముచేసి యుందురు.

ఈ వీథిచివర, మనకు గుడివైపున నొకమార్గ మేగు చున్నది అది మాల్యవంతమున కేగెడుదారి; ఇప్పటి ప్రభు త్వమువారు వేయించినది. ఎడమవైపున నేగినచో, నీఘంటా పథము కమలాపురమునుండి యానెగొంది కేగెడు ఘంటాపథ

ములో గలియుచున్నది. రేపకడ మరల నీదారినివచ్చి పట్టణమునకు బాహ్యప్రదేశమున మిగిలియున్నవానిని జూతము. నేటికి తిరిగి విఠలాపురముగుండ, దాని హాజారముగుండ తులాభారము క్రిందినుంచి, దర్వాజాగుండ బోవుచు, కాపలాలో లోపమేర్పడిన భాగము నొక్కసారిచూచి నిట్టూర్పు విడిచి, సీతాసరోవరపు చట్టుపై నొకింత విశ్రమించి, లంజెల బజారునుజూచి నవ్వుకొనుచు, శ్రీ కోదండరామస్వామికి మొ్రక్కి, రామలక్ష్మణ గుండ్లక్రింది దారిగుండబోయి, పంపాపురమందలి బస జేరుదము. ఇప్పటికి పూర్వవిజయనగరములో దూర్పున నానెగొంది ఘంటాపథమువరకు, దక్షిణమున రాచనగరు చివరవరకు జూచినాము. ఆగ్నేయముగ దిరిగి చూడనిభాగము మాతంగమునకు గుడివైపున నున్న లోయ. దానిలో జూచుటకేమియు లేదు.

## 11 వ ప్ర క ర ణ ము.

# నింభాపురము – మాల్యవంతము – కమలాపురము.

నిన్నటిదారినే వచ్చి, కమలాపురమునుండి యానెగొంది కేగుమార్గమును గలుసుకొని, కమలాపురము వైపునకు గొంచెము సాగినచో నింభాపురమార్గము లభించును. పూర్వమాయూరికిపోవు ఘంటాపథ మెందుండినది యిప్పుడు తెలి

యదు. మనమేగునది డొంకగాని ఘంటాపథ మనిపించుకొ నదు. మనదారి కిరుప్రక్కల గొంతదూరమువరకు బొల ము లున్నవి. అచట నొక పెద్దతుంగభద్రకాల్వ మన కడ్డము వచ్చును. దానిని వంతెనమీదుగ దాటినంతనే నొకపెద్ద మామిడితోపు తారసిల్లును. ఇందు వృక్షజాతులలో నొక చిత్రమున్నది. భూసారమువలన, అనగా బాడువడిన యూరి ప్రదేశముననున్న పాటిమన్నువలన చెట్లు చేమలు, మిస మిసలాడుచు, పసిమిని గ్రక్కుచు నల్పును, సవాలు సేయునాకు పచ్చరంగుతో నొప్పారుచున్నవి. వానివృద్ధి యపరిమితముగ నున్నది. ఉదాహరణమున కీ మామిడిచెట్లను జూడుడు. ఒక్కొ కటి రెండుమూడు తాటిచెట్ల యెత్తున నెదిగి యున్నవి. వాని మొదళ్లకొక్కొకపరి షుమారు పండ్రెండు పదమూడు గజ ముల చుట్టుకొలత యున్నది. ఆతోపులో గొన్నియెడల సూర్యరశ్మి యెన్నడైన భూతలము నంటినదా, యని శంక గొలుపదగినంత దట్టమైన నీడ యగుపించుచున్నది. వేసవికాల ములో నీతోపున మకాములు సేయు నదృష్టవంతులకు, చలువ చప్పరము లెందులకు? వట్టివేళ్ల తడక లెందులకు? దాపల నది, యెదుట కాల్వ, దూరమున బర్వతములు, పైని నంధకార బంధురమగు నీడను విస్తరించు వృక్షరాజములు, నీప్రదేశ మాయదృష్టవంతులు చేసుకొనిన పుణ్యఫలంబన, బైనుండి రాలినస్వర్గభాగమా యనిపించకపోదు!

ఈ తోపును గ్రహించినంతనే మన కందందు కట్టడముల భద్రింపులు, కొన్నిచోట్ల పునాదులు నగుపడును. వీనిలో

నెందో శ్రీకృష్ణరాయల పరిధానిగ జేర్పడిన మంత్రి తిమ్మ రుసుగారి మందిర మున్నదని యొకరు వ్రాసిరి. ఇక్కడ సూచకపటములు లేవు. కూలివాండ్రు మనకు దగిన సహాయము చేయలేరు. రాజబంధువులలో నేరును అది యిందున్న దని చెప్పలేరు. అందుచే నెందున్నదో చెప్పజాలము. మహావృద్ధీయు లానెగొంది నాక్రమించుకొని యేరుదాటి వచ్చిన దారి నానుకొని యుండిన పట్టణభాగము గనుక, యెట్టి యానవాలును లేకుండ బాడువడి యున్నది. అట్టిచో నిం దదియేదియో, యెందున్నదో, మనకు దెలియకుండుట యబ్బురము కాదు.

ఆ కట్టడపుగుర్తులు దాటినంతనే యొక దర్వాజా యున్నది. ఇది పురముచివరనున్న దర్వాజాలలో నొకటి. కాబట్టి కడు బందోబస్తుగ నున్నది. కాని యెంత పాడువడి యున్నది! ఇప్పటికి మును పెట్లుండియుండెడిదో యూహించ గలము. రాచనగరు దర్వాజాలోని మెలిక లున్నవి. శత్రువులు లోబ్రవేశించినంతనే గొంతసేపు నాల్గుబురుజుల బారుల కెర గాకపోరు. వీనిరహస్యము ముందు మన కగుపించబోవు మరొక దర్వాజాయొద్ద విచారింతేము.

ఆ దర్వాజాను విడిచినంతనే మనకు కాలిబాట యొకటి లభించును. వాలికాష్ఠమును జూడబోవువా రాదారిని కొంత దూర మేగవలె. పోవుకొలది కుడివైపున గొండలు, యెడమ వైపున బొలములు గనబడును. చివరకొక జొన్నచేలో "అల్లదిగో వాలికాష్ఠ" మని యొక చిన్న ప్రోవును అందున్న కాపరులు

చూపింతురు. మనము బయలు దేరునపుడు "వాలి త్రేతాయుగ పురుషుడుగదా: త్రేతాయుగమునాటి వా రేడు గజముల పొడవని మనపురాణములలో నున్నది: కాబట్టి వాలికాష్ఠము పెద్ద గుట్టపడియుండవలె" ననుకొని యుందుము. ఇందంతగుట్ట కనపడదు. దానికి రెండు కారణములు స్ఫురించుచున్నవి. తరతరములనుండి వైద్యులు లిం దేతెంచి యాబూదిని కొంచెము తీసుకొని మోముల ధరించుచుండిరి. అందుతో గొంత తరిగియుండవలె. రెండవది శిస్తులకోసము బ్రిటిషువా రన్ని తావులతో బాటీ ప్రదేశ ప్రాంతభూమిని గూడ రైతుల వ్యవసాయమున కిచ్చిరి. తమ పంటలే ప్రధానముగ నెంచుకొను రైతులు ఆ స్థలము నాక్రమించి దానిని తగ్గించి యుందురు. అందుల కని మన కిపుడు గాన్పించు ప్రోవతిచిన్నదిగ గాన్పించుచున్నది. ఆ బూది నొకింత పరీక్షించినచో నది యస్థికల ప్రోవేయని మన కనిపించకపోదు. అట్టి మన్ను మనకు చూపించెడు తావుననేగాక యా ప్రక్కల నందందు కాన్పించుచున్నది. ఎముకపొడుముతో గలిసిన మన్నని యిందుగల పంటల బలమే ధ్రువపరచుచున్నది.

అయిన వాలికాష్ఠము విషయ మింతతో ముగియలేదు. "ఎక్కడి త్రేతాయుగము, ఎక్కడి కలియుగము! నేటికి షుమారు పదిపండ్రెండులక్షల సంవత్సరములనాటి ముచ్చటే! వాలిశరీర మెంతపెద్దదైనను వాని యస్థికలబూడిదె యిన్నాళ్లుండునా ? మధ్య యెన్నివర్షాకాలము లేగినవి, ఎన్ని దుక్కులవాన కురిసినది, ఎన్నిమార్పులు జరిగినవి?! దాపు

లనున్న తుంగభద్రానది యొకప్పుడైన నిట్లొక వరదను విసరి యుండగూడదా? చివరకు దానితోనైన నీకాష్ఠప్రశంస యంతరించి యుండదా!" అను శంకలు పాశ్చాత్యవిమర్శనాపద్ధతులలో మునిగి తేలిన బుద్ధులకు దోచకపోవు. ఈశంకలను బూర్వపక్షము సేయుట దుర్లభమేకాని, యాప్రోవు ఎముకల బూడిదె కాదనుట యంతకన్న దుర్లభము. అట్లైనచో నెవరి యెముకలు, ఎవరి బూడిదె యను సందేహము దోచును. దానికి దగిన సమాధాన మున్నది. "ఈనింభాపుర మనునది పూర్వవిజయనగరమున కీశాన్యదిక్కున నున్నది. శ్మశానము లాదిక్కున నుండుట శాస్త్రసమ్మతము. ఎముకబూడిదె ప్రోవిం దున్నది కాబట్టి యూరిశ్మశానమో, కాకున్న రెండు వందల యిరువదితొమ్మిది సంవత్సరము లీయూర గాపురము సేసిన రాయల వంశమువారలు, తమకు బ్రత్యేకముగ నేర్పారచుకొనిన శ్మశానమో యిందుండి యుండవలెను. అందులో జాలభాగము పొలముల యాక్రమణముచే సన్నగిలి నేటికొక చిన్నగుట్టవలె మనకు గాన్పించుచున్నది" అని యొక సిద్ధాంతము చేయవచ్చును. కొందరు పాశ్చాత్యపండితు లీ సిద్ధాంతమునే జేసియున్నారు. దీనికొక్కటే పూర్వపక్షము మున్నది. "అప్పుడు దహనానంతరము సంచయనాచారములేదా, నేడు శాస్త్రీయముగ సంచయనము జరిగినపట్లనెల్ల, కర్త శ్రద్ధాభక్తులుగలవాడైనచో బూది కాసంతైన మిగులకుండ బ్రోగుచేసి, దాపుననున్న నీరమున గలుపుచున్నాడే, పూర్వమట్లే యెప్పటి బూది నపుడు దాపుననున్న తుంగభద్రలో గలిపినచో నీ

ప్రో గెట్లుండియుండును?" అని. దీనికొక సమాధానమును జెప్ప వచ్చును. "రాజులు కర్మ తమరై చేయరు. తమ నౌకరులలో నొకరిచే జేయించు నాచారము వారికి నేటికిని గలదు. అట్టికర్త లు సంచయన మంత శుభ్రముగ జేసియుండరు. ఇంతకు ఆ రోజులలో సహగమనము జరుగుచుండెను. ఆయాచారమందు సంచయన మెట్లుండి యుండెడిదో" అని యొకమాదిరిగ జెప్ప వచ్చును. నిజమేమైన, నిది యస్థికలబూదియనుట కేమాత్రి ము సందేహములేదు. మీకిది వాలిదేయని నమ్మక ముండినచో దాని నొకింత తీసుకొని నుదుట ధరింపుడు, లేదేని వచ్చినదారి బోదము రండు.

తిరిగి పోవునపుడు మరల, నామామిడిచెట్లశోభను జూచి నపుడు, "నింభాపురమేమి? మామిడిచెట్లేమి నింభాపురమన్న నిమ్మలపురముకాదా? ఇందు పూర్వము నిమ్మవనము లుండ వలెనే, నేడొక నిమ్మచెట్టయిన గాన్పించదే" యని తోచ కపోదు. బదరికాశ్రమములో నేటికిని రేగు చెట్లున్నవని, హంపీలోని నింభాపురములో నిమ్మచెట్లుండవలెనా? అందెడ తెగకుండ యోగులు నివసించుచున్నారు. ఇందు విజయనగరరా జవంశమంతరించి రెండుశతాబ్దములు దాటినవి. ఆ చెట్లను బెంచు వారేరీ? అనుసమస్యను దర్కించుచు మరల నానెగొందికేగు ఘంటాపథమును గలుసుకొని కమలాపురమువైపున బోదము. ఈదారిని గొంతనడుచునప్పటి కొకదర్వాజా కానుపించును. ఇది యేదర్వాజా, దీనిపేరేమి యని ప్రశ్నింపకుడు. ఆప్రశ్న కుత్తర ము సెప్పుటకు మునుపటికోట తలతోక తెలియకుండ పాడుపడి

యున్న యీ కాలములో నసంభవము. అప్పటి దర్వాజాలు పాడుకాకుండ యున్నపు డెట్లుండెడివో దీనిని జూచిన జాలవరకు దెలియును. అయిన నిందు మామూలు పహారా మందిరపు హాజారపు స్వరూపము కానుపించదు. ఇది కొన్ని త్తరకపు దర్వాజా యనిపించును.

ఈ దర్వాజానుదాటి కొంతదూర మేగునప్పటికి, మన కెడమవైపున నొక పర్వతము, దానిపై నొక దేవాలయము అగుపడును. అదియే మాల్యవంతము. దానిపైనున్న దేవాలయము శ్రీ రఘునాథస్వామివారిది. కొంచె మోపికతో బరీక్షించినచో నీకొండ కీవైపుననుండి సోపానములున్నవి. వానిని బట్టి పైకెక్కినంతనే యాయాలయద్వార మొకటి యగుపించును. లోనికి ప్రవేశించినంతనే యాయాలయ వైశాల్యము మనకచ్చెరువు గొల్పును. అంతకన్న మన మిందు గమనించదగినవిశేషము లేమియులేవు. నలువైపులదిరిగి చూచినచో దురక లీయాలయములో బ్రవేశించిరా యని స్థూలదృష్టికి దోచునుగాని, సూక్ష్మపరీక్షచేసినచో నిందును నాస్వాముల శక్తి కనుబడకపోదు. అయినను హంపీలోని యాలయములకువలె నిందును బూజావిధులు జరుగుచున్నవి. ఆస్వామిని సేవించుకొని డిడ్డిదారిగుండ నాలయపువెనుకభాగమున కేగి చూతము. అందొక పెద్దశిలలో నొక తొట్టియున్నది. దానిలో నొక జలయున్నది. ఇక బహిర్ద్వారముగుండ నిర్గమింతము.

కొండను దిగి క్రిందికివచ్చునప్పటికి మన మొకరోడ్డును గలిసికొందుము. ఇది తూర్పుగ గాంపిల్యమున కేగెడు రోడ్డు.

ఇది మరొక కాంపిల్యము-దుౕపదుని రాజధాని కాదు - దాని కిూదుగ బశ్చిమ మొకింతయేగిన మునుపటి కమలాపురము పోవు ఘంటాపథము వచ్చును. దానిపై నెడమ్మవైపునకుదిరిగి నడచినచో మన మాయూరికేగుదుము. ఇటనుండి కొంత దూరమేగుసరికి మన కొక కోటగోడ కానుపించును. ఇచటనిది యేదియని పృచ్ఛసేయకుడు. దానికిని మునుపటిసమాధాన మునే చెప్పవలసి వచ్చును. కాని కొంచెము తేరిపారచూచి నచో నీ కోటగోడకు, రాచనగరపు టుత్తరపు గోడకు గొంత సంబంధబాంధవ్య మున్నదా యనిపించును. ఇందుండి యేగు కొలది అందందు శిథిలమైన చోటులదప్ప, మిగిలిన యంత మేర యా రాచనగరపు తూర్పుకోటగోడ మనవెంట నడచు చున్నది. ఇం దంతయు నొక పెద్ద బయలువలె గాన్పించును. దశరాత్రోత్సవవరూథినీ పరిదర్శన పౕదేశ మిదియే మోయని సంశయము తోచును. అం దం దాలయము లున్నవి. వాని లో గొన్ని జైనాలయములవలె గాన్పించును. ఇదిగో మనకు బశ్చిమముననున్న దేవళమును జూచిపోదము. ఇది స్పష్టముగ జైనాలయమే. దీని ధ్వజస్తంభమును జూడుడు? ఒక తాడి యెత్తుగల యేకాండపు రాతిస్తంభము. అంతశిల నెట్లెత్తి నిల బెట్టిరో? దీనికి తూర్పుగ నేగుచున్న కాలిదారిగుండ దవ్వుల గాన్పించు దర్వాజాను జూచివత్తము. మనదారి కిరుపౕక్కల బడియున్న రాతిముక్కలను జూడుడు. రాచనగరు వదలిన తరువాత మనకీ ముక్క లెందును నింత దట్టముగ గాన్పించ లేదు. అర్థమేమి? ఎందులకో "తురకల బిస్మిల్లా" యిం

దధికమైనది. ఇక నీ దర్వాజా కూడ విచిత్రముగ నున్నది. పైకప్పు ఆర్చియా! కాదు. రాళ్లవరుసపై రాళ్ళవరుస డగ్గరు నట్లు పెట్టి ఆర్చియాకారమును దెచ్చినారు. ఇరుగెలకుల మందుగుండు సామానులను దాచుటకీ గదులను జూడుడు. గదులగుండ గుడియెడమలకు నిర్గమించు దొంగదారు లున్నవి. ఇవి యన్నియు చూడ నిది యేదో పెద్ద దర్వాజాలలో నొకటి యనిపించుచున్నది. లోనికేగి చూతము. ఈ మొత్త నీ విగ్రహమేమి? ఎవరో భక్తు లెరగ్రింగు వేసినారే? ఇది యేమి విగ్రహము. భీమసేనునిదా! లేకున్న నింత గదాదండ మెవ్వరికి గలదు? చూడుడా విగ్రహమెంత జీవముతో నున్నదో! అయిన భీమునకు విగ్రహము పూజయేమి? ఈయనను యోధులు దేవతయని పూజించిరా యేమి? ఎవరు చెప్ప గలరు. ఇదిగో ఈగోడమీద దుశ్శాసనవధనాటకము జూడుడు.

ఇక నీదర్వాజాగుండ బయటికి బోవుదారిని చూడుడు! కొంత తూర్పునకుబోయి, యటనుండి యుత్తరమునకు దిరిగి, యందుండి తూర్పునకుమలగి విశాలమైన మైదానముపై వెల్వడుచున్నది. ఈమెలికలలో నెన్నిబురుజు లున్నవో చూడుడు. ఇందులోనికి శాత్రవులు వచ్చిరనుకొనుడు, బురుజులపై ఫిరంగు లూరకుండునా? ఈదర్వాజాలలో జొరబడినవారికి మృత్యుగహ్వరమునజొరబడినవారికిభేదమేమి? ఒకబురుజశక్తమైన నింకొకటి వేధించగలదు. మనవారికీయుక్తితోచినందులకు మన కాశ్చర్యమగుచున్నది. దీనికి నేడు భీమసేనుదర్వాజా యని నామకరణముచేసినారు. మునుపటిపే రదియైయుండదు.

ఇచటనుండి మూడుఫర్లాంగు లేగితిమేని కమలాపురమం దలిబంగళాయగుపించును. దానికితూర్పునగమలాపురమున్నది. ఆయూరుగ్రామమైనను పెద్దదిగనేయున్నది. అందు మనకుజూడ వలసినది చెరువొక్కటే. అది యతివిశాలముగనున్నది. ఆయూరి కీశాన్యముగ శ్రీపట్టాభిరామస్వామి ఆలయమున్నది. దీనిలో గూడ మనము గమనించవలసిన విషయమొక్క వైశాల్యమే. ఈ యాలయ మేయూరికొరకేర్పడినదో చెప్పజాలము. కమలాపురము ఆలయమునకు వెనుకనుండుటంబట్టి దాని నాయూరి కోసము కట్టియుండరు. కావున పట్టాభిరామాపురమో, మరియే పురమో, దానికెదురుగ నుండి యుండవలె. చుట్టుప్రక్కల నిండియున్న పొలముల సందడిలో నాయూరుసంగతి నేడు తేల్చుట దుర్లభము.

ఇటనుండి వెనుకకుదిరిగి, కమలాపురము బంగళా ముందుగ బశ్చిమమేగుచున్నరోడ్డున బోయినచో, మనకు రాచనగరునకు దూర్పుదర్వాజా కనబడును. నేడు దాని బురుజులయందమేతప్ప మరొకయందమగుపడదు. అందుండి పశ్చిమమేగినచో మనము మొన్నచూచివచ్చిన అష్టముఖ జలక్రీడామందిరమునుండివచ్చికలిసినదారి చిక్కును. నేరుగ నేగిన హంపీమార్గము.

## 12 వ ప్ర క ర ణ ము

# పంపాసరోవరము - ఆనెగొంది.

పంపాసరోవరమును జేరుటకు రెండుమార్గములు కలవు. నిన్నటిదారి నేగి కమలాపురమునుండి యానెగొందికి బోవు ఘంటాపథమును గలిసికొని, యానెగొందిరేవుకడ దుంగభద్రనుదాటి, యాయూరి కోటలోగుండ జని యచటికి జేరవచ్చును. కాదేని విరూపాక్షాలయమునొద్ద నదిని దాటి, యెదుర గాన్పించు కొండలసందుననున్న డొంకనుబోయి యచటికి జేరవచ్చును. ముందు సరోవరమును జూచి, పైనానెగొందిని జూడనెంచినవారికి రెండవమార్గమే యాధారము. పోయిన దారిని రానొల్లనివారికి చంక్రమణ మెట్లును దప్పదు. అదియుగాక, యేటియావల నేమున్నదో చూడవచ్చును. విజయనగరమును దురకలవాత బడవేసిన మైదానమును బరీక్షించుట కీచంక్రమణమార్గము తప్పదు. అందువలన రెండవ మార్గమునే యవలంబింతము.

తుంగభద్రను దాటుట సామాన్యముగ నన్నినదులను దాటుటవంటిది కాదు. అదియొక చిత్రమైన నది. అసలది నది కాదు. కృష్ణానది కుపనది. కృష్ణవేణీనీరములో రెండువంతు లీయుపనదియే సంతరించుచున్నది. అది ప్రవహించు ప్రాంతములలో దానిని గంగానదీతుల్యముగ నందలిప్రజ లెంచుచున్నారు.

తెనాలి రామకృష్ణుడు :

శా॥ గంగాసంగమ మిచ్చగించునె, మదిం గావేరి దేవేరిఁగా
నంగీకార మొసర్చునే,యమునతో నానందముం జెందునే,
రంగత్తుంగతరంగహస్తములతో, రత్నాకరేందు్రిందు, నీ
యంగం బంటి సుఖించునేని, గుణభద్రా! తుంగభద్రానదీ!

యని వ్రాసిన వ్రాతలో తుంగభద్రను నదియని సంబోధించినలోపమును, యమునానదిని గంగతో బ్రయాగ యొద్ద గలపక సముద్రములోనికి బారునట్లు చేసినలోపమును, నటుండనిండు. ప్రకటించినభావ మాప్రాంతముల బండిత పామరసమ్మతము. దానిలో గ్రుంకుట గంగాస్నానము వంటి దని, యది పుణ్యనదులలో నొకటి యని, యందస్థికల గల పవచ్చునని నేడందలివారు నమ్ముచున్నారు. దానిలో విపరీత మేమియు లేదు. యజ్ఞవరాహావతారము హిరణ్యాక్ష వధానంత రము మహేంద్రపర్వతముపై విశ్రాంతి జెందుచుండ, నామూ ర్తిచెమటలు రెండేరులై తుంగ, భద్ర, యనునామములతో బ్రవహించి, కొలదిదూరములో గలిసి, యొకటేయేరై నేడు ప్రవహించుచున్నదని యందలివా రనుకొనుచుండ: పంపానది యనుపేర మున్ను చెన్నొంది యా నామముతో నొప్పుచున్న సరోవరమున కొకప్పుడు నీరదానము చేసి కిష్కింధగుండ ప్రవహించుచు శ్రీరామలక్ష్మణస్పర్శచే బవి త్రమై యుండః నట్టి స్రవంతిని పుణ్యనదులలో నొక దానిగ బరిగణించుట కేలాటి యాక్షేపణము నుండను. ఈ చర్చలో మనము ప్రకృతమును మరచుచున్నాము. దీనిని

దాటుట దుర్లభము. దానికి రెండు కారణము లున్నవి. ఈ నది యతివేగగామిని. ఒక భూగోళశాస్త్రజ్ఞుడు చెప్పినట్లు దీని కడుగున కొక యంగుళము వాలున్నది. అట్టి వాలుగల నది యెంత వేగముగ బ్రవహించునో యోజించుకొనుడు. అందుల కది పర్వతమయమగు దక్కన్ పీఠభూమిలో ప్రవహించుటే కారణము. తొడలోతునీరములో దిగినంతనే యెట్టిబలవంతునినైన బడద్రోయు నురవడి కలదు. మండు వేసవిలో నీ రెండియున్నప్పుడు తొడలకన్న కొంచెము లోతు తగ్గినపుడు రేవున దాటగూడదా యనిన, యిందు మొసళ్లు మెండుగ నున్నవి. అవి సహజముగ నదిలో నుద్భవించినవో విజయనగరమువా రేటి కాపలాకిగ్రింద వాని నిందు తెచ్చివేసి పెంచిరో చెప్పజాలము. మొత్తమునకు, ఆ యేటిని దాటుట దుర్లభము. అథవా దాటగల్గిన రేవిం దెందైన దొరకినను దాటుటకు సాహసింపలేము. ఇక నేదో యుపాయము చూడవలె. నది లోతట్టు బండలతో నిండియుండుటంబట్టి, యిందు మనబల్లకట్లు, పడవలు నుపయోగింపవు. దీనిని దాటుట కచ్చటివారొకయుపాయమును బన్నిరి. వెదురుతోనో, పేముతోనోయల్లిన గుండ్రటి పెద్దచాకలిబానయాకారములు గల బుట్టల నూహించుకొనుడు. ఆబుట్టలపైన దిట్టమైనచర్మమును గుట్టుదురు. అట్లు కుట్టిన దానిని పుట్టి యందురు. మన "నీ పుట్టేమి మునిగినది" లోని పుట్టి యిదియే. పుట్టి మునిగిన వెంటనే "నదీనాం సాగరోగతిః" రెండవసామెత వ్యవహారములోనికి వచ్చును! ఆపుట్టినినదిలో వేసినంతనే యది తేలి

యూడును. దానిలో సరిపడ బరువును వేసుకొని దానిని తెడ్లతో నడిపింతురు. అది గిరగిర దిరుగుచు బోవును. ఒకవేళ యేబండకైన బొరబాటుచే దగిలినను, పైభాగము తోలు కనుక, లోపల తడకకూడ మెత్తనిబద్దలతో నల్లినది కనుక, యెట్టిప్రమాదము నుండదు. కాని, స్వల్పదూరముకూడ దాటుట కెక్కువవేళ పట్టును. ఇంతకన్న తుంగభద్రనుదాటు సాధనము మరొక టెందును లేదు.

మన మట్టిపుట్టాలలో నావలియొడ్డు చేరవలె. ఎదుర నున్న కొండలసందున కేగు కాలిదారి నేగినచో నొకింతదూరములో మన మొక డొంకను కలిసికొందుము. ఎంతసూక్ష్మముగ బరిశీలించినను, ఇందు పట్టణము మునుపున్న గుర్తులు నే డేమియు నగపడవు. ఇం దూరు లేనే లేదని మాయభిప్రాయము. దానికి కారణము కోటయావరణమం దతిబలహీనభాగమున కిది సమీపమున నుండుటయే యని మాకు తోచినది. ఇట్లు పోనుబోను మన కొక కాల్వ యడ్డమువచ్చును. ఇది కొండలలోయలలో నున్నది. ఆకొండలసందునబడి పోనుపోను, మన కొకచోట నాల్గడుగులయెత్తు రాయి, దానిమీద పంపాసరోవరము అని యతుకములు నగపడును. ఆరాయిచూపుదారిని దక్షిణముగ బోయినచో, స్తంభములపై నొకరాతికాల్వ, క్రింద నురొకకాల్వ మన కగుపడును. ఆ స్తంభములక్రిందుగ నెడమవైపునకు దిరిగినవెంటనే పంపాసరోవరము, దానియెదుట నొకమఠము, ఆమఠమునకు బశ్చిమమున శబరీగుహ కానిపించును.

పంపాసరోవరప్రదేశప్రకృతిశోభను వర్ణించుటకు మహాకవీశ్వరు లుండవలెగాని మాబోంట్ల కలవిగాదు. దానిని

చూడకపోయినను, శరదృతువునందు దానిని మనస్సులో జిత్రించుకొనునప్పటికే ఆంధ్రికవీశ్వరాగ్రిగణ్యులలో నొకడగు మంత్రిభాస్కరునివంటివాని కవితాశక్తి "యమునద్గంగ*" మనుచు నింకొక నటరాజతాండవ మాడినది. దాని నీటివర్ణము, నైర్మల్యము, శౌచ్యము, అందలి సరోజముల పెంపు సొంపు, వాని యాకులపసందు, ఆసరోవరమును గుప్తముచేసి పుడికిట బెట్టుకొనియున్న లోయలసౌందర్యము, ఆపర్వతములయౌన్నత్యము, వానియందలి నైసర్గికశోభ వర్ణింప మాతరము కాదు. అం దొకింత విశ్రమించి యోజించినంతనే "ఆహా! అందరు స్వర్గము స్వర్గ మందు, రిది దాని తునకయా?" యని మాకెన్ని సారులో దోచినది. అందరకు నట్లే తోచగల దని మాయభిప్రాయము. ఇప్పటికి దానివిషయ మొకింత చదువరులకు బొడగట్టి యుండకపోదు. ఈప్రదేశమందు పర్వతములు కుంచెకోలయాకారము బొంది, వటువ్రభాగములో నొకచక్కని బయలు నావరించి యున్నవి. పంపాసరోవర మాబయలులో నున్నది. దాని కుడివైపున మరొక బయలు నైర్రృతిగ నది నానబోవుచున్నది. ఈ సరోవరములోనికి తుంగభద్రనుండి యెందో మనకు నేడు కానుపించని తూమొకటి యున్నదని మామతము. లేకుండిన, కేవల మాబయలు నావరించియున్న మూడు కొండలనుండి పారివచ్చిననీర మాసరోవరముల నెల్లపుడు పుష్కలముగ నింపజాలదు.

శబరీగుహ సరోవరమున కుత్తరముగ దానికి కడు దగ్గరలో నున్నది. సరస్సు నానుకొని యా గుహకు బోవు

మెట్లున్నవి. ఆ గుహ లోతుగ గ్రింది కెచటికో పోవు చున్నది. బహుశః ఆ పర్వతపు టుత్తరపుదిక్కున నిర్గమించు నని మేము లోని కేగి చూచినంతవరకు దలంచితిమి. ఆ గుహలో మా కొక్కటే విశేషము కాన్పించినది. మండు వేసవిలో నా గుహాముఖమున నాసీనులమైనంత, నెం దుండి వచ్చునో యొడలెల్ల ఝుల్లుమనిపించు చల్లగాలి వీచును. కొంతసే పందుండిన దుప్పటి కప్పించునా యనఃపించు! దీని కేమిగాని యా గుహయొద్ద గూర్చుండినంతనే యెవరికైన యొడలు పులకరించకపోదు. ఎందులకో తెలియునా? వెంటనే "శ్రీరాము డిం దాసీనుడై యుండనోపు. శబరి పండ్ల నిచ్చిన చోటిదియే గద! పాప మా రాజకుమారు డెంత యాకొని యుండి యా ఫలముల నారగించెనో?" యను నూహాలు తట్టక పోవు. శబరీరామలక్ష్మణుల విగ్రహములను మనస్సులలో జిత్రించుకొనకపోము. అటనుండి నల్గడల బరికించి చూచున ప్పటి కెంతసేపటికి యా చోటు వదలిపో బుద్ధిపుట్టదు.

ఆ గుహ నానుకొనియున్న మఠము బైరాగులమఠము. వారి కిచట నెవడో దాత యొసంగిన మాన్య మున్నది. అందు మకాము చేయనెంచిన వారికి వారు వలయుసామగ్రి నిత్తురు. ప్రయాణత్వరలో మా కొకప్పుడును వారి యాతిథ్య మారగించు నదృష్టము లభించలేదు.

ఇటనుండి బయలుదేరి, వచ్చినదారినే కొంతదూరము పోయి, కుడితట్టు కొండల నానుకొని యుత్తర మేగుచున్న మార్గమున బోదము. మన కెడమవైపున పంటభూములు కుడి

వైపున పర్వతములు! ఎచటనో యొకటి రెండు స్థలములలో దప్ప మిగిలిన దారి యంతయు, నా నెగొంది ఉత్తరపుదర్వాజా చేరువరకు, నిశ్లే యుండును. నేటికి పదునాల్గు సంవత్సరములనా డిందు ఆకుతోట లుండెడివి. ఆకులన్న జ్ఞప్తికి వచ్చు చున్నది. అవి మన తమలపాకులు కావు- ''కమ్మేరాకులు''- కడు కారము, విశేషముగ భుజించలేము. వక్క కొక్క యాకు పంపిణీని కాలక్షేపము సేయవలె. నే డెందులకో ఆ తోటలకుబదులు పంటచేలు వెలసినవి.

అట్లు కొంతదూర మేగునప్పటికి, మన కడ్డముగ నొక కోటగోడ, పడిపోయిన పహారామందిరము, దర్వాజా తార సిల్లును. దాని కనతిదూరములో నింకొకటి, అన్నివిధముల మొదలిటిదానికి జవాబుగ దారసిలును. ఇటనుండి దక్షిణము నకు దిరిగి యొకింత పరిశీలింతము. మన కుడివైపున గొంచె ము దూరముగ నున్న కొండలవరకు నొకటే మైదానము. ఇది మనకు నైరృతిగబోయి రాతివంతెనయొద్ద తుంగభద్రి నాను చున్నది. ఇదియే యాబయలు! విజయనగరాంతమునకు దారిచూపిన బయలు! ఇచట నొకింత నిదానించి పరీక్షిం పుడు. మనము వచ్చినదారి యెన్నిమెలికలు తిరుగుచున్నదో! ఉత్తరమున దూరమునుండి యీబయ లగపడదు. పశ్చిమ మునను న్న పర్వతములను మనదారి నానుకొనియున్న పర్వ తములను కలుపున ట్లీబయలి కడ్డముగ నాలుగైదు చోటుల గోడలు గట్టి బలపరచిరి. ఎవరైన శత్రువులు త్రోసికొని వచ్చి రనుకొందము. అప్పు డీయడ్డుగోడలేగాక యిటునటు

అనగా తూర్పు పడమరల, గట్టని బురుజులై విలసిల్లుచున్న కొండలపై, నందందు ఫిరంగుల నుంచిన నేశత్రువు సాహసించి మధ్య బయలులో రాగలడు? దీనికి కావలసినవి రెండు. కావలసిన మందుగుండుసామాను, ఫిరంగులు నుండవలెను. అడ్డుగోడలను పర్వతములను గాచుటకు బహుళసంఖ్యాకమగు సైన్య ముండవలెను. ఇవి రెండును దక్కువ యగుటంజేసి, 1565 వ సంవత్సరమున తళ్ళికోటయుద్ధము జరిగిన వెంటనే, మహాపట్టణమున కాగతి పట్టినది. ఐదారుచోట్ల నడ్డగోడ లున్నవికదా, కుడియెడమల పర్వతము లున్నవి కదా, వీనిని తగిన సైన్యసంఖ్యతో బలపరచిన నీ పర్వతములమధ్య నున్న బయలుపై నేశాత్రవులు ధైర్యముతో రాగలరని విజయనగరచక్రవర్తు లనుకొనియుందురు:

"దైవాధీనము సర్వముల్ మనమతిం దప్పించగా వచ్చునే" యనినట్లు, యుద్ధములో సైన్యము సన్నగిల్లె - వీనిని కాపాడ దగినంత రాణువ లేదయ్యె - తురక లీమైదానముపై షికారు నకు బోయినట్లు పోయిరి. పట్టణము నాక్రమించుకొనిరి! దీనిని చూచుకొలది మన సోకమాదిరి మైపోవును!

ఈచోటుదాటి కొంతదూర మరుగునప్పటికి, మనకుడి వైపున నొకతుంగభద్రకాల్వ కానుపించును. ఇది కొండ నాను కొని ప్రవహించుచున్నది. కొన్నిపర్యాయములు కొండప్రక్క నున్న రాతిచట్టును తొట్టివలె దొలిపించిరి. ఆతొట్టిలో బ్రవ హించుచున్నది. పోసబోను మన కడ్డగోడ లందం దగుపడు ను. మనమొక కోటగోడపై జనుచున్నాము. ఈగోడ యెంత

వెడల్పుగ నున్నదో చూడుడు! రెండుబండ్లు అతివిశాలముగ నొక దానిప్రక్క నొకటి నడువవచ్చును. అంచుల జనులు చన వచ్చును. పోవుకొలది, మనదాగి కుడివైపునకే తిరుగుచున్నది. ఇట్లు చని చని చివరకు, దూర్పునకు దిరిగి ఆనెగొంది ఉత్తరపుదర్వాజాలోనికి జనుచున్నది. ఇట కోటగోడయు, దర్వాజాయు నెంతయెత్తుగ నున్నవో - ఎంతబలముగ నున్నవో!

ఆనెగొందికోటగోడ తూర్పున నదిని, పడమర మన మిప్పుడు వదలివచ్చిన పర్వతములను నానియున్నది. ఊరిలోని కేగుకొలది యాగోడ పడమరవైపున కొండలపై నందందు పామువలె ప్రాకులాడునట్లు కాన్పించును. ఊరిప్పుడంత పెద్దది కాదు. విజయనగరము సజీవముగ నున్నప్పుడిం దూరుండెడిది కాదు. ఇది యానెగొంది - ఆనె అనగా కన్నడములో నేనుగ - ఆనెగొందియనగా నేనుగులగొంది- ఏనుగు లుండుస్థలము. విజయనగరమువారికి కొన్నివేలయేనుగు లుండెడివి. ఈయానెగొంది ఆయేనుగుల యాలానముల కేర్పరచినప్రదేశము కావున నిందా మావటీలపల్లె యుండిన నుండవచ్చును. సామ్రాజ్యము శిథిలమై, మగలరాయలవంశమువారిం దేర్పడినతరువాత, వారొకపట్టణమునుగట్టి, యిందు నివసించుచున్నారు. నిజమున కానెగొంది కోటయావరణము జూచుకొలది యిందొకమహా పట్టణము కట్టవచ్చు ననుపించగలవైశాల్య మున్నట్లు తోచక పోదు. అది కొన్నివేలయేనుగు లుండుట కేర్పరచినది కాబట్టి యంతవిశాలముగ నున్నది.

అయితే జంబుకేశ్వరరాయలు, ఆనెగొందికోట, మహమ్మదు తుఘులకు అని యేదో చెప్పితిరే, అది యెందున్నదియని మాచదువరులకుదోచవచ్చును. అది యిప్పటికి నున్నది. దానిని "పాగిగోట" యందురు. మనకు గుడివైపుననున్న పర్వతపంక్తిమధ్య నున్నది. దానికి మెట్లున్నవి. అవి యెక్కి పై కేగినంతనే యొకవింతదృశ్యము కనుల బడును. నాలుగైదు పర్వత శిఖరములమధ్య నొకబయ లున్నది. దానిలో నందందు గొన్ని కట్టడముల గుర్తులు కాన్పించును. అందొక పెద్ద దిగుడుబావి కలదు. ఆపర్వతములలో ననేకగుహ లున్నవి. అందీగుహను జూచివత్తము రండు. దీనిలో నెచ్చోటనో పూర్వరాజు లెవరో తమధనమును దాచి రందురు. హరిహరుఁడు, బుక్కఁడు, నా రాజకుమారులు నీగుహలోనే దాగిరేమో? ఇక నొక్కచిత్రిము ఈగుహ యుత్తరమున నెట్లునిర్గమించుచున్నదో చూడుడు, ఇదిగో! మనము వచ్చిన పంపాసరోవరపుదారివైపున నిర్గమించుచున్నది. ఇందుండి యీమైదానములో నేగు శాత్రివుల గోరాడవచ్చును. ఈ కోట నంతయు మేము సావధానముగ బరీక్షించితిమి. వలయు సామగ్రిలో నమరియున్న నాకాలములో నెట్టిశాత్రివులనైన, గొన్నిమాసములు చేరరానీయకుండ బోరాడగలిగినంత బలముకల కోటయని మాకు తోచినది.

ఆకోట దిగివచ్చి మనము దక్షిణ దర్వాజాను సమీపించుకొలది, కుడియెడమవైపుల బెద్దమైదానము కానుపించును. బహుశః యేనుగుల గట్టివేసిన స్థలములో గొంతప్రదేశ

మిదియా యనుపించును. దక్షిణపుదర్వాజా యుత్తరపుదర్వా జాను బోలియున్నది. ఇదికూడ నొక కోటగోడలో నున్నది. ఈ గోడ తూర్పున నేటిని, పడమర తలారిగట్టును ఆనుకొని యున్నది. తుంగభద్రను మునుపటి విధముగనే దాటి కొంత దూరము కమలాపురఘంటాపథమున నేగి, కుడివైపునకు దిరిగి, నితలాపురముగుండ బోదము.

## 13 వ ప్రకరణము.

## విజయనగర మహాదుర్గ ప్రశంస.

ఇట్లు తిరుగవలసిన ప్రదేశములో దిరిగి, చూడవలసిన వానిని చూచి, బసకు వచ్చి, వానినిగురించి యొకింత యోజన చేసినంతనే యాత్రికులకు కొన్నిసందేహములు కలుగకపోవు.

1. మొదల - "నాపట్టణవైశాల్య మింతియేనా? ఇంత కన్న బెద్దదిగా నుండెడిదా? హాస్పేటనుండి వచ్చునపుడు దారిలో దర్వాజాలు, దేవాలయములు, కానుపించెనే, యవి కూడ బూర్వపట్టణమునకు సంబంధించినవా ? లేక మఱొక యూరికి సంబంధించినవా!" అని యొకసందేహము తోచును. అవికూడ పూర్వవిజయనగరములోనివే. హాస్పేటవరకు నిండ్లుండినవని, విపణివీథు లుండినవని, యాదర్వాజాలవలన నేడు మన మూహించుటేగాక, పూర్వ మాపట్టణమును సందర్శించి పోయిన పాశ్చాత్యప్రయాణికులవ్రాతలవలన స్ఫురించు చున్నది. కాని, కలిగినసందేహ మింతమాత్రముతో నివృత్తి

కాదు. విజయనగరనైసర్గికమాహాత్మ్యమును వర్ణించునపు డిచ్చటదక్కను పీటభూమికి సంబంధించిన పర్వతములు, చేతులు చేతులు కలుపుకొని, పట్లు పట్టినట్లు కాన్పించుచున్నవని, షుమారు ముప్పదినలుబదిమైళ్ళు మధ్యరేఖగల పర్వత వలయ మొకటి యున్నదని చెప్పియుంటిమి. సూక్ష్మపరీక్ష వలన, నొకప్పుడెన్నడైన నాపట్టణమునకు సంబంధించిన పల్లెలు, వాటికలు, నంతవరకు వ్యాపించియుండెనేమో యను సందేహము కలుగుచున్నది. అనగా యావలయ మంతే యు విజయనగరము, దానికి సంబంధించిన పల్లెలతో, నిండి యుండెనేమో యని సందేహము. దానికి మూడుకార ణము లున్నవి. ఆపాశ్చాత్యప్రయాణికులు విజయనగరము మహాపట్టణములలో నొకటి యని, అంత పెద్దపట్టణమును దా మెందును జూచియుండమని, దానికి పదివండ్రిండావరణ ము లున్నవని, ఒక్కొక యావరణములో నొక్కొకవిధముగ నున్నదని, ఊరివెలుపల కేగుకొలది కొన్ని యావరణములు తోటలకు, భూములకు నేర్పడినవని, ఏదియైన నెద్దడి వచ్చిన యెడల నాభూములపంట యాయూరిలోనిప్రజలకు భుక్తికి సరిపోవునట్లు తమకు దోచినదని, వ్రాసియున్నారు. వారు మహమ్మదీయప్రయాణికులే గారు. వారిలో గొందరు తెల్ల వారున్నారు. ఆతెల్లవారు తమదేశములందలి మహాపట్టణముల నెఱిగి వ్రాసినవారు. కాబట్టి విజయనగరము వారిదేశము లందలి పట్టణములకన్న విశాలమైనదని, వారికి తోచియుండ నోపు. అంత పట్టణమున నివసించుచుండిన షుమారు ముప్పది

లక్షల ప్రజలకు ముట్టడులలో సరిపోగల పంటలను బండించ గల భూము లుండదగిన ప్రదేశములు మన మీ మూడునాళ్లు దినములనుండి చూచుచుండిన ప్రదేశములోనెందును గాన్పించ లేదు. అవి యుండుటకే వీలు లేకుండ గట్టడము లున్నవి. కావున నూరివెలుపలనున్న మైదానముల నావరణమిలతో గలుపుకొని యుందు రని, యూహించ దగియున్నది. దానికి తగిన వైశాల్యముగల బయ ళ్ళెన్నియే నందగపడుచున్నవి.

అంతేగాక, హాస్పేట రైలుస్టేషను విడిచి బళ్ళారి కేగుమార్గములో హరపనహల్లి, పాపనాకనహల్లి, దరోజీ, తోరణగల్లు, అని నాల్గు రైలుస్టేషను లున్నవి. హల్లియనగా పల్లి; హరపన=హరప్ప ; పాపనాకన=పాపనాయక; దరోజీ= దర్వాజా ; తోరణగల్లు = తోరణములు గట్టినరాళ్ళు అని వాని కర్థములు అనాయాసముగ స్ఫురించుచున్నవి. హాస్పేట నారోజులలో నాగలాపుర మనుచుండిరి. అనగా కృష్ణరాయలతల్లియగు నాగలాంబపేర గట్టించినపురము. నాగ లాపురము దాటగనే హరప్పపల్లి, దానిపైన పాపనాయకుని పల్లియని రెండుగ్రామము లుండియుండవచ్చును. వాని కొ్క ప్పుడు హరప్ప, పాపనాయకుడని యిర్వు రధిపతు లుండి యుందురు. ఇంక నట్టివెన్ని యుండెడివో, అవి ఆవలయములో నెట నుండెడివో, కనుగొని చదువరుల కెరిగించుటకు దగిన సావకాశము మా కా పనమూడు యాత్రిలలో లభించలేదు. వానిని దాటగనే దర్వాజా, అనగా, పట్టణమున కంతయు దూ ర్పుదిక్కున దర్వాజా యుండియుండవచ్చును. దానికావలావా

రం దొక్కపల్లెను గట్టుకొని యుండవచ్చును. అదియే నేటి కిని నిలిచియుండవచ్చును. ఆవలయమునకు సంబంధించిన రెండుపర్వతములవరుసలు, దర్వాజాకు గొంతదూరమున గలి యవచ్చి యాగిపోయినవి. అదియే తోరణగల్లు, బహుశః దిగ్వి జయము చేసికాని, ఎందైన నేగిగాని, సార్వభౌములు తూర్పు ననుండి యూరిని సమీపించినపు, డందు తోరణముల గట్టి వారిని గౌరవించు నాచార మొకటి యుండియుండవచ్చును.

మూడవది- అట్టిమహాకార్యమునకై యంతపట్టణమును స్థాపించినప్రతిభావంతులు, ఆపట్టణమును బలపరచువిధానము లెందున్న వాని నెల్ల బాటించి యుపయోగించుకొనియుందురు కాని, ఒక్క సదుపాయమునుగూడ నేమరియుండరు. ఇరు వదియవశతాబ్దములో, యుద్ధప్రసక్తి యేమాత్రము లేని మనబోటి వాక్శూరుల కగుపించు సదుపాయము లావిషయ ములలో మహాపండితులైనవారి కగుపించకుండవు. అత్యున్నత పర్వతములతో బ్రకృతి యేర్పరచియుంచిన బహిర్వలయమున, అందందున్న సందుగొందుల దగినగోడలతో గప్పి, యావల యమును గట్టనికోటగోడవలె నేర్పర్చుకొనియుందు రని నిశ్చ యింపవచ్చును. దాని కొక్క పూర్వపక్షము స్ఫురించుచున్నది. "సరే! యావలయమునుగూడ బలపరచిరి. తమపట్టణమును భూములతో పల్లెలతో వాటికలతో దాని నానుకొనువరకు బెంచిరి. ముప్పది నలుబది మైళ్లు మధ్యరేఖగల దుర్గము సా మాన్యమైనది కాదే! ఇంతదుర్గమును సంరక్షించుకొను నుపా యమేది, దానికి తగినసైన్యమెందుండి తెచ్చిరి" యని. దానికి

సమాధాన మున్నది. అంతవలయమును జుట్టవేయుటకు గొన్ని కోట్ల సైన్యము కావలెను. అంతసైన్య మాకాలములో విజయనగరముపట్ల విరోధించిన భామినీసామ్రాజ్యమువంటి సామ్రాజ్యము లైదారు కలిసినగాని సమకూరదు. కావున నెన్నడైన గొన్నిలక్షలసేనయే - షుమా రైదారు లక్షల సేనయే (అదియే విజయనగరముపై నెన్నడైన నెత్తివచ్చిన సైన్య సంఖ్యలో నెల్ల పెద్దసంఖ్య) - ముట్టడింపవచ్చును. దుర్గసంరక్షణ సైన్య మెప్పుడును శాత్రివసైన్యమునకన్న స్వల్పసంఖ్యాకమై యుండును. దుర్గవలయము చాలవర కభేద్యమై శత్రువులు చేరరాకుండుటయే దానికి కారణము. అట్టి భాగముల నొక రిద్ద్వరు పహరావారు తప్ప నెక్కువమంది యుండవలసిన యవసర ముండదు. ఇక బలహీనభాగముల కాపలాకు, దర్వాజాయొద్ద, పెద్దసంఖ్యగలసైన్య ముండవలెను. మన మెంత తూలుగ లెక్కవేసినను, బాహ్యవలయమును గూడ గలుపుకొన్న విజయనగర మహాదుర్గసంరక్షణమునకు, రెండు మూడులక్షలసైన్యము తప్పక చాలియుండును. విజయనగర సామ్రాజ్యము ఉచ్చదశలోనున్న శ్రీకృష్ణరాయల కాలములో, శ్రీరామరాయలకాలములో, వారికి పదిపండ్రెండు లక్షల సైన్య ముండెను. శ్రీకృష్ణదేవరాయలు రాయచూరు యుద్ధమునకు ౮౩ లక్షల సైన్యముతో నేగెనని పయస్ వ్రాసియున్నాడు. రామరాయలు తల్లికోటయుద్ధమునకు బదిలక్షలసేనతో నేగె నని ఫెరిష్టా వ్రాసియున్నాడు. అట్టిచో నే దశయందైన నాలుగైదులక్షల సైన్యము, నా

సార్వభౌము, లవలీలగ గూర్చగలిగియుందురు. అసలు నరపతులు కదా! వారికి సైన్యమున కేమికొరత యుండును. అట్టిచో సైన్యసమస్య మన సిద్ధాంతము నెంతమాత్రమును బూర్వపక్షము సేయజాలదు.

2. 'సరే! విజయనగరపట్టణ మా వెలుపలి వలయము వరకు వ్యాపించియుండె ననుకొందము. టెలిఫోనులు, టెలిగ్రాములు, మోటారుకార్లు, సైకిళ్లు లేనికాలములోనంతమహాదుర్గ సంరక్షణ మెట్లు జరిగెను? మారుమూలలవార్త పట్టణమున కెట్లు చేరెను? శత్రువులు ముట్టడించి యేదియైన గవినిని బడద్రొక్కుకొని వచ్చునపు డట్లు పడగొట్టుకొని వచ్చుచున్నారను వర్తమానమునకు ముందే, శాత్రవులు అసలు పట్టణములో ప్రవేశించి యుందురే, దానికేమి సదుపాయము' అని యింకొకసందేహము తోచును. మాకీసందేహము బహుకాలమునుండి యుండెను. దీనిని నివృత్తి చేసికొనుట కనేకపర్యాయము లా శిథిలనిర్మాణములలో నందందు సంచరించి, విచారించియుంటిమి. అందున్న కొందరతో నీ శంకనుగురించి చర్చించియుంటిమి. దాని కనువగు సమాధానము నెరుగుటకై మేమట్లు కావించిన ప్రయత్నము లన్నియు విఫలము లైనవి. చిట్టచివర కది "యేదో గొడవ-దానిలోతు మన మెన్నటికి కనుగొనలేము" అని నిశ్చయించుకొంటిమి. అట్టి నిశ్చయముతో నెనిమిదవయాత్ర కేగితిమి. అప్పు డొక సాయంసమయమున బర్యటనము నాపి యెందైన బోయి యూరక కూర్చుండి వత్తమనుకొని బయలుదేరి,

సీతాసరోవరప్రాంతముల నున్న చెట్టు కెదురనున్న బండపై నాసీనులమై యప్పుడే కొంచెె మెఱపడుచున్న పడమర దిక్కును జూచుచు, నాకసమున:..

"శ్రేణుల్ గట్టి నభోంతరాళమున బాఱెం బక్షులు" అనుపద్యపాదమును స్మరణకుదెచ్చువిహంగగమనంబును జూచి యానందించుచు, నంబుసుపోకకై మాదృష్టులదూరమున నగుపించు రాతివంతెనవైపు నిగుడ్చి, దానికి మాకు బరిసరముల నిప్పటికిని బహారానిచ్చువారివలె నిర్జీవములై నిలబడియున్న పహారామందిరముల జూచి, లోలోపల నాసందేహము నే మనన ము జేసికొనుచు 'ఆహా! తళ్ళికోట యుద్ధానంతర మావంతెన యొద్ద కేతెంచిన మహమ్మదీయసేనానులవర్తమానముకన్న, నాసేనానులే యీయూర బ్రవేశించి యుందురుకదా" యను కొంటిమి. వెంటనే మా కొకయూహ స్ఫురించినది. ఆమందిర ముల యునికినిబట్టి యొక మందిరమందలి కేక యింకొకదాని లోనున్నవారికి, వారికేక మఱొకదానిలోనివారికి, నీరీతిగ మన కు వెనుక నెత్తుగనున్న కొండమీద చిన్నగూడువలె గాన్పించు పహారామందిరములోనివారికి నందగూడదా? దానినిబట్టి తగిన రక్షణము జరిగియుండదా అని తోచినది. మరునా డొక నల్వు రనుచరుల నాయామందిరములపై నెక్కించి, కేక వేయిం చితిమి. ఒకరికేక యొకరి కవలీలగ నందినది. కంఠస్వరమును దగ్గించి యరపించితిమి. అప్పటికి నందినది. ఇంకను దగ్గించి పల్కించితిమి. అందినది. మఱికొంచెము తగ్గించితిమి.అప్పటికి నందినది. సామాన్యపు చెవిటివానితో భాషించు కంఠస్వర

మం దందు వినుట కేలాటియాక్షేపణము నుండదని తేల్చుకొం టిమి. అంతంతదూరముల కంతచిన్న యెలు గెట్లు చేరెనాయని విచారించగా, ప్రదేశనైసర్గికమహత్వమే దానికి కారణమని తోచినది. ఒకమాత్రపుటెలుగును ప్రతిధ్వనించుపర్వతప్రదేశ మున నాస్వరము వినుట కేమియభ్యంతర ముండును? కావున నిట్టి కేకలతో నట్టి సమాచారముల దెలుపుకొనియుండరా యను నూహ తోచినది.

ఆయూహను మనస్సులో బెట్టుకొని, నాటనుండి యాయా త్రకేగినపు డెల్ల దాని కనుకూలించుప్రదేశములలో నట్టిమంది రము లున్నవో లేవో కనుగొందమని యెంచితిమి. అట్లు కావించినపరీక్ష వ్యర్థము కాలేదు. పట్టణప్రదేశములో నెల్లెడల మాయూహను సఫలము సేయుచోట్ల నట్టి మంది రము లనేకములు కాన్పించినవి. కొన్నిచోట్ల నటువంటివి లేకుండిన, నవి శిథిలములై యుండవచ్చు ననుకొంటిమి. అట్టిపహారామందిరముల ననువైన చోటుల నిర్మించినచో, బహి ర్వలయమునుండి వర్తమానము పట్టణమునకు జేరియుండదా యని యెంచితిమి. మాకట్టివిషయములలోనున్న పరిజ్ఞానముతో నంచన వేసి చూడగా షుమారు అరగంట, ముప్పావుగంట లోపల, దర్వాజాయొద్ద జరుగు విపత్సమాచారము, పట్టణ మును జేరగలదు, అని నిర్ణయించితిమి అప్పటి వాహనవేగ ముతో నంతకన్న దక్కువకాలములో దర్వాజానుండి పురము నకు మనుష్యుడు రాలేడు. శాత్రవులు వచ్చునప్పుడేగద యీగొడవ నాలోచింపవలయును. మధ్య నందందు వారి

నెదుర్చు సేనల యాటంకములను వదల్చుకొనికదా వారు పట్టణములో బ్రవేశించగలరు ? ఈమధ్య నెంతకైన నవ కాశ ముండును అని దృఢపరచుకొంటిమి.

ఈ విషయమునుగురించి గమనించదగిన యంశ మిం కొకటి యున్నది. "పహరావారు కేకలువేయుచు నుండిరా ? ఈ యూహ యంతసరసముగ లేదు." అని కొందరు చదువరు లకు దోచవచ్చును. ఇది పాశ్చాత్యవిద్యవలన సంభవించిన జాడ్యము. మన కిప్పుడు కేక లనిన దలనొప్పి. ఎందైన నంతయు నిశ్శబ్దముగ నుండవలె. యజమాని వచ్చినంతనే యనుచరు లం దరు నిర్జీవులుకావలె. పెద్దవారిని జూచిన జిన్నవా రందరు నక్లో యుండవలె. మనసంప్రదాయములు, పూర్వాచారములు, బ స్సులు, కాఫీక్లబ్బులు ఎంతబలిసినను, నేటికిని మనగ్రామముల లో నడుచుచున్నవి. అందేగి యొకింత పరిశీలించినచో నట్టి కేకలతో నెంతపని జరుగుచున్నదో మనకు దెలియకపోదు. వ్యవసాయకులు, నదీతీరముల బల్లెవాండ్రు, నట్టికేకలతో నెంతెంతలేసి కార్యముల జక్కపెట్టుకొనుచున్నారో మనము కనుగొనలేకపోము. మాయూహ నాక్షేపించుట కనుకొందురే గాని, యింత యింగ్లీషుచదువు చదువుకొని వసతిగృహము లలో, బాఠశాలలలో, సభలలో , బెద్దపెద్ద కేకలు కాక పోయినను బిగ్గరగ నరచుచు, నీమహానుభావులే యెట్లుందురో యొకింత విచారించిన వారికి తెలియకపోదు. కావున నట్టికేక లతో విజయనగరమహాదుర్గరక్షణము, పదునాల్గు మొద లుకొని పదియారవశతాబ్దము వరకు, నాప్రభుత్వమువారు

జరుపుకొని రని చెప్పుట మా కెంతమాత్రము విరసమనికాని, విపరీతమని కాని యనుపించదు.

కాక, అంతకన్న సరసమైనమార్గము కావలసియున్న నది లభింపకపోదు. మనపూర్వులు యుద్ధములు సేయుపద్ధతు లెరుగని మూఢులుగారు. వారికిప్పటి "హెలియో గ్రాఫ్" "ఎస్. ఒ. ఎస్"లు తెలిసియుండకపోవచ్చును. వారి కేదియో యొకవిధమైన సమరసంజ్ఞావిధాన ముండియుండక పోదు. కేవలావయవసంజ్ఞలతో నేలాటిభావములనైన ద్యోతనము గావింపగల భరతశాస్త్రమువంటి శాస్త్రమును గనిపెట్టి యెంతో హృదయంగమం బగునట్లు దానిని వృద్ధిసేయనేర్చిన సూక్ష్మబుద్ధులకు, అత్యవసరమగు సమరసంజ్ఞావిధానముల గనిపెట్టి, వాని నలవాటు చేసికొనుట యొక ఘనకార్యము కాదు. అటువంటి సంజ్ఞాపరికర మేదియో కొంత వారికి యుండియుండవచ్చును. అట్టి సంజ్ఞలచే వర్తమాన మంపు శక్తియ ప్లమరియున్నయెడ, దర్వాజాకడవార్త నొక యరగంటలో బట్టణములో జేర్చియుందురు. అట్టి దేదియో ఏ కేకలో లేక యే సంజ్ఞలో, లేకున్న నా మహాదుర్గము నెట్లు కాపాడుకొనగలిగిరి ? వారికి వేనవేలు వేగరులు, గూఢచారులు కలరని మన మెరుగుదుము. కాని వారు పత్రికృతమున కుపకరింపరు.

౩. "విజయనగరమహాదుర్గమం దెన్ని యావరణము లుండెనో ? ఏయావరణమున నేమి యుండెనో ? దానికి తల యేదికొ్క తోక యేదికొ్క ?" అని మన కింకొక సందేహము

తో పకపోదు. దానికి నేడు ప్రత్యుత్తర మిచ్చుట బ్రహ్మ తరము కాదు. అట్లన నేల ? పాశ్చాత్యప్రయాణికు లావిష యమై వ్రాసియుండలేదా యని తోచవచ్చును. వా రిద్దరు ముగ్గురు వర్ణించిన వర్ణనల ననేకపర్యాయము లత్యంత విమర్శనాదృష్టితో బరిశీలించితిమి. వాని నొకదానితో నొకటి పోల్చిచూచితిమి. వానిలో నొకదాని కొకటి లగింపక కొంత, నొక్కవర్ణనలోనే అనేక పరస్పరవిరోధము లుండుట కొంత, సత్యనిర్ణయమున కభ్యంతరములు కల్పించినవి. ఉన్న వానిని బరీక్షించి తేల్చుకొందమని కొంతకృషి గావించితిమి. మహమ్మదీయ దౌర్జన్యము, కాలగత శైథిల్యము, అవి రెం డునుగాక, పట్టణవినాశనానంతర మాయాప్రదేశములలో నివ సించినవారు. తమయిండ్లు కట్టుకొనుటకు ప్రభుత్వమువారు పొలములక్రింద నిచ్చిన స్థలములను జదరము సేయుటకు గావించిన నూతనవినాశనము - ఈమూడును గలిసి మా కృషిని వ్యర్థముచేసినవి. ప్రస్తుతస్థితిలో నేవి యెందున్నవి యెం దేమియున్నది తేల్చుట అసాధ్యము. అందువలననే యా మహాదుర్గమందు పది పండ్రెం డావరణము లుండె నని స్థూలముగ వక్కాణించి యుంటిమి. అవి బహుశః ప్రదేశ పరీక్షవలన నిర్మాణకుల కెట్లు వీలని తోచిన నట్లేర్పడి యుండవలయును. ముఖ్యముగ సంరక్షణోపాయము ననుస రించియుండును.

4. "ఆ దుర్గరక్షణవిషయములో వార్తాహారణ మట్లు జరిగిన జరిగియుండవచ్చును. ఇతరసాధనము లెవ్వియో!"

అని మరొకసందేహము తోచకపోదు. విజయనగరసామ్రాజ్య సైన్యము రెండు విధములుగ నుండెను. మూలసైన్యము, సామ్రాజ్యసైన్యము. మూలసైన్యము సార్వభౌములు తాము స్వయముగ నేర్పరచుకొని పాలించినది. సామ్రాజ్యసైన్యము సామంతరాజులక్రింద నుండి,యవసరమైనపు డెల్ల చక్రవర్తుల యనుజ్ఞమీద పురరక్షణమునకుగాని, దండయాత్రలకుగాని బయలుదేరి వచ్చునది. రెంటిలో మూలసైన్యమే యెక్కువ బలవంతముగ నుండె నని కొందరివ్రాతలవలన మనకు దెలియుచున్నది. అట్టిసైన్యము రెండున్నరలక్ష యుండెడిది. దానిలో గొంతభాగము, షుమారొకలక్ష, యెప్పుడును దుర్గమందేయుండును. దుర్గసంరక్షణము సామ్రాజ్యసంరక్షణమునకు సంబంధించినదైనను, సర్వసేనాధిపతిపాలనకు దుర్గాధిపతి లోబడియుండినను, జాలవరకాతడు రాయల యాజ్ఞలకే బద్ధుడై యుండిన ట్లగుపడుచున్నది. విజయనగరసంస్థాపనమునాటనుండి యేవియో యంత్రములు - పెద్ద పెద్దగుండ్లను రాళ్లను రువ్వగలయంత్రములు - కొన్ని బురుజులమీద, కొన్నికొన్నిచోట్ల బురుజులవలె వాడుచున్న గుహాలలో, నుండెడివి. పదియైదు పదియారు శతాబ్దములలో శతఘ్నులు మనదేశమునకు రాగానే వానిని విజయనగరరాజులు సంతరించుకొని, తమ దుర్గరక్షణమునకే కాక దండయాత్రలకు గూడ వాడుకొనిరి. ఈ సందర్భమున విజయనగరరాజులు చివరవరకు, మన దేశ పశ్చిమతీరమున గించిద్రాజ్యము నేర్పరచుకొని యుండినపోర్చుగీసువారితో జరుపుకొన్న స్నేహ

మును గమనించవలయును. ఆ స్నేహ యొక్క అశ్వముల సంతనచేయుటతో నాగక, శతఘ్నులసంతనకుగూడ నుప యోగించినట్లు నిదర్శనము లున్నవి. ఆ శతఘ్నులు మన వారు బారుచేయుట నేర్చుకొనిరో, లేదో, మనము చెప్ప లేము. శ్రీకృష్ణరాయలకాలములో జరిగిన రాయచూరు యుద్ధములో, నా శతఘ్నుల నొక పోర్చుగీసువాడే బారు చేసెనని యా యుద్ధమును వర్ణించినయాయన వ్రాసి యున్నాడు. ఎవరు వానిని వాడినను, శతఘ్నులు కృష్ణ రాయలసైన్యములో నుండెనని యెరుగుదుము. వానిలో గొన్నిటి నందందు బురుజులపై నుంచియుందురు. తద్వారా దుర్గసంరక్షణము జరిగియుండును.

౫. అని మనకు దోచినసందేహముల నివృత్తిచేసికొని, నిద్రించబోవు వేళకు, మన మెంత సమాధానపడితిమని యను కొన్నను, "అంత మహాదుర్గ మాతురకల కెట్లు చిక్కెనా? తిరుమలరాయలు సదాశివునితో బారిపోకుండ, మిగిలినసైన్య మును మోహరించుకొని కొంతకాలము పెనగులాడగూడదా? విజయనగరసైన్య మంతయు నాశనము కాలేదుకదా, ఆమధ్య నడలిపోయి యందందు దాగియున్న సైనికులను, ఇండ్ల కేగి యున్న సైనికులను, రావించుకొనుట కవకాశము దొరకకుండు నా? తిరుమలరాయలు తొందరపడినాడు," అని కొందరు బుద్ధి మంతులకు దోచకపోదు. మాకును నట్లే చాలకాలము తోచి:

"జీర్ణకర్ణాటలక్ష్మీపునస్సృష్టి నె
వ్వానిలో కేశ్వరత్వము రహించు"

నని రామరాజభూషణుం డావీరవర్యునిగురించి వ్రాసిన సీసపా
దము వినినప్పుడెల్ల, నది జ్ఞప్తికివచ్చినప్పు డెల్ల 'ఈవర్ణసమేడ్చి
నట్లున్నది, మనకవులకంటె నసత్యవంతులు లోకములో నుం
డరు, హిందూరాజ్యరమ నావిధముగ నట్టేట ముంచి పలా
యనుఁడై నపిరికిపంద తరువాత నేమితగులబెట్టిన నేమి? ఆయనకు
లోకేశ్వరత్వ ముండిన నేమి? లేకుండిన నేమి?' అని తోచుచుం
డెడిది. కాని నిదానించి యాలోచించినకొలఁది నతఁడుచేసిన దే
యప్పటికితగినపని యని తోచ నారంభించినది. హిందూరాజ్య
రమ యాశ్రయించిన దుర్గములలో విజయనగర మొకటికాని,
యామెబ్రతుకంతయు దానిమీద నే యాధారపడియుండ లేదు.
అంతబలవంతములైనదుర్గములు గాకపోయినను నొకమాదిరిగ
దురకల నాపగలదుర్గము లింకను ననేకములు దక్షిణదేశములో
నున్నవి. వానిలో నెల్ల పెనుగొండదుర్గము బలమైన వానిలో
నొకటి. మూర్ఖించి పట్టణములోనే యుండి, పారిపోయినవారు
వచ్చిచేరరా చూత మనిమెంచి, యాయున్న రాణువనుగూడ
హతముగావించుకొని, నాటిరేయి యేడువందలయొంటెపిట్టల
మీఁద నేనుగులమీఁద నెక్కించుకొనిపోయిన యమూల్యధనరా
శులను దురకలచేజిక్కింపకుండ, దిరుమలరాయలు, "తైలము
లేనిదీపిక యెంతకాలము వెలుగగలదు: రక్షణమునకు గావల
సినసంఖ్యలేని సైన్యముతో నీమహాదుర్గము నెంతకాలము
రక్షింపగలను," అని మెంచి పలాయనుఁడై తెలివిగలకార్యము నే
యొనరించినా డని యెంచితిమి. మిగిలినవిషయములలో
నెట్టివాఁడైనను, నిరువది ముప్పది యుద్ధములలో నైదుగురు

సుల్తానుల దరిమితరిమికొట్టిన తిరుమలరాయలు, రామరాయని తమ్ముఁడు, ఆర్వీటివంశీయుడు, హైందవగౌరవ మంతయు దనపై నిలిచియున్నదని సంపూర్ణముగ నెరిగిన తిరుమలరాయలు, పిరికిపందమట్టు కయియుండడు. ఏవిషయ మైనను జరిగిన వెనుక, "అట్లుగాక యిట్లైన బాగుండెడిది." యనుట మనుష్యునకు నైజమైనది. అట్టి యాక్షేపణమునకు బ్రితిమానవుడు బాధ్యత లేకుండ తీర్పు దిద్దగలిగియుండుటే కారణము. అది మన కందరకున్న యహంభావఫలము. ఇది లోకములో నొక్క తిరుమలరాయలపట్లనే ఫలించుట లేదు. చరిత్రిలో ననేకులను మనమిట్లనుచున్నాము. దుర్యోధను డట్లు చేయకుండ నిట్లుచేసిన భారతయుద్ధమున నోడిపోవునా? బ్లూచరునాపుటకు గ్రౌచీతో గొంతసైన్యము నంపక, నెపోలియ నా సైన్యమునుగూడ దనయొద్ద నుంచుకొని, యింగ్లీషువారిని దాకిన, వాటర్లూ యుద్ధములో నోడిపోయియుండడు, అని యనేక సందర్భములలో మన మిట్లే యామహాత్ముల నాక్షేపించి, మనకుదోచిన యూహల వెల్లడించుచున్నాము. ఆయాపురుషుల కొకవిధమైన సమర్థత యున్నదని యొప్పుకొనినప్పు, డొక్కొకసందర్భములో, వా రెందుల కారీతి వ్యవహరించిరోయని విచారించునపు, డట్లుసేయుటకు వారిని బురికొల్పినవిషయముల నన్నిటిని మన మెరిగియుండవలె. తిరుమలరాయలనిశ్చయమును బలపరచినవిషయములు మనకు దెలియని వెన్ని యున్నవో యని యూహించితిమేని, యీ 'గతజలసేతుబంధనము' గా వింపము. పయిగా నప్పుడు తిరుమలరాయ లొక్కడే లేడు.

ఆయనవెంట నెందరాంధ్రయోధు లుండిరో! విజయనగర విసర్జనమువంటి మహావిషయము నాయన యొక్కడే నిర్ణయించియుండడు. వారితో సంప్రదించి యుండును. అన్నియు నట్లుండనిండు. తా నెంత రాజ్యవ్యవహారమునంతయు నాగ్వీటియన్నదమ్ముల పై బెట్టి భగవద్ధ్యానము చేయుచున్నను, సామ్రాజ్యరాజధానిని విడిచిపెట్టి పారిపోనలసివచ్చిన ప్పుడైన సదాశివరాయలు సలహా చెప్పక యూరకుండడు. అట్టి యదనున నాయనసలహా తప్పక నడిచియుండును. కాబట్టి విజయనగరమును విడిచిపోవువిషయ మొక్క తిరుమల రాయలే నిర్ధారణచేసినది కా దని, ఆయనతో నున్నవీరులు ఏలికమైన సదాశివరాయులు, నందరు గలిసి నిర్ణయించిన విషయమని మావాదము. వా రందరు నెట్టిస్థితిలో నుండిరో, అట్లు నిశ్చయించుటకు వారి కేయేకారణము లుండెనో, పోగా మిగిలినసైన్యసంఖ్య యెంతో, మహమ్మదీయసైన్యసంఖ్య యెంతో, విజయనగరతురుష్కవాహిని మహమ్మదీయులను గలియుటవలన విజయనగరసంరక్షణమునకు సంభవించిన యపాయ మెట్టిదో, తిరుమలరాయుల సర్దారు లెటువంటివారో మనకు దెలిసినచో, మన మీవిషయమును గొంచెము కృషిచేసి, తేల్చి, తీర్పు దిద్దగలము. ఏదేవునిదయవలన మన కీవిషయము లన్నియు గనుగొనుశక్తి యెన్నడైన నలవడినను దిరుమలరాయలు కోటను విడిచిపోవుటే యాసందర్భమున జేయవలసినకార్యమని తప్పక యనుకొందు మని మామతము. పాప మట్లు పలాయనుడై యూరకుండలేదు. రెండుమూడు

పర్యాయము లాపట్టణమును, సామ్రాజ్యముతో బాటు, ఉద్ధరించు ప్రయత్నములు కావించెను. కాని తురకలధాటి కడలి చుట్టుప్రక్కలప్రజ యాయూరి కెక్కరైరి. అప్పుడు నిరాశచేసికొని, పెనుగొండదుర్గమును బలపరచుకొని కాల క్షేపముజేసెను.

## 14 వ ప్ర క ర ణ ము.

# విజయనగరశిల్పప్రశంస.

ఇట్లుతరచుకొలది విజయనగరమునుగురించిన శంకలూ రుచుండును. కాని నమలుకొలది అతిరసములరుచి హెచ్చునట్లు, విచారించుకొలది వాని సమాధానములు హృదయంగమం బులు కాకపోవు. "పట్టణమున నింతశిల్పము చూచితిమి. ఇది యెచ్చటిది? దీనికి గురువెవరు? ఇది యెజాతిది?" అని యొకసం దేహము మనల నీయూర గ్రుమ్మర నారంభించినప్పటినుండి వేధిం చుచుండును. మనదేశమం దన్నిటితో బాటు, శిల్పవిషయ మునగూడ నొకవిపరీతము జరిగినది. కొంతకాలము క్రిందట మనకు శిల్పవిద్యనే లేదని, ఉన్నమటుకు మనము పారసీకుల యొద్ద, యవనులయొద్ద, రోమనులయొద్ద, అరబ్బీలయొద్ద నేర్చు కొనినదని, దానిని మనము సాధ్యమైనమట్టుకు గ్రహించి, మనవిగ్రహములలో గట్టడములలో నగుపరచితి మని యొక వాదము బయలుదేరెను. ఆ సిద్ధాంతులకు భారతీయులు మొర కువారని, ఆఫ్రికాఖండములో నాషేసియాఖండములో మన

దేశములో, గొండలలో, నడవులలో, నే డందం దగుపించు మొరకుజాతివారికి మనపూర్వులకు విశేష భేదము లేదని, మనకు జాతిభావమే లేదని, పరిపాలనావిషయమసలే తెలియదని, నాగరకతాలక్షణము లెంద్రైననగుపడిన, నవియన్నియు, బైజెప్పిన జాతులను జూచి మనము నేర్చుకొంటిమని నమ్మకముండెడిది! రానురాను పైదేశీయులలో బండితులైనవారిచటికి ప్రయాణికులుగ వచ్చికాని, వచ్చినవారివలన మనసంగతులు వినికాని, వ్రాసినవ్రాత లిటీవల నాయాదేశములలో, మనదేశములో బయల్పడినవి. వానితో నాసిద్ధాంతము కొంత మారిపోయి, మనకుగూడ నాయావిషయములలో గొంతశక్తి యుండిన నుండవచ్చు ననుకొనసాగిరి. కాలము గడచుకొలది, యింకను గొన్నివింతలు మనదేశములోనే వెల్వడ నారంభించినవి. వానితో 'కొంత శక్తి యుండిన నుండవచ్చు' నను వాదముపోయి, భారతీయులుకూడ సంపూర్ణశక్తినుంతు లేమో యని వారు సంశయింపజొచ్చిరి. మొన్నమొన్న, నుత్తరహిందూస్థానమున మనపండితులు కొంద, రాత్మదేశవిషయములలో బరిశ్రమ చేసి, సవిమర్శదృష్టితో మనకుగల సర్వమును బరీక్షించి వాదించసాగిరి. అప్పటికి భారతీయు లన్నిటిలో శక్తిమంతు లనుటకు సందేహములేదని, పైసిద్ధాంతులే యొప్పుకొన నారంభించిరి. గడచిన పదిసంవత్సరములలో, "మోహంజోధారో" "హరప్పా" యని సింధు, పంజాబు దేశములలో భూస్థాపితములై యుండిన రెండుపట్టణములు ప్రభుత్వమువారు త్రివ్వి మెత్తి వెల్లడిచేసిరి. వెల్లడిచేయుచు నాపట్టణములు రెండు

ను, గ్రీస్తునకు బూర్వము షుమా రేమూడు వేల సంవత్సర ములనాటివో యని ప్రకటించిరి. ఆపట్టణములలో దొరకిన వస్తువులు, అం దగుపడుచున్న కట్టడములు, అందలి విశాలవీథులు జలయంత్రములు, జలమార్గములు, దేవతారాధనావిశేష ములు, లోనగువిపరీతవిషయములతో, నాసిద్ధాంతు లొకపెద్ద పట్టీకొట్టి "ఆగుడాగుండు! ఇదివర కేమంటిమి! పాపము శమించు గాత! భారతీయులకు వారియొద్ద వీరియొద్ద నాయావిషయములు నేర్చుకొనవలసిన కర్మ మేల తటస్థించియుండును! క్రీస్తునకు బూర్వము మూడు వేల సంవత్సరములనాడు లోకములో బ్రసిద్ధి జెందిన బాబిలోనియనులనాగరకత కంతయు భారతీయనాగర కతయే మూలమా యనుఃపించుచున్నది. ఈయనుమానము కొలదికాలములో సత్యమని నిరూపించదగిన నిదర్శనము లీపట్టణములలో గాన్పించుచున్నవి" అని ప్రకటింపదొడగిరి.

చూచితిరా యేమైనదో? ఈసంక్షేత్రమున రాజన ములు పండ నారంభించినవి. ఆటవికులము నాగరకులమైతిమి, శక్తివిహీనులము శక్తిమంతులమైతిమి. ఊరుపేరు లేక లోక ములో మూలబడియున్న వారికి నామరూపము లేర్పడినవి. అట్లంటిమి కావున ప్రపంచనాగరకతకు భరతఖండమే జన్మ స్థానమని మావాదము కాదు. అట్టిమూర్ఖప్రశంస మనసాత్విక స్వభావమునకు సరిపడదు. కలనైన మన మంత శక్తిమంతు లమని మే మెన్నడును ననుకొనలేదు; సర్ జాన్ మార్షల్ గారు పై యూహను వెల్లడించినమాత్రమున నే డనుకొనబోము. అం దఱితోబాటు మనకుగూడ కొంతశక్తి యున్నదని చెప్పుకొన

గలిగియుండుటకు సంతసించుచున్నాము. ప్రతివిషయమును నేడు ప్రతివస్తువుతోబాటు, విదేశములనుండి దిగుమతి చేసుకొననక్కరలే దని సంతసించుచున్నాము. ప్రకృతము, శిల్పకళకూడ, మనదేశములో నొకప్పు డుండిన దనుకొనగలుగుటకు సంతసిల్లుచున్నాము.

అట్లనుటచే మన మితరదేశములనుండి యీ కళావిషయములో నేమియు నేర్చుకొనలే దనుటలేదు. అట్టి స్థితి అసంభవము, ప్రకృతివిరుద్ధము. లోకములో నితరుల యొద్ద కొద్దియో గొప్పయో నేర్చుకొనుట సహజము. అట్లు నేర్చుకొనకుండుట విపరీతము, మూర్ఖస్వభావము. భారతీయు లెట్టివారైనను దెలివి తేటలలో నితరజాతుల కెంతమాత్రమును దీసిపో రని యందరు చాటించు విషయమే. అట్టి బుద్ధిమంతులు, తమ కెంత యున్నను, బరులతో సంపర్క మేర్పడినపు డెల్ల వారియందలి మంచిని గ్రహించియుందురు. ఉన్న దానికన్న విశేష మగుపడిన దానిని తప్పక యవలంబించి యుందురు. ఇది యొక్క శిల్పములోనే కాక యితర కళలలోగూడ తటస్థించియుండును. ఈ విషయములో మన "మొగమునసే గుడ్లు మొలవలేదు." ఇది లోకములో నెల్లెడల జరిగియున్నది. అట్టి నూతనవిషయసంపాదనము లేకున్న నీ సృష్టి యంతయు నాటవికావస్థలోనే, యీ యిరువదియవశతాబ్దమునగూడ నుండియుండును. కాని యట్టి సంపాదనలో, నస లేమియు లేక నేర్చుకొనుట, యున్న దానికి మెరుగు పెట్టుకొనుట, యనుభేద ముండునని బుద్ధిమంతులు

పాటించవలెను. అట్లు మన కళ లన్నియు మన భూమిలో స్వతంత్రజన్మము లంది, కాలచక్రము తిరిగిరా, విదేశసంపర్కము లేర్పడినపు డెల్ల, నా యా విషయములలో వారి యనుభవమును గుర్తించి, కొంతవర కవి మారియుండునని, అట్టి మార్పులు ఉన్నవానికి వన్నె వెట్టుకొనుటకే క్రింద బరిణమించిన వని మా మతము.

కావున నీ శిల్పకళ - యెటువంటిదో యొకటి-మన దేశములో సనాతనముగ నుండియున్నది. దాని కా రెండుపట్టణములలో నేడు కాన్పించుచున్న విగ్రహములు, కట్టడములే నిదర్శనములు. ఆకళ, మొదల వ్రాసి యిపుడు తప్పులు దిద్దుకొనుచున్న యాచార్యు లనినట్లు, పారసీక యవన రోమ తురుష్కాంగ్లేయ సంపర్కముచేత సూక్ష్మలక్షణములలో మారినది. ఆమార్పువలన తాను వన్నెగాంచినదికాని యున్న కాంతిని గోలుపోలేదు. ఏకాలమునను దనయాత్మను మరచిపోలేదు, మరపించునట్లు పరిణమించలేదు. పుట్టినప్పటినుండి నేటివరకు దనయపూర్వాధ్యాత్మికత్వమును విడువలే దని మావాదము. ఎట్లు విడువగలదు! మనబ్రతు కంతయు నాధ్యాత్మికత్వముతోనే యున్నది! మనబలము, మన దౌర్బల్యము నదియే!.

విజయనగరశిల్పములో నాయాధ్యాత్మికత్వ మగుపించుచున్న దేమో చూతము. దానికి ముం దాధ్యాత్మికత్వ మన నేమో యొకింత విచారింపవలయును. ఆధ్యాత్మికత్వ మనగా మనమనస్సునకు వచ్చిన దేవత లందరి విగ్రహములు చెక్కించి

చిత్రించి, నెలకొల్పుట కాదు. అట్టిదే యాధ్యాత్మికత్వమైన, విజయనగరశిల్ప మెట్టిదని, యింతతడవు చర్చించుకొన నవసర ముండదు. ఆయూరిలో నట్టివిగ్రహములసంఖ్య విపరీతముగ నున్నది. ఇం దాధ్యాత్మికత్వమనగా, శిల్పలక్షణాంతర్గత భావమని గ్రహించవలయును. ఒక చిత్తరువునుగాని, విగ్రహమునుగాని, మనము చూచినంతనే, దానిని గురించి మన మనస్సులలో నొకవిధమైన భావము కలుగుచున్నది. ఆభావము, మనకామక్రోధలోభ మోహమదమాత్సర్యములకు గిలిగింత వెట్టునేని, దానిని భౌతిక మనవచ్చును. అట్లుగాక ధర్మార్థకామమోక్షస్థాయియగు నాధ్యాత్మికత్వము నొకింత కదల్చి, దానిని చూచుచున్నంతవరకు, దానిని మనస్సులో జిత్రించుకొనునపు డెల్ల నాకోరికల మొలకెత్త జేసెనేని, దాని నాధ్యాత్మికత్వ మనవచ్చును. శ్రీసీతారామలక్ష్మణ విగ్రహములు మనకనులబడె ననుకొనుడు. అప్పుడు మనమనస్సులలో నెట్టిభావము లుప్పతిల్లునో యోజించుకొనుడు. సామాన్యులకు, భక్తిరస మొకింత వెల్లివిరియ, రెండుచేతులును నుదుట గలియుచున్నవి. బుద్ధిమంతుల, కావిగ్రహభావానుభవముచే, బ్రహ్మచింతనమున కనుకూలించు మనోగతి యేర్పడుచున్నది. అట్లగుట కావిగ్రహములయందు, వారి కప్రియత్నముగ నగుపించు సంపూర్ణశాంతిసౌందర్యానందములే కారణములు. ఆగుణములు ఆ మూడులక్షణములలో బ్రతిలక్షణమునకు శిల్పి సంపూర్ణత్వము ప్రసాదించుటచే నలవడినవి. మనశిల్పు లట్టిభావముల బ్రదర్శించుట కపరిమితకృషి

సలిపి కడతేరియున్నారు. ఎంతవరకు గడతేరినారనగా, తమ కళ ననుదినము ననుభవించు స్వదేశీయులేగాక, దాని ముక్కు మొగము నెరుంగని విదేశీయులుగూడ, దానిని చూచిన వెంటనే, నిది యాధ్యాత్మికలక్షణోపేతమని, నొక్కి వక్కాణించునంతవరకు గడతేరినారు.

ఈ ముచ్చట చక్కఁగ బోధయగుటకు దాని విపరీతావస్థ నొకింత పరిశీలింతము. అందులో నతివిపరీతావస్థను జెందియున్న కలకత్తావారి చిత్రకళ నిందు విచారింపబోము. అయ్యది ఆధ్యాత్మికలక్షణప్రదర్శనంబున మన నవీనాంధ్రభావకవిత్వమువలె, నతిదాంభికమైపోయినది. సంపూర్ణత్వప్రసాదముకొరకు, బూర్వకళాశాలురు, మన కగుపడి యగుపడకుండ నొకింత దిద్దినరేఖలను, వీరి యాందోళనములో, జక్కఁగ రెండుమూడంగుళములవంకలు తీరియున్నవి. ఇంకను దీసి తీసి సర్దుకొనినగాని వారిరాగము శ్రుతి కెక్కదు. వాని నటుంచి, పాశ్చాత్యచిత్రముల బరిశీలింతము. వానిని జూచినంతనే మన యాంతరంగికశాత్రవు లారుగురును జెలరేగుచున్నారు. "ఆహా! యిది నాదైన బాగుండుగదా! అరే! యేమి యీదురాగతము! అబ్బా! అది యంతయు మన దైన నెంత బాగుండును! అరరే! దీనిని జూచిన నెంత నోరూరుచున్నది. దీనిని సంపాదించు టెట్లు! వహ్వా! మానవు డన్నవాడు వానికి లెక్కయేమి! కట్టా వీని నెట్టయిన నణగద్రొక్కవలె"నను దుర్భావములే తోచుచున్నవి. వానిని జూచినంతనే యంజలి చేయవలెననికాని, "అథాతో బ్రహ్మజిజ్ఞాసా"యనికాని యను

పించదు. వానిని జూచుసంతసేపు పరమాత్మ దూరగుడగు చున్నాడు. అటువంటి భావోన్మేషప్రకటనంబున వారి కళాశాలు లారి తేరియున్నారు. అందువలన వారిలో నాధ్యాత్మిక ప్రదర్శనమే లేదని మే మనము. వారిలో గొందరు బుద్ధిమంతులద్దానికొరకు పాటుపడియున్నారు. కాని వా రావిషయమున, నిన్ని శతాబ్దములైనను, జదువురాని మన శిల్పులు, చిత్రకారుల వలె గుశలులు కాలేదు. దానికి జాతిస్వభావమే కారణము. ఆధ్యాత్మికప్రకటనమున కనుకూలించు గుణములు హైందవ కళాశాలురరక్తములో నిమిడియున్నవి: రాజసతామసప్రకటనంబున కవసరములగు గుణములు వారిరక్తములో నిమిడి యున్నవి. అందువలననే వా రెంతభక్తితో జిత్రించినను, మన మామూలు విగ్రహముననున్నంత ఆధ్యాత్మికోన్మేషము వారిపనియందు గానిపించదు. ఈ సందర్భమున, మరొక విశేష మున్నది. బుద్ధిమంతులగు చదువరులకు, మనవా రట్టిచో నెట్లుకావించినా రను సందేహము తోచకపోదు. అట్టి కళాప్రదర్శనమును వెల్వరించుటకు మనశాస్త్రములు, నాచారములు నొప్పుకొనవు. అయినను మన దేవాలయములలో గోపురములమీద నట్టికళాప్రదర్శన, మేకారణముచేనైన నేమి, కనబడుచున్నది. దానిగుణమెట్టిదో, అది మనస్సుల నాకర్షించుచున్నదో, లేదో, మనమనస్సులలో భావోద్రేకము గలిగించుచున్నదో, లేదో, బుద్ధిమంతులకే తెలియవలయునుగాని, గ్రంథకర్తలు వచింపదగినవిషయము కాదు.

నొత్తమున కట్టికళలయందుగూడ, మనవారు విజయము నొందియున్నారని నిరాక్షేపణముగ జెప్పవచ్చును.

సరే! చేనుకన్న కంచె బలిసినది. ఉపోద్ఘాతముతో సరిపోవుచున్నది. చిత్రమునకు జెప్పినలక్షణము లెల్ల శిల్పమునకు బట్టుననుకొని, ప్రకృత మనుసరింతము. విజయనగర శిల్పమునం దట్టి యాధ్యాత్మికలక్షణ మున్నదేమో పరీక్షించవలసియున్నది. అట్టి పరీక్ష వృథాయాసమని మామతము. మన కళలు శాస్త్రప్రయుక్తములే గావు, శాస్త్రబద్ధములు. ఆ నిబంధముల గ్రహించుటే యా శాస్త్రపరిచయమున 'కోసమాలు'. అంతేకాక శాస్త్రజ్ఞుల బుద్ధికౌశలముచే, నే శాస్త్రమునందైన, విశేషముగ స్వతంత్రించుట కధికారము లేదు. కాబట్టి నిబంధనపూర్వకముగ గళల నేర్చి, వాని నభ్యసించు కళాశాలురందరు, సాధారణముగ నొక్కదారినే త్రొక్కుచుందురు. వారు, వారి పనిముట్లు నాధ్యాత్మికములో మునిగి తేలినవే. ఇక వారి కృషికూడ నట్లేయుండును. కావున నీ శిల్పములో నా లక్షణము లున్నవా యనుట యనవసరము. మన శిల్పమే యట్టిదైనపుడు దాని నొక శాస్త్రముగ నా శిల్పకారు లలవరచుకొనినప్పు, డా లక్షణమం దెల్ల దప్పక గాన్పించకపోదు. చివర కం దేవిగ్రహము చూచిన నట్టిదేనా యను ప్రశ్న మిగిలియుండును. దానికి సమాధానము పైసమాధానములోనే యిమిడియున్నదని మీకు తెలియును. అయినను గళాశాలికి విశేష స్వాతంత్ర్యమున కవకాశము లేకున్న ననలు స్వతం

త్రించుట కవకాశ మున్నది కదా! అట్టి యవకాశమును దుర్వినియోగముచేసి, ఆధ్యాత్మికపరిబోధకంబులుగ నుండ వలసినవానిలో, భౌతికమును జొన్పియుండగూడదా? యను శంకచే నీవిచారణము బయలు దేరినది. అట్టివిగ్రహ మొక్కటికూడ మా కెందును గానిపించలే దనుటకంటె నీవిష యమై విశేషము వ్రాయుట కవసరము లేదు. ఏవిగ్రహమును జూచినను శాంతి సౌందర్యానందగుణపరిదర్శనముకొరకు, ఆధ్యాత్మికభావప్రకటనముకొరకు, నా శిల్పి కృషిసలిపినట్లు కాన్పించును. ఆకృషిలో జాలవరకు నెగ్గినట్లు, కొన్నిచోట్ల నింతకన్న పనితన మెట్లుండు ననిపించుకొనునట్లుకూడ గాన్పిం చును. దానికి నిదర్శనముగ నొక్కరంగశాయివిగ్రహమే చాలును. అది సార్వభౌములు చెక్కించిన ట్లగుపడదు; కావున నేసామాన్యశిల్పియో దానిని చెక్కియుండునని అట్టివానిలో గళాబలము ప్రకటితమగునని, యావిగ్రహము నెత్తుకొం టిమి. దాని నొక్కసారి చూచినవారికి మామాటలు నచ్చక పోవు. ఆయూరనున్న మిగిలినవిగ్రహము లన్నిటిని బరీక్షించి నచో, గించిద్భేదములతో, నన్నియు నొకబుర్రలోని విత్తులని యనిపించకపోదు. కాబట్టి, విజయనగరశిల్పులు తమశాస్త్ర సంప్రదాయమును బాటించినారని తేలుచున్నది. అందు వలన వారు స్వతంత్రించనే లేదని మేమనము. స్వతంత్రించి నను నట్టిస్వాతంత్ర్యము, ఉగ్రనృసింహవిగ్రహమునందుబలె సర్వజనసమ్మతమేగాని, సంప్రదాయవిరుద్ధముకాని శాస్త్ర విరుద్ధముకాని సహజవిరుద్ధముకాని కాదు.

ఇక భౌతికభావప్రదర్శన మెట్లున్నది యను ప్రశ్న ము మిగిలియున్నది. అదికూడ బహుసరసముగ నున్నదను సమాధాన మెదుర్కొనుచున్నది. కాని యట్టివిగ్రహము లెల్ల డల గాన్పించవు. వానికై కృషిచేయవలె. కొన్ని పర్యాయ ములు కనుల వత్తులుపెట్టుకొని వెదుకవలె. ప్రకృతినిమగ్ను లగు నీబుద్ధిమంతుల కట్టి వనుభవములోనివే కదా, ఆభావము లనుదినానుభవములోనివే కద, వానికై యేలపాటుపడవలె నని మన శాస్త్రజ్ఞు లెంచిరా యనిపించును. అయినప్ప టికి, శాస్త్ర మేసూత్రముల నేర్పినప్పటికి, శిల్పికూడ మానవుడు కాకపోలేదు. ముక్తిసాధనమగుభావము నెంత ప్రకటించుచున్నను, ఒకానొకప్పుడైన, దనవ్యక్తినైజము ను వెలిపుచ్చకపోడు. కావున నట్టివిగ్రహము నందందు జెక్కియుంచినాడు. ప్రతిస్వభావమును బ్రదర్శించినాడు. మీకు కామము కావలయునా? విఠలవిహారపాకృష్ణస్వామి గోపురంబుల బరిశీలింపుడు! అంతవరకేల - అచ్యుతాలయ మున కేగుదము రండు. అందలి కల్యాణమంటపస్తంభము లపై జెక్కిన బొమ్మలను జూడుడు. వానివర్ణనము గ్రంథస్థము సేయదగినది కాదు. అయినను నెంతసహజముగ నున్నవో గమనింపుడు. ఇంకొకవింత - ఇవి యన్నియు శిల్పి తనభావనా బలముచేత సృష్టించినవిషయములు కావు. ఆబంధము లన్ని యు గళాశాస్త్రానుబద్ధములై యున్నవి. ఆపుస్తకమెందైన దొరకిన, నొకసారి కొనిపోయి వానిని బరీక్షింపుడు. ఒకింత సూక్ష్మముగ నీవిషయమును బరీక్షించినచో, నాశిల్పికిగల

ఇతరశాస్త్రానుభవము విశదము కాకపోదు. వెనుక క్రోధ
ము కావలయునా? నేడు భీమసేనుదర్వాజాయని పిల్చు దర్వా
జాయొద్దనున్న భీమసేనవిగ్రహమందలి ముఖకళను బరీక్షిం
పుడు. కాకున్న మహార్నవమిదిబ్బ వెనుకనున్న గుడిలోని బేతా
ళాకారమును జూడుడు. అన్నిటికన్న విఠలాలయకల్యాణమం
డపమందలి లోపలి స్తంభములలో నొకమూల జెక్కియున్న
యాహైందవయోధుని, తురకవానిని, బరిశీలింపుడు. భీము
డు దుశ్శాసనవధ కేగుచున్నాడు. ఆసందర్భమును జ్ఞప్తికి
తెచ్చుకొని, వధానంతర మా వీరావతంసుడు గావించిన
రాక్షసకృత్యముల మనస్సులం దుంచుకొని, యాముఖకళను
బరీక్షింపుడు. నిదానించిచూచినచో నాయచేతనము చేతనమై,
దుశ్శాసనుల మనుకొని, మనల నెక్కడ యంత మొందించునో
యనిపించకపోదు. భేతాళుని క్రోధ మది యొకమాదిరెది.
అది భీమసేను విగ్రహమువలె, బీభత్సము కాదు. చూపరులకు
గ్రోధోద్రేకము నేయునట్లున్నది. వీనికేమి - విఠలాలయవిగ్ర
హముల బరీక్షింపుడు. ఆ హిందువు డెన్నితరములనాటి క్రోధ
మునో తీర్చుకొనుచున్నట్లు మన కనిపించువిధమున, మొగ
మును బిగబట్టి పన్నుల గొరకుచున్నాడు. వాని నేపోటుతోనో
మక్కాకు బంపక అతినిదానముగ, నొకచేతితో దలనుబట్టు
కొని, రెండవహస్తమందలి కరవాలముతో గొంతునుగోయు
చున్నాడు. శిల్పి యా తురకవానినోటిని కనులను, నెంత
స్వభావసిద్ధముగ జెక్కినాడో చూడుడు.

సరే, కామక్రోధము లైనవి. లోభప్రదర్శనమును జూతము రండు. ప్రతి స్థలములో గనుపించు కుబేరవిగ్రహము నటుంచుడు. ఆ యాచకాళ్ళు, బానకడుపు, పొట్టి చేతులు, పెద్దనోరు, ఆ పిసినిగొట్టుతనము నెగజిమ్ము ముఖకళ, దానికి జీవమును బ్రతిపాదించు చీకిరికన్నులు, బహుళః, ఆ చినిగిపోయిన తలగుడ్డ, వాని నట్లుంచుడు. అచ్చపు వర్తకునివలె నున్నాడు. వితలాలయభిత్తికాభాగంబుల జుట్టు నున్న బొమ్మలను బరీక్షింపుడు. అందులో గుఱ్ఱములమందను నడిపించుకొని వచ్చుచున్న యా పోర్చుగీసు వర్తకుని జూడుడు. వానికి నీకుబేరునకు గల లక్షణతారతమ్యముల బరిశీలింపుడు. శరీరలక్షణములు వానిదుస్తులు కప్పిపుచ్చుచున్నవి గాని, సూక్ష్మముగ గ్రహించినచో, వాని లక్షణములకు గుబేరశారీరలక్షణములకు నే మాత్రము భేదమగుపించదు. అందలి ముఖలక్షణముకూడ వీసమైన బీరుపోకుండ సరిపోలు చున్నది. ఆ గడ్డమున కేమిలెండు - అది వాని జాతిలక్షణము. ఆ విగ్రహము ప్రకటించు భావమును గ్రహింపుడు. "ఇన్ని అశ్వములను దెచ్చుచుంటిమే — తగినధర దొరకునో దొరకదో ? సార్వభౌము డేమి చేయునో! తగిన ధర దేవు డెరుగు - అస లేమైననిచ్చునా! పాటకు వినుటయే బహుమతి - ఇంత సేపు దలయూపితిని దానికి నీ తంబుర నిచ్చిపొమ్మని, గాయకుని తిరుక్షౌరముచేసిన రసికునివలె, 'ఓ వర్తకుడా! నిన్ను మా సామ్రాజ్యముగుండ రానిచ్చినదే చాలును. మా పట్టణముల ప్రవేశించి యందు

బ్రతుకనిచ్చినందులకు నీ గుర్రముల నిచ్చిపొమ్మనునా? యని యా లోభి యంతశరీరములో నెందో యనుమానించుచున్నాడా యనున ట్లగుపించుటలేదా? ఇటువంటి లోభప్రకటనమును మేము బ్రకృతిలో ననేకపర్యాయములు చూచి యుంటిమి కాని, చిత్రప్రపంచములో, శిల్పప్రపంచములో, నెందును జూచి యెరుగము.

చివరకు మోహమదమాత్సర్యము లున్నవి. సూక్ష్మపరీక్ష కివి యెంతస్వతంత్రభావములైనను, బ్రకృతిలో మిగిలిన మూడుభావములకు జాలవరకు సంబంధించినవి. ఈవిషయము నెరిగినవాడు కావున శిల్పి వానిని ప్రత్యేకించి ప్రకటించి యుండలేదు. హైందవతురుష్కవిగ్రహములందు కుబేరవిదేశవర్తక విగ్రహములందు నాభావముల సందర్భానుసారముగ బ్రకటించినాడు. మోహ మతివిచిత్రమైనది. కామలోభములతో దాని కెడతెగని సంబంధ మున్నది. ఆగుణముల బ్రదర్శించునపుడెల్ల నావిగ్రహముల చూపులలో నాభావము నిమిడ్చియున్నాడు. అంతకన్న దానిని ప్రత్యేకముగ సమర్థించుటకు వీలులేక యట్లు కావించినట్లు తోచుచున్నది. మదాహంకారము దేవతావిగ్రహముగాక, కేవల దైన్యపోషణకుగాక, చెక్కిన ప్రతివిగ్రహమునందును గానిపించును. క్రోధము నెందెం దగుపించవలనుపడునో యందెల్ల మత్సరమును వెలితిలేకుండ బోషించినాడు. వాసితో సంతుష్టిపడక, సిసలైన మదము మాత్సర్యమే మాకు గావలయుననువారినిగూడ సంతోషపెట్టగల విగ్రహ

ములను జెక్కియున్నాడు. దేవాలయభిత్తికలమీద, సభా మందిరములమీద నెన్నియరణ్యములో విడివడ్డయట్లు, శుం డోపశుండములుగ, నేదియోమునిగిపోవుచున్నట్లు బరుగులె త్తుచున్న ఆలేళ్ళను, గుఱ్ఱములను, నేనుగులను, బెద్దపులు లను, సింహములను, సావకాశముగ బరీక్షింపుడు. వాని యంగసౌష్ఠవమందలి మదము, పందెపుపరుగో యనిపించు పరుగులోని మాత్సర్యము, తిక్కనగారికవిత్వమువలె, నెం తస్వభావసిద్ధముగ, రసవంతముగ, నున్నదో గమనింపుడు. ఇంతకన్న నాభౌతికభావప్రదర్శనమును గురించి యధికముగ వచియింప నవసరముండదు.

విజయనగరశిల్ప మేజాతిది యనుసందేహ మొక్కటి బాధించుచున్నది. ఇది శాస్త్రజ్ఞుల ఛాందసము. సూక్ష్మపరీక్ష నేయగా నేయగా, నామహానుభావులకు, సామాన్యులకు గాను పించని యనేకభేదములు గానిపించుటచేత శాస్త్రపరిశోధన మునకై, వానిని తెగలుతెగలుగ విభజనముసేయుట సహజ మైనది. అందువలననే దీనిని ఛాందస మంటిమి. అయినను, జాతినిర్ణయము సేయకుండినచో విజయనగరశిల్పపరీక్ష సంపూర్ణము కాదు. విజయనగరశిల్ప మేజాతికి సంబంధించి నది ? అనుప్రశ్నకు నింకొకప్రశ్న వేసి సమాధానము చెప్ప వచ్చును. ఇప్పటి హిందువు డేజాతికి సంబంధించినవాడు? అట్టిప్రశ్నమున కిదమిత్థమని యొక్క భగవంతుడుతప్ప మరె వ్వరు సమాధానము చెప్పలేరు. కవిసార్వభౌముడు కలిమహా రాజచండముద్రాధరులచే

"క॥ మారుఁడు దుర్వారుఁడు, సం
సార మిది యనాదిసిద్ధసంరక్షణ, మం
భోరుహనయనల చేతిది
యేరూపున జాతిశుద్ధి నేర్పరుపనగుణ్."

అని యనిపించినట్లు స్వచ్ఛమైనజాతి భూలోకములో లేదనిమా యభిప్రాయము. కాలచక్రచంక్రమణమున బ్రతిజాతి యనేక కారణములచేత సంకరమైయున్నది. సాంకర్యమే రసపోషణ మునకు మూలమని కొందరి శాస్త్రజ్ఞుల వాదము. ఆవిషయ ము నటుండనిండు. కావున ప్రతిజాతికి నెప్పుడోయొకప్పుడు సాం కర్యము సంక్రమించియుండును. విజయనగరశిల్పముకూడ నాసాంకర్యసూత్రమునకు లోబడినదే. దాని సహజలక్షణము హైందవము: హైందవములో ద్రావిడము: ద్రావిడశిల్పకళయం దెన్నిసాంకర్యము లున్నవో, యవి యన్నియు నిందును గను బడగలవు. అరబ్బీయవనకళాలక్షణము లందందు ఈశిల్పకళ లో నిమిడియున్నవి. ఎంతవరకు నట్టిసాంకర్యముచే నీశిల్పకళ తేజోవృద్ధిని చెందినదే కాని తనసహజభావమునుగోలుపోలేదు. విజయనగరమునుజూచినవా రందరు, దానిని స్వర్గఖండమనిన నందురుగాని, ఎవరును విదేశఖండ మనిమాత్ర మన రని మానమ్మకము.

## 15 వ ప్ర క ర ణ ము.

# నీరు - గాలి.

విజయనగరములో, గుడులు గోపురముల తరువాత, నతివిపరీతముగ దోచు విషయము కాల్వలు. అవి యిందు నందు గాక, సర్వత్ర మన కడ్డము వచ్చుచుండును. రెండు మూడడుగులు మొదలుకొని పదునైదిరువది గజముల వెడల్పు గలిగియున్నవి. తాడిన్నరయెత్తు నూహించుకొనుడు. దానిలో నెట్టియెత్తుననైన గాల్వలు పారుచున్నవి. ఒక్క విరూపాక్షాలయమును దత్ప్రాంతప్రదేశమును బరీక్షింపుడు. ఆలయమునకు గుడిపార్శ్వమున రెండడుగుల వెడల్పుగల కాల్వ యొకటి ప్రవహించుచున్నది. ఆలయములో బ్రవే శించగనే, యా కాల్వకన్న షుమారు పండ్రెం డడుగుల దిగువ నొక కాల్వ కానఁపించును. ఆలయపశ్చిమద్వారమున నిర్గమించినంతనే, యిపుడు కాన్పించిన కాలువకన్న రమా రమి యిరువదియడుగుల యెత్తున మరొక కాల్వ యగుపడును. దానికి పదిగజముల దూరములో, దానికి షుమా రిరువదియై దడుగుల దిగువ నొక లోతైన పుష్కరిణి యున్నది. ఒక కాల్వ, మనకు గనుపడనిది, తూముగుండ నందు బ్రవేశించి దానిని నింపుచున్నది. పై జెప్పిన కాల్వ లన్నియు, వేర్వేరు కాలువలనుండి వచ్చిన పిల్లకాల్వలు కాని, యొక్కటేకాలున యిన్ని యెత్తులలో బ్రవహించుటలేదు. ఇట్టి వనేకస్థలము లలో గన్పడును.

"దానిలో విపరీత మే మున్నది? ఒక పెద్దకాల్వ యుండవలెగాని దాని పిల్లకాల్వల నెట్టియెత్తుననైన ప్రవహిం చునట్లు చేయలేమా?" యని మీకు దోచవచ్చును. వాస్త వమే - దానిలో నసాధ్యమేమియు లేదు. నే డట్టికాల్వలను వేనవేలను మన డెల్టాప్రదేశములలో జూచుచున్నాము. ఏ యే యెత్తున ప్రవహించవలెనో, యెం దెందు ప్రవహించ వలెనో, నేడాశాస్త్రజ్ఞున కెరింగించిన యెడల, నాత డతిసులభ ముగ దానికి తగినసదుపాయమును శోధించి,పటమును గీసి మన కొసంగగలడు. అతనికి తగినధనము నొసంగిన, పెద్దకాల్వనుండి పిల్లకాల్వల ద్రవ్వించి, తనపటమునకు జీవమును బోయగలడు. ఆకార్యమును పదునాల్గు పదునైదవ శతాబ్దములలో జేసిన బుద్ధిమంతులవిషయ మొక్కింత యోజింపవలయును. దాని కనుకూలించు యంత్రసామగ్రి, అనుభవము ఇప్పుడు ప్రబలి యున్నవి. ఆధునిక యంత్రసాహాయ్యముతో, జలమార్గనిర్ణ యము నతిసులభముగ జేయవచ్చును. నా డట్టి యంత్రసహా యము శూన్యము. నాడు కనుచూపుతప్ప మరొక సాయము లేదు. వట్టిచూపుబలముతో నాపని చక్క బెట్టవలసియుండె ను. అదియు కేవలము వ్యవసాయమునకైన నంతకష్ట మని పించదు. పంటభూముల పరిస్థితులు సాధారణముగ జూపుబల మునకు లొంగకపోవు. పొలములలో సామాన్యముగ బసివా డైన గమనించగల మెరకపల్లము లుండును. అట్లుగాక ఒక రెండుమూడెకరముల స్థలములో, నాకాల్వలను, నేలమట్టమున నొకదానిని, పండ్రెండడుగుల యెత్తున మరొక దానిని, ఇరు

వదియడుగుల యెత్తున నింకొకదానిని, నీమధ్యను మరి యు నింకొకయెత్తున మరొకదానిని పారింపనెంచిన; అట్టికా ల్వల నన్నిటిని యొకకాల్వనుండి కాక, యందం దెందులకో యెటకో పారుచున్న వేరువేరు కాల్వలనుండి పాయలు తీసి పారింపనెంచిన; వానిని నొక్కచోటగాక ఫర్లాంగునకు రెం డుమూడు తావులలో బారింపనెంచిన; ఆతావు లితరస్థలము లలోబలె నొకమాదిరి మెరకపల్లములు కలవికాక, యాపట్ట ణమంతయు బర్వతమయ మగుటంబట్టి, యవి యతివిపరీత మగు మెరకపల్లములతో జెప్పరాని యెగుడుదిగుడుగ నుం డిన; నాకార్యమును సంఘటించుట యెట్టికష్టమో, చూచి యానందించు మనబోంట్లకుగాక, యాశాస్త్రపరిజ్ఞానము కల బుద్ధిమంతులకు విశదము కాకపోదు. ఆకష్ట మెట్టిదనిన, నాటి సాధనసామగ్రిని జ్ఞప్తినుంచుకొని విచారించినచో, నతివిప రీతమైనదని చెప్పక తప్పదు.

"అట్లయిన నాటివారు దేవతలా, రాక్షసులా, వారు ను మనవంటిమానవులే కద,యెట్లు నెరవేర్చిరి"యని తోచక పోదు. దానికి వారియనుభవమే సమాధానము నొసగును. మన వారి కావిషయమున నపరిమితానుభవ ముండెనని గతప్రకర ణములో మనవిచేసిన"మోహెంజొదారో""హరప్ప"యందలి జలమార్గములే చాటి చెప్పుచున్నవి. అట్టివి మనవా రెరుంగు దురని మనపురాణములలో, నితరగ్రంథములలో నందందు గుప్పించియున్న వర్ణనలు చెప్పుచున్నవి. మౌర్యసామ్రా జ్యమునాటనుండి వ్యవసాయసదుపాయములకుగాని, పట్టణ

ములకు వలయునీరును సంతన సేయుటకుగాని, తటాకములను ద్రివ్వించి, యేళ్ల నరికట్టి, జలమార్గముల నేర్పరుప నేర్చితి మని చరిత్రవలన దెలియుచున్నది. ఆవిషయమున దాక్షి ణాత్యు లుత్తరదేశీయులకన్న శక్తిమంతులని కొందరందురు. ముఖ్యముగ ద్రిలింగదేశ మట్టిసదుపాయములను సమకూర్చు టలో కాకతీయులకాలమున నగ్రస్థానము వహించినదని, మహమ్మదీయయుగచరిత్రమువలన మనకు స్పష్టమగుచున్న దందురు. వారిని జూచి యట్టిసదుపాయములను ఢిల్లీసుల్తానులు, చక్రవర్తులు, ఉత్తరహిందూస్థానమున నేర్పరచిరని యా చరిత్ర చెప్పుచున్నదందురు. చరిత్ర యేమన్నను, అట్టి శక్తి యొక్కనాటితో నలవడునదికాదు. మహమ్మదీయయుగ మున నుత్తరహిందూసానమున సంభవించిన రాజ్యవిప్లవముల వలన, నట్టిసదుపాయము లంతరించి మాసిపోయియుండవచ్చు ను గాని, వానిలో మనదేశములవా రారితేరినా రనుట ఉత్త రదేశీయుల కాయనుభవము లేదనుట నిరాధారవాదము. క్రీస్తునకుపూర్వము దాదాపు మూడువేలసంవత్సరములనాడే పై రెండుపురాతనపట్టణములలో నంతశోభతో బాశ్చాత్య పండితుల నాశ్చర్యనిమగ్నుల గావించినమహాశక్తి, నాటికే యెంతకాలమునుండియో, యితరశక్తి సామర్థ్యములవలె, మనదేశములో సంప్రదాయసిద్ధముగ నిల్చి యభివృద్ధిచెందు చుండవలెను. చారిత్రకవిప్లవములలో నపుడపుడు మరుగు వడియుండి, యవకాశము వచ్చినపు డెల్ల, దిరుగ యథాశోభ తో జెన్నెసలారుచుండెను. అట్లగుట కాకతీయసామ్రాజ్యవి

నాశానంతర మేర్పడ్డ విజయనగరనిర్మాణమున, నట్టియవకాశ
ము పునర్లభ్యముకాగానే తిరుగ దలనెత్తి విజృంభించినది. ఆవి
జృంభణము తత్పట్టణపరిస్థితులంబట్టి యొకింత విపరీతముగ
బరిణమించినది. దానిని లోకమందలి మహావిచిత్రవిషయము
లందొక్కటిగ నాకాలములో నాయూరును జూచిపోయిన
పాశ్చాత్యప్రయాణికు లెంచిరనుటకు వా రా పట్టణమును
గురించి కావించిన వర్ణనలే తార్కాణములు.

ఆ కాల్వలలో బారుచున్న నీర మెటనుండివచ్చెను
అను ప్రశ్నము నీ గ్రంథములో నింతకుమునుపే మరొకసంద
ర్భమున జెప్పియుంటిమి. అది తుంగభద్రానీరము. పట్టణ
ప్రదేశమున నా నది యూరికంటె మిక్కిలి దిగువగ బ్రవ
హించుచున్నది. భగవత్కటాక్షమువలన, నా నది కడుగున
నొక యంగుళము వాట ముండుటంజేసి దాని కానకట్టను
గట్టుట కనువైన యున్నతప్రదేశము, పట్టణమున కనతి
దూరముననే లభించినది. నాగలాపురమునకు (నేటి హాస్పె
పేటకు) షుమా రేడుమైళ్ళదూరమున (బట్టణమునకు షుమారు
పదిహేనుమైళ్ళ దూరమున) నట్టిస్థలము దొరకినది. అం దొక
బలమైన యానకట్టను గట్టిరి. ఆయానకట్టను గట్టుట కప్పటి
భూవిభుడు రెండుకొండలను బంధించెనెనని, అందులకని తుంగ
భద్రానది నొక చిన్నకాల్వకు మడవత్రిప్పి పారించిన ట్లాకట్ట
డము పూర్తియగువరకు మలిపి పారించెనని, దానిపాయ నొక
దానిని గోడకిందికో, యెచటికో పారించెనని, లోనగు కొన్ని
విషయములతో నొకపాశ్చాత్యప్రయాణికుడు వ్రాసియున్నాడు.

మాకున్న భాషాజ్ఞానముతో దానినర్థముచేసికొన ప్రయత్నించి తిమికాని, యది మాకు సంపూర్ణముగ నవగాహనము కాలేదు. ఆమలపించుటలో, గొండలను బిండిసేయుటలో నద్భుత మే మియు లేదు. శ్రీకృష్ణరాయలు, ఉమ్మత్తూరునో శివసముద్రి మునో - దేనినో సరిగ జెప్పజాలము - వానిని వర్ణించు పుస్తక ములు మాయొద్ద ప్రస్తుతములో లేవు - వానిలో నొకటి కావే రీనదిలో ద్వీపమట - దానిని ముట్టడించునపుడు, ఏటిప్రవా హామువలన దానిగోడలను సమీపించుట దుర్ఘటముగ నుండె నట. అప్పుడు శాత్రివులకు దెలియకుండ కావేరీనదినే, కొన్ని మైళ్ళు త్రిప్పి పారించి, కోటచుట్టునున్న నీరము నెండగొట్టి యారొంపి యారగనే కోటగోడల సమీపించి, సైన్యముల లగ్గల కెగబ్రాకించె నని యొక యాధార మున్నది. కొన్ని లక్షలసైన్యముతో నేళ్లనేగాక మహానదులనుగూడ మలపించ వచ్చును. చిన్ని కొండలను బిండిసేయవచ్చును. వానిలో విచి త్రి మేమియు లేదుకాని, ఆతుంగభద్రిపాయను గోడలకిరిందికి, పారించు టేమో మాకు తెలియరాకున్నది. ఆవర్ణనమునుబట్టి యామహాకార్యమును గావించిన భూవిభుడు రెండవదేవరా య లని మనకు దెలియుచున్నది. ఆకాల్వ నాయనబిరుదు నామముతో 'రాయలకాల్వ'యని కొందరు పిలుచుచున్నారు. అనేకులు దానిని "తురుత్తుకాల్వ"యని పిలుచుచున్నారు. "తురుత్తు" అనగా గన్నడములో 'వేగమైన' యని యర్థము - వేగమైనకాల్వ యని యావాక్యార్థము. అది సార్థకనామమే యని, దానివంతెనపై నిలబడి యొకింత పరీక్షించిన, నెట్టివా

నికిని తోచకపోదు. అతులవేగస్రవంతియగు తుంగభద్ర కుద్భవించిన యాకాలువ మరొక చెట్లగును! ఆకాలువలో నుండి వీలైనచోట్ల నెల్ల గాల్వలు తీసి, వానికి గాల్వలు తీసి, వానినుండి పిల్లకాల్వ లనేకముల దీసి, యానదీనీరమును బొల ములకు, బట్టణములలో నాయా ప్రదేశములకు, దమచిత్తము వచ్చిన ట్లెల్ల బారించియున్నారు.

ఆచిన్నకాల్వలు పారించునపుడు పట్టణనైసర్గికస్థితిని బట్టి వారి కొక యిక్కట్టు తటస్థించినది. ప్రదేశమంతయు గొండలతో నిండియుండుటవలన, గొన్నికొన్నిచోట్ల, నీటి పారుదల కనుకూలించని పల్లము లడ్డమువచ్చినవి. అట్టివి తటస్థించినపు డెల్ల 'మొగములు వ్రేలవేసికొని' వానిని పూడ్పించుకొనక, రాతిని కొయ్యవలె నెంచి పనిచేయగల శిల్పకళాశాలు రుండిరికావున, నాలోతునకు దగిన స్తంభ ములను జెక్కించి, రాతికంబములలో షుమారు రెండుమూడ డుగుల వెడల్పుగల గాళ్లను గొట్టించి, వాని నా స్తంభముల మీాద నిలబెట్టి, యొకకంబమునకు మరొకదానికి చివరల దిట్ట ములైన కప్పులను దీసి, నీరు కారకుండ బిగించిన యాగాళ్ల లో నాకాల్వలను బారించియున్నారు. ఒక్కతావీసున్నము నైన రాళ్లను గలుపుట కుపయోగించలేదు. వానిని జూచిన పుడెల్ల మన "కాహా! యేమి! యీపనితన" మనిపించును. ఇట్టి కాల్వలు పెక్కుతావులలో గాన్పించుచున్నవి. పూర్వ విజయనగరచిత్రములలో నిది యొకటి. ఆపురము వినాశ నమై యిన్నిశతాబ్దములైనను, నాకాల్వలు మిగిలిన కాల్వ

లు మట్టుకు, నేటివరకు చెక్కుచెదరకుండ నున్నవి. వ్యవసాయాద్యవసరముల కుపయోగించువిషయము కనుక, మొన్న మొన్ననే, యీప్రభుత్వమువా రందందు మిగిలిన కాల్వలను గొంచెము మరమ్మతుచేయించుచున్నారు. కాని, స్తంభములపై కాల్వలను మాత్రము, వీరు ముట్టుకొనిన ట్లగుపించదు.

ఆ కాల్వ నీర మొక్క విరూపాక్షాలయములో దత్ప్రాంతముననున్న విద్యారణ్యమఠములో దప్ప, మిగిలిన చోట్ల వ్యవసాయమునకే యుపయోగించుచున్నారు. ఆ కాలువలవసతినిబట్టి, యందు పడియున్న పాటిమట్టినిబట్టి, పట్టణప్రదేశ మంతయు 'బొలములమయమై' పోయినది. పంపాపురము, విఠలాపురము దక్క, మనము పురములని పిలిచిన మిగిలిన వీథు లన్నియు బంటచే లైనవి. కాల్వల నీ రెక్కవలెగాని, యందలి రైతులు, ప్రభుత్వమువారు కూడ బెత్తెడు నేలనైనను బీరువోనీలేదు. రాచనగరునకుగూడ నీ గతి పట్టవలసినదే గాని, యది అత్యున్నతప్రదేశమున నుండుటంజేసి నీ రెక్కకపోవుటచే దానిని విడిచి రను కొందుము. మిగిలినయెడల సర్వత్ర పొలములతో నింపి వేసిరి. ఆ పట్టణ ప్రదేశమున గొన్నికడల దిబ్బలున్నవని వానిని త్రవ్వించిన నాపట్టణమును గురించినవిశేషము లింకను దెలియగలవని, యొక పత్రికరణములో జెప్పి యుంటిమి. అట్టిదిబ్బలను గొన్నిటిని వ్యవసాయకులకు బొలముల క్రింద నిచ్చియున్నారు. అటువంటివి కొన్ని మాతంగ పర్వతమున కొంకింత నైఋతిగ నున్నవి. వానిపై

వ్యవసాయము నే మందము. ఆంగ్లేయభాషలోని Terrace cultivation అను వాక్యము నాంధ్రీకరించి 'డాబావ్యవసాయ' మందమా! కనులపండువుగ నుండును. చేనుపై చేను మెట్లమర్చి వానిపై నాకుపచ్చజముకాణముల బరచినట్లు చూడ సొంపుగ నుండును. ఎట్టి వ్యవసాయమైనను, తుంగభద్రానది జీవనది కావున, నెక్కువ నీరమును దెచ్చు నదులలో నొకటి కావున, నీటికి లోపము లేదు. ఇక భూమిబలమందుమా, రమారమి మూడువందల సంవత్సరముల పాటి మన్నున్న స్థలమునకు సారలోప ముండదు. ఒకింత నాదారైనను, 'నే మాత్రపు యెరువు వేసినను జప్పున బోయిన చియ్యాను 'గుంజు' కొనగలదు. అందువలననే కాబోలు, మే మేబుతువులో నరిగినను సర్వదా అందు పంటను జూచితిమి. "ఈ రైతుల యదృష్టము! కావ్యములలో వర్ణించినట్లు వీరు ముక్కారును నేదియో యొకపంటను బండించుకొని యనుభవించుచున్నారా యేమి?" యనుకొంటిమి. అట్టి సదుపాయముగల కృషిని జూచి యపరిమితానందభరితుల మైతిమి.

ఆనందించితిమి కాని వెంటనే దుఃఖించితిమి. "వ్యవసాయకు డేదేశమందైన మొరకువాడు. మంచిభూమిని, అందులో నీటిసదుపాయమున్న మంచిభూమిని, జూచినంతనే యతని జాతినైజమగు భూదాహ మాతనికి గలుగకపోదు. ఆదాహము కలిగినపుడు, దాని నెటువంటి స్థలముతో దీర్చుకొనుచున్నాము అనుశంక యతని కేమాత్రము తోచదు;

అది శ్మశానమైన నొకింత సందేహించునేమో కాని, మరియే నేలమైన నెకరమున కెంతపండును అని అంచనా వేయునేగాని, యిందు మనకృషి న్యాయమా యని సుంతైన విచారింపడు. అట్టిచో, సర్వజ్ఞులు కాకపోయినను, సర్వవిషయములను గమనించవలసిన బాధ్యత కలిగియుండి, గమనించగల పండితుల దమచేతికిర్రింద నుంచుకొన్న ప్రభుత్వమువారు మట్టుకు అట్టి ప్రదేశమును బంటచేలకై యొసంగుట శోచనీయాంశము. విజయనగరపట్టణప్రదేశమందలి పొలములనుండి వచ్చు శిస్తు లేకున్నమాత్రమున బ్రభుత్వపుఖర్చు జరుగదా? ఇంత మహా భూఖండములో నాచిన్నముక్క కొన్నివేల రూపాయలశిస్తును దెచ్చిననేమి తేకుండిననేమి? అట్లిచ్చునపుడు విజయనగరాభిమానముగల దేశభక్తు లేమనుకొందురో యని వారు యోజింపవలదా? అభిమానము, దేశభక్తి దడవనేల? పూర్వపట్టణపర్యటనమున కీవ్యవసాయ మభ్యంతర మనియైన గమనింపవలదా? అది మార్గనిరోధము గావించునని యైన గుర్తించవలదా? అంతేగాక పూర్వపట్టణాకారమును భావనాబలముతో మనస్సులలో జిత్రించుకొననెంచిన యాత్రికులకు, ఈ వ్యవసాయ మడ్డమురాదా? ఆచిత్రములో బొలములు పంటలు నున్న నయ్యది మరింత పసందుగ నుండుననియెంచిరనుకొందమా? అట్టి స్థలముల బరీక్షించుటకు వానిని సంరక్షించుటకు బ్రభుత్వములో నొకశాఖ యేర్పడియున్నదే! ఆశాఖాధికారులకైన నీ విషయమై తోచి తగినకృషి సల్పి దీని నాపించలేరా?" యని యనేకపర్యాయము లనుకొని

చింతించితిమి. "వారికి వాహనము లున్నవికదా, ఆవాహనము లు రోడ్లమీద నేగునుగదా, వానిగమనమున కీవ్యవసాయము నిరోధము సేయదుకదా, మనయరణ్యరోదనము నెవ రాలకింతురు" అని సమాధానము చెప్పికొంటిమి.

ఈకాల్వలచిత్రము పంపాసరోవరముకడ నటనుండి యానెగొంది కేగుమార్గమునగూడ మనకు గనబడుచున్నది. అవికూడ తుంగభద్రకాల్వలే. వానిపాయలు పూర్వ మానెగొందికోటలోని కేగినది లేనిది యిప్పుడు చెప్పలేము. ఆనెగొంది పరిసరముల నున్నభూముల వ్యవసాయమునకు గావలసిన నీరము నాకాల్వలు నేడు సంతన సేయుచున్నవి. ఏటి కుత్తరమున నూరివారి వాడుకనీటిప్రసక్తిలేదు: దానికికారణ ముత్తరమున బట్టణమే లేదు.

రాచనగరులోనితోటలకు, జలక్రీడామందిరములకు, వాడుకకు, గావలసిన నీరము నొకబావినుండి మోటతోత్రోలించి తెప్పించుకొనిరని యిదివరకే చెప్పుచు, నానీరమును దెచ్చిన జలమార్గమును మీకు చూపియున్నాము. దానికి నీటి సదుపాయము ప్రత్యేకించి యమర్చుటకు ఆనీర ముమ్మడిగ నున్న శాత్రవులు పట్టణమును ముట్టడించినపుడు విధివశమున వారానకట్ట నాక్రమించుకొనిరేని, యూరివారితోబాటు రాచవారినిగూడ, నీరరికట్టించి వేధింతురనుభయ మేకారణమై యుండనోపు నని చెప్పియుంటిమి. అంతేగాని రాజనగరప్రదేశము ఆనకట్టకన్న నున్నతమై యుండులంబట్టి యానీర మెక్కదని యట్లు ప్రత్యేకించి యమర్చుకొని యుండరు. అంతంత

చిత్రములైన పనులు చేసికొన్న ప్రభువులు, తుంగభద్రా నీర మును, వారికి గావలసినదానిని, నేదియో యొకజలాశయములో నికి బారించి దానినుండి యేతములతోనో మోటలతోనో తో డించుకొని రప్పించుకొనియుందురు. ధోరణిచూడ మేము పై జెప్పిన కారణముచే బ్రత్యేకించి సదుపాయమును జేసికొనినట్లు కాన్పించుచున్నది. ఇక చక్రవర్తుల వాడుకనీరము తుంగ భద్రదికాని, యాబావిదికాని కాదని, కొన్ని బావులనుండి యనుదినము నీళ్లుచేసిన బిందెలలో దెచ్చుచుండిరని చెప్పి యున్నాము. దీనికి శ్రీకృష్ణరాయలకాలములో నాపుర మును జూచిన పోర్చుగీసుప్రయాణికునివ్రాతయే యాధారము. ఆబావు లెందుండినది యాయన మనకు దెలియునట్లు వ్రాయ లేదు. మరెవరును నాబావుల ముచ్చటనే యెత్తలేదు. అందు వలన మన కాస్థలనిర్ణయ మసంభవమైనది.

'ఆనీర మెట్లుండును' అని మీలో గొందరకు దోచవచ్చు ను. కృష్ణవేణీనదీనీరము నెరిగినవారి కానీర మెట్లుండినది చెప్ప నక్కరలేదు. ఆనదీనీరములో రెండుపాళ్లాయుపనది సమ కూర్చునదే. ఆనీరు త్రాగిన జలిజ్వరము వచ్చునని కొందరను మానింతురు. అది వట్టిపిచ్చియూహ. చలిజ్వరము నీరను వలన రాదు. దాని విషయమై యిప్పుడే ప్రసంగింతము. ప్రస్తుత మాయుదకము పూర్వవిజయనగరమాహాత్మ్యమువలె నతిరసవంతమైనదని చెప్పి యింతటితో నీజలమార్గప్రశంసను గట్టిపెట్టుదము.

ఇక నాయూరిలోని గాలి యెట్లుండు ననువిషయము, కొండగాడ్పు లెట్లుండునో యెఱుగని మనవంటి సముద్రతీర వాసు లొకింత చర్చింపవలసిన యంశమే. అచ్చట గాలి లోప మెన్నడు నుండదు. ఏకాలముననైన నందు స్వేదో దయమగుట దుర్లభము. అచ్చటివారు తీరవాసులకన్న నెక్కువ కృషిచేసినగాని వారికి జీవనోపాధియే జరుగదు. అట్టిచో వారికి స్వేదోదయమై యలపు జనించిన నాకృషి కభ్యంతర మగునని యెంచి భగవంతు డద్దాని వారించెనా యనిన ట్లుండును. వారికేగాక మనకుగూడ నెంతోకష్ట ము చేసినగాని యచ్చట చెమటపట్టదు. మేము వేసవిలో - నందు లో నుండు వేసవిలో - రోహిణీకార్తిలో - నాయూర సంచరించి యుంటిమి. కొంత నడచినమీద నొకింత చిరుచెమ్మట క్రమ్మి నను, లోయను విడిచి పర్వతశిఖరమును సమీపించుకొలది, యెటనుండివచ్చునో, నంతయెండలో, జల్లనిపిల్లతెమ్మెర వచ్చి యాస్వేదమును హరించును. గ్రీష్మములోగూడ రాత్రులు పల్చని వలిపంబునైన గప్పించెడు చలి యుండును. మిగిలిన ఋతువులు ముదురుకొలది, యాచలి ముదిరి, పోనుబోను నోరు దెరచుటకు గష్టమై, యొకప్పుడు, గుంపటి మెడనున్న బాగుండుగదా యనిపించును. బహుశః యింతవిపరీతపు జలి యనాథమైన ప్రస్తుతశిథిలపట్టణమున, భూజలతాపరి వృద్ధిచే, నందం దివకవడియున్న నేలపట్టుల చెమ్మను నాచి కొని వీచు చల్లగాడ్పులచే నొనగూడియుండును. పట్టణము సజీవమైనపు డిది యొకింత తగ్గియుండును; గాని, మొత్త

మునకు మనకన్న యందలివార లెన్నడైన చలి యెక్కువ యని యెంచగలరు.

ఆగాలిలో మరొక విశేషము. లోయలసంగతి వదలి మెరకల నొకింత దడవిచూతము. నడువేసవిలో గూడ నెడతెగని తెమ్మెరలు రేలెల్ల వీచుచుండును. ఓరుగాలిమట్టుకు గాదు. కొంతబలీయమై, కొంతతగ్గి, మరల కొంతబలీయమై, మరల దగ్గుచు నీవిధమున రాత్రియంతయు వీచుచుండును. ఈసందర్భమున మాకొక సరసమైన యనుభవము కలిగినది. దానిని చదువరుల కెరిగింప నెంచితిమి. మనుచరిత్రమును చదువనారంభించినప్పటినుండి

శా॥ వాలారుంగొనగోళ్ళ, నీ వలసతన్ వాయించుచో, నాటకున్
మేళంబైన విపంచి, నిన్న మొదలున్ నీ వంటమింజేసి, యా
యాలాపంబె యవేళఁ, బల్కెడుఁ బ్రభాతాయాతవాతాహతా
లోలస్తంత్రిల, మేళవింపఁ గదవే, లోలాక్షి! దేశాక్షికిన్.

అను పద్యమందు వరూథినీవిరహదశావర్ణనాసందర్భమున, నామె చెలికత్తె "ఓ చెలీ! నిన్న మధ్యాహ్నము నాటరాగమునకు నీవు మేళవించినవీణెను, విరహబాధచేత తిరుగ సవరింపకపోతివి. దానినట్లే వ్రేలగట్టితివి. ఆతంత్రు లిప్పుడు, తెల్లవారుజామున వీచు తెమ్మెరలచే మ్రోగుచు, నాటరాగమునే యాలపించుచున్నవి! ఆరాగ ముదయమున బాడదగినది కాదుకదా? వెంటనే వీణియ నందుకొని యీసమయమున కనువగు దేశాక్షి రాగమునకు మేళవింపవే," యని వేడుకొనునపుడు, పెద్దనగారిసంగీతశాస్త్రజ్ఞానమున కెంత యానందిం

చినను,మాకు "కవిత్వమన్న నిదియే కదా! 'అతిశయోక్తులు కవనమున జెల్లునని యాయన మనఃమరాలి మగడన్న మాటకు సరితూగునట్లు, తాతగారిందు వర్ణించినారు కాని, వీణాతంత్రులు గాలిచే గుమ్ముగుమ్మని మ్రోగిన మ్రోగుగాక, యవి రాగము నాలపించగల గాలి యెందైన వీచునా? అట్లయిన నది యోరుగాలి కాదా? అట్టిగాలి తెల్లనారుజామున వీచుచుండె నని చెప్పుట యావర్ణనాసందర్భమున నేమిసరసముగ నున్నది. కావున నాంధ్రకవితాపితామహుండు నిజసంగీతశాస్త్ర పాండిత్యప్రకటనమున గవిత్వౌచిత్యమును జెడగొట్టినా" డని యనుకొనుచుంటిమి. ఆసందర్భమును మిత్రులతో జర్చించినపుడెల్లదానిరసమును నాస్వాదించి యానందించుచు, నీసందేహమును బ్రకటించుచుంటిమి. వట్టిమిత్రులతోనేగాక, సంగీతపరిజ్ఞాన మున్నవారితోగూడ నీవిషయమై ముచ్చటించి చూచితిమి. ఒక్కరును దానినిజానిజములు మాకు నిర్ణయించి చెప్పియుండరైరి. అట్టియెడ, నేటికి పదుమూడు సంవత్సరముల నాటి వేసవికాలములో నొక్కమిత్రునితోగూడ విజయనగర యాత్రను జేసియుంటిమి. ఆయాత్రలో మాకు భోజనసదుపాయ మొకింత దుర్లభమైనది. చేయునదిలేక శ్రీకోదండరామ స్వామివారి కైంకర్యమునకమరియున్న వైఖానసుని బ్రతిమాలి "తరువాత ప్రాయశ్చిత్తమును జేసికొందము. మిత్రుడు వైష్ణవుడే గదా వానికైనయాచార మమరినజాలు," ననుకొని యావసతి నందు గుదుర్చుకొని, మొదలిటిరేయి భోజనానంతరము బసచేయుచున్న విహూపాఠశాలయము జేరునప్పటికి, రాత్రి

పదిగంట లగుడు, ద్వారపాలురు తలుపులను మూసిరి. ఆరేయి ప్రక్కనున్న జైనాలయవితర్దికాతలము మా కాశ్రయమైలది. తెల్లవారువరకు నిదురపట్టక మేల్కొనియుంటిమి. నాటి తెల్లవారుజామున బైపద్యము జ్ఞప్తికి రా, నిదివర కనినట్లే యనుకొని యందలిభాగమగు

"........ప్రభాతాయాతవాతాహతా
లోలత్తంత్రిల........"

మరల మరల జదువుకొనుచుండగా, భోరున గొంతకాలము వీచి, యాగి, తిరుగ వీచుచున్న గాలిని గుర్తించి "తంత్రుల మ్రోగించి, యాగి, మరల మ్రోగింప నీ గాలికి శక్తిలేదా? గాలి తగ్గినవెంటనే మ్రోత నిలువదుకదా? కావున దంత్రి లాగకుండ మ్రోగుచుండిన నా రాగ మేల యాలాపము కాదు," అని సందేహించి మరింత పరీక్షింపగా "నిట్టి గాడ్పులు మన దేశమున వీవవు. ఆ యనుభవము మనకు లేక పితామహునికవిత్వమున కనౌచిత్యదోషము నంటగట్టితిమి. ఎంత యపరాధము చేసితిమి!" యనుకొని దిద్దుకొంటిమి. నాటనుండి మా విమర్శనాహంకారము ముందు వెనుకలరయ నారంభించినది.

అంత చక్కని నీరు, గాలి, చెట్లు, చేమలు, పూర్వ మా పట్టణమున కానందదాయకము లైనవి. నేడా ప్రదేశ మున జాడ్యదాయకము లైనవి, ఆకులలములతో మురిగిన గుంట లెల్లయెడల మిక్కుటములై, యా ప్రదేశమున శీత పైత్యపిశాచమున కత్యనుకూలమైన నివాసము నేర్పరచినవి.

ఆపిశాచమున కనుచరులగు మశకసంతానములు తండోపతండ
ములుగ దమసాధనసామగ్రితో సంచరించుచు, దట్టమైన
దుప్పటికూడ మచ్చలు పడునట్లు యాత్రికుల రక్తముల
బీల్చి, తమ విసముతో వారిని చలిజ్వరపీడితుల గావించి వేధిం
చుచున్నవి. ఆవిషబాధ మమ్ముల నిప్పటికిని వదలలేదు.
దానంజేసి దీనిని చదివి యీ యాత్రను జేయనెంచినవా
రల, కొకవారమునకు బయలుదేరుదు రనగా, గొంత క్వైనా
నారగించి, యందేగినపుడు కాగిన నీరమును ద్రాగుచు,
దోమతెరక్రింద శయనించుట మంచిదని మనవిచేయుచు
న్నాము. ఈదురవస్థ పూర్వపట్టణమున నుండియుండదు.
ఇప్పటికిని ప్రభుత్వమువా రొకింత యోజించి కృషిసల్పిన
దానిని నివారించునుపాయము వారికి తోచకపోదు. ఆవిష
యము పట్టవలసిన శాఖవారిగతి, యతిశోచనీయము. ప్రభు
త్వమువారి కితరములైన ఖర్చులన్నియు బోగా మిగిలిన దాని
లో నతిస్వల్పభాగము నాశిథిలనిర్మాణప్రభుత్వశాఖవారి కిచ్చు
చుందురు. అది వారి కానిర్మాణసంరక్షణమునకే సరిపోవు
చుండ, నీమహోపకారమును జేయుటకు వలయు ధనము
వారికి లభింపదు. అందువలన నేమి జరుగుచున్నదో చూడు
డు. వచ్చిన యాత్రికులలో, నూటికి తొంబదిమంది, చలి
జ్వరములతో బాధపడుచున్నారు. అందలిప్రజ లెట్లుండి రని
విచారింతురేని, చెప్పుటకు వీలులేని స్థితిలో నున్నా రనుటకు
దుఃఖమగుచున్నది. సౌందర్యవిశేష మాప్రదేశమును బహి
ష్కరించి చాలకాలమైనది. ఉన్నవారిలో లేజవ్వానులుఁగూడ

బింగళి సూరనార్యుడనినట్లు "భావజుడు వెళ్లిపోయిన పాడుమేడల" పగిది గాన్పించుచున్నారు. మిగిలినవారి సంగతి నెత్తేల!! అందరి మొగముల బేర్తకళ వేర్లాడుచున్నది. దాని కారోగమే కారణము. ఆప్రదేశమున జిరస్థాయిగ నేర్పడియున్న యాశీతపైత్యపిశాచము, నెవ్వా రుచ్చాటనమంత్రములు చెప్పి లేవదీయుదురా, యామహోపకారమును జేసిన వారికొకయిందర్శిలావిగ్రహము చేసి, యందే నెలకొల్పి యాయూరి జూడబోయినపు డెల్ల బూజించుట మాబోటి యాత్రికుల కెన్నడు సంభవించునా, శీఘ్రకాలములో నీరెండుపనులు నెరవేరును గాక యని భగవంతుని ప్రార్థించుచున్నాము.

## 16 వ ప్ర క ర ణ ము

# ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

మనము ప్రారంభించిన కార్యము తుదిముట్టవచ్చినది. హైందవ జాతీయతాసంరక్షణమునకై శ్రీవిద్యారణ్యస్వామి వారిసంకల్పముచే బుట్టి, ఆంధ్రసార్వభౌమాధీశ్వరత్వమున బెరిగి, రామరాయదుర్గర్వవిజృంభణముచే నాశనమైన విజయనగరమహాపట్టణము, నెల్లెడల జూచి, దానికి సంబంధించిన యావద్విషయములను దెలిసికొంటిమి. కాని, హిందూదేశ చరిత్రములో విజయనగరసామ్రాజ్యమున కెటువంటి స్థానము నొసంగవలె నను ప్రశ్న నింకను విచారించియుండలేదు. ఇది, న్యాయమున, కాసామ్రాజ్యచరిత్రమును వ్రాయుసంద

ర్భమున జర్చించవలసిన విషయము. అయినను, నాపట్టణ
మును దర్శింపబోవు యాత్రికుల కిది రాజధానియైన సామ్రా
జ్య మిట్టిది, యిట్టిఘనకార్యమును గావించినది, యని గుర్తిం
చుట దానిపై వారికిగలుగబోవు నభిమానము నభివృద్ధి సేయుట
కొకమార్గ మగుట, దానిని విచారింప సాహసించితిమి

మొట్టమొదట నా సామ్రాజ్యము జాతీయతాసంరక్ష
ణముతో గాలక్షేపము చేసినది కాని, జాతీయతాభివృద్ధిలో
బాల్గొనియుండలే దని గుర్తింపవలయును. వేదయుగము
మొదలుకొని సూత్రయుగమువరకు, భరతఖండమున విల
సిల్లిన సామ్రాజ్యముల కాలములోవలె, విజయనగరసామ్రా
జ్యకాలమున, శ్రౌతస్మార్తాచారోన్నమ మెప్పుడును జరిగి
యుండలేదు. విజయనగర సామ్రాజ్యము, గుప్తవర్ధమాన
సామ్రాజ్యముల వంటిదికాని, మౌర్యాంధ్రసామ్రాజ్యముల
వంటిది కాదు. అనగా నున్నదానిని కాపాడుకొన్నది కాని,
క్రొత్తదానిని సంపాదించి పెట్టలేదు. ఆ సామ్రాజ్యము జరి
గిన దినములలో నీ యీ క్రొత్తలు మన మతమునగాని,
మన జాతీయభావమునగాని కలిగినవని వేర్పఱమడిచి చెప్పుట
కవకాశము లేదు. అప్పటికే శంకర రామానుజాది గురుప్ర
కృతమై యుండిన పౌరాణికహిందూమతమునకు, సర్వమత
విరోధులును, బరమతవిధ్వంసమునకు గంకణము గట్టుకొన్న
వారును, నగు, మహమ్మదీయులవలన నెట్టి యాపదయు
లేకుండ గాపాడినది.

ఆసంరక్షణ మేసాధనములతో నొనర్చినదోయీగ్రంథములో నిదివరకే చెప్పియున్నాము. అట్టి సంరక్షణమును మన దేశములో నిదివర కెవ్వరును సేయలేదా ? చేసియుండిన విజయనగరమువా రంతకన్న నెక్కుడుగ జేసిరా, తక్కువగ జేసిరా ? యను విషయములను జర్చించినగాని యీ సామ్రాజ్యము చేసిన యుపకార మెటువంటిదో మనకు పూర్తిగ దెలియదు. అది తెలియనిదే దాని చరిత్రస్థాన నిర్ణయము సేయజాలము. ఇంతకుముందు విజయనగరసామ్రాజ్యమును గుప్తవర్ధమాన సామ్రాజ్యములతో బోల్చియున్నాము. గుప్త సామ్రాజ్యము, శాక్యశాత్రవవర్గంబులతో బోరుచు సమసిన యాంధ్రసామ్రాజ్యకథ నెత్తుకొని, యీ శాత్రవుల మర్దించి, వారల మనలో గలిపివేసి విక్రమించి తుదకు హూణులబాధ పడలేక పడిపోయినది. ఆ సామ్రాజ్య మంతరించగనే చెలరేగి యుత్తరహిందూస్థానము నెల్ల రక్తప్లుతముచేసిన హూణపరాక్రమమును దాకి యణచి మరల నొకమహాసామ్రాజ్యమును గట్టి, వర్ధమాన సామ్రాజ్యము విలసిల్లినది. ఆరెండురాజ్యము లెవ్వరితో బోరినది యొక్కింత విచారింతము. శాక్యులను, హూణులను, ఆటవికులనవచ్చును. వారు నాగరకతాశూన్యులు. అసలీజాతులవారికి, కేవలావయవసంపూర్ణతలోదప్ప,నితరవిషయములలోమానవ లక్షణము పట్టినదా యని సందేహింపవలసినవారు. వారివర్ణనల జదివినపుడెల్ల నాగరకుల కొడలు జలదరించి, కొన్నిపర్యాయములు మాటలతో జెప్పరాని యసహ్యతాలక్షణము

పొడసూపకపోదు. అట్టివారికి భగవంతుడు, తనసృష్టివై చిత్ర్యములో నిది యొకయంగమని మనము భావించునట్లు, అపరిమితబలశౌర్యములను గటాక్షించెను. మహాబలిష్ఠము లై దురాగ్రహపూరితమతులై, గలల వాంచి, క్రమమ్మెజర తెంచు గమిడిదున్నలమందలవలె వారు లక్షలకొలది వచ్చి, యెన్నిశ తాబ్దములనుండియో దేశములోనడుచుచున్న శాంతితో దుర్బ లులై సుకుమారులై యున్న, భారతీయులపై బడి, వారిగ్రామ ములగాల్చుచు, నాడువారిని జెరబెట్టుచు, నపూర్వశిల్పసంశో భితములగుపట్టణముల నేలమట్టము సేయుచు, మహాప్రళయ మప్పుడేసంభవించెనాయని బుద్ధిమంతు లెంచునట్లు ప్రవర్తించు చుండిరి. వారిశౌర్య మెట్టిదైనను, వారిబల మంతయు వారి యసంఖ్యాకసమూహములపై నాధారపడియుండెను. తగినబల సన్నాహముచేసి, యొకింత యుక్తితో బోరగల యోధుడు వారి నెదురించినపక్షమున, వారిబీర మతిత్వరలో నిస్సారము గాకపోదు. అట్టిశక్తిగల గుప్తచక్రవర్తులు, హర్షవర్ధమానుడు వారి నవలీలగ నోడించిరి. మనదేశమున వారి నందందు నిల్పిరి. వారికి మనమతె మొసంగిరి. కొన్నిచోట్ల వారిని ద్వితీయవర్ణ మగు క్షత్త్రియులలో గలిపిరి. ఈమార్పుతో, నొకటి రెండు తరములలో, వారు నాగరకులు, భరతదేశీయులు నైరి. చెట్ల పైనెక్కి, పరుగిడుచున్న గమిడిదున్నల కావృక్షమున దిటవు పైనగొమ్మలకు గట్టియుంచిన నుచ్చులను మెడలలో దగిలించి, వానిని కట్టి, కొట్టి, మచ్చిక చేసుకొనిన ట్లయినది! కేవలబుద్ధి బలమున శాక్యహూణభుజాబలసంఘబలములను ధ్వంసము

చేసి, గుప్తవర్ధమానచక్రివర్తులార్యమతధర్మముల రక్షిం చిరి.

ఇక విజయనగరసామ్రాజ్య మెట్టివారి నెదర్చెనో చూతము. వారు మహమ్మదీయులు. మహమ్మదీయులు, ఆటవికులు అనాగరకులు గారు. నాగరకతాతత్త్వము భేదించెనేగాని, వారు గూడ మహానాగరకతాసంశోభితులే. మన కవసరమగు యుద్ధ విషయమున వారు విజయనగరము వారికన్న నేడాకు లెక్కువ చదివియుండిరి. హిందువులకన్న నెక్కువబలవంతులు. సైన్య సన్నాహప్రకరణమున మనకన్న నెక్కువ కుశలులు. మనమతమును విధ్వంసముచేసి యాత్మమతమును స్థాపింపవలెనన్న యుద్రేకముతో బోరవచ్చినవారు: ఏ కారణముచేతనైన నప్పుడప్పుడు తమలో దాము పోరాడినను, అవసరమగునపు డెల్ల నందరు నేకమై పోరనేర్చినవారు. అట్టివారి ధాటి నాగుట శాక్యహూణధాటి నాగుటవంటిది కాదు. శాక్యహూణుల నాగుటకు బుద్ధిబలము చాలును. వీరి నాగుటకన్ని బలములు నుండవలె. ముఖ్యముగ సంఘీభావ ముండవలె.

కాబట్టి 'హరిః ఓం' అని మనజాతి నిల్వనేర్చిననాట నుండి మన కేదిలేదో, యదియే యుండవలెనని తేలినది. అదిలేక యేమైనదో చూడుడు! రాజపుత్రవీరులు బలశౌర్యములలో లోకమున నేయోధులకు దీసిపోవువారు కారు. అట్టివా రుత్తర హిందూస్థానమున, మహమ్మదీయుల నెట్లు నిరోధించిరో, యొకింత బరిశీలింతము. అరబ్బీవారు క్రీ. శ. 710 సంవత్సరమున వచ్చి తాకిరి. వారితో నొకప్పు డొక్కరు, నింకొకప్పుడు

మరొకరు పోరిరేగాని, యందరు నేకమై యొకప్పుడును బోర రైరి. అప్పటికిని, అసాధారణ బలపరాక్రమములతో బెనగులాడి, వారిని మూడువందలసంవత్సరములవరకు నారవల్లీపర్వతములను దాటనీకుండజేసిరి. తరువాత, గజినీమహమ్మదు, ఘోరీమహమ్మదు, వచ్చినపు డేమాయెనో చూడుడు! కొన్నిసారు లారాజపుత్రు లేకమైనను, వారిలో గొందరు కొన్నిపర్యాయము లామహమ్మదీయయోధుల బురికొల్పి హైందవప్రభువులపై బడునట్లు చేయుచుండిరి. పృథ్వీరాజు ఘోరీమహమ్మదుతో రణముసేయుపట్ల జయచంద్రుడా యుద్ధముతో దనకు బనిసక్తిలేనట్లు మిన్నకుండె. తరువాత నామహమ్మదీయధాటికి దానుగూడ నీటగలిసె.

ఉత్తరహిందూస్థానమున నట్లుండ, నిక దక్షిణహిందూస్థానము విషయము చెప్పనక్కరలేదు. ఎల్లపుడు నచ్చటికన్న నిచ్చట పరిస్థితు లెక్కుడువిషమములు. అచటికన్న నిచట భేదకారణము లధికములు. అచ్చట నవి యెట్లున్నను, శత్రుభయముచే నప్పుడప్పు డేకమగుట కందలివా రలవాటు పడియుండిరి. పయిగా, గొన్నివందలసంవత్సరములనుండి శాత్రవులగు మహమ్మదీయులతో గొట్లాడుచుండిరి. ఆ కొట్లాటవలన దాక్షిణాత్యులకు దేశశాత్రవులవలన బాధ తగ్గియుండెను. ఇం దందుమూలముగ నేర్పడిన శాంతితో మతభేదములు, స్వార్థపరత్వము బలిసియుండెను. అవి యెంతవరకు ప్రబలె ననగా, నతి సమీపముననున్న దేవగిరివారిపై మహమ్మదీయు లెత్తివచ్చినపుడు, రేపు మన గతి యేమో

యని మైన మెంచి యాంధ్రరాజులు వారికి దోడ్పడబోకుం డిరి. కావున, దక్షిణదేశమున "ఎవరికి వారే" సిద్ధాంతము వేళ్ళుబ్రాకి, నాటుకొని యుండెను.

అట్టి భూమిలో విజయనగరసామ్రాజ్యమును స్థాపించిరి. నాటివారిలో ననేకులకు విద్యారణ్యుని యాదర్శ మర్థమే కాదనుటలో నతిశయోక్తి యెంతమాత్ర ముండదు. అది కనిపెట్టిరయే, యా రాజులు, మిగిలినవారి ననగదొక్కి సామ్రాజ్యమును స్థాపించుటకన్న మహమ్మదీయాపదను వాపు కొనుట కింకొక సాధనము లేదని గుర్తించి, యా కార్య మును సాధించిరి. సాధించిన నేమి సార్థకము? అప్పుడే తల యెత్త నారంభించిన గజపతులసామ్రాజ్యము, కొంత కాలము వరకు నభ్యంతరము కల్పించెను. ఆ యభ్యంతరము కృష్ణరాయ దిగ్విజయముతో వదల్చుకొనిన తరువాతనే, విజయనగరసామ్రాజ్యమునకు బరిపూర్ణజయము తటస్థించినది. ఏమైనను సామ్రాజ్యస్థాపనమునగాని నిజాదర్శమును నెర వేర్చుకొన లేకపోయిరి. ఆ పనిచేసి, దాక్షిణాత్యశక్తిసామర్థ్య ముల నొక్కయెడ బోగుచేసి, మహమ్మదీయధాటి నాగు టకు గావలసిన నైకమత్యబలమును 'బలవంత బ్రాహ్మణా ర్థము' వలె సమకూర్చుకొని, కృషిసల్పిరి. ఆ కార్యము మన మనుకొనినంత సులభకార్యము కాదు. కలియనివారిని గలిపి, అందర నేకరూపుచేసి, లేని నైకమత్యమును దెచ్చిపెట్టుకొని, పోరాడు టన్న నెట్టిదో, యట్టిపని నొకచిన్నగ్రామములో నెవడైన జేయ సాహసించిన నతనికి విశదము గాకపోదు.

అందులో నీ వైకమత్యమువలన నిట్టి లాభము లున్నవని గమనించలేని మూఢులను "మీరు మాతో గలిసి మీ ప్రాణముల గోల్పోవ నియ్యకొనరేని మీ మేమేమి చేయుదుమో చూడు"డని బెదరించి సంఘీభావము నేర్పరచుకొనుట యసాధ్యకార్యములలో నసాధ్యమైనది. అట్టి యసాధ్య కార్యమును నిర్వహించి దానిని రెండువందల యిరువది తొమ్మిది సంవత్సరములు జయప్రదముగ నెరవేర్చుటే, విజయనగరమువారు చేసిన మహాకార్యము! వారి గొప్ప దానిలోనే యున్నది!

మహమ్మదీయుల నాగుటకు గావలసిన యితరబలములను గూడ నట్లే కృషిచేసి సంపాదించిరి. విజయనగరసామ్రాజ్య మేర్పడునాటికి యుద్ధయంత్రము లుండెనుగాని, యవి పురాతనములు. భామినీరాజ్యము బ్రద్దలుకాబోవు కాలములో తుపాకి మందు, ఫిరంగులు, లోకములో వెలసినవి. యుద్ధముల కత్యుపయోగములగు సాధనములు గనుక, వాయువేగముతో బ్రయాణముచేసి, పాశ్చాత్యదేశములనుండి మన దేశమున బ్రవేశించినవి. బలిష్ఠమైనయొక్క ఫిరంగి, కొన్ని వందలమందికి జవాబుచెప్పగల దను రహస్యము నవలీలగ గ్రహించి, భరతదేశ రాజులు, వాని నెట్లో సంతరించుకొని, యుద్ధములలో జయము లందుచుండిరి. ఆరహస్యమును విజయనగరమువారు గమనించకపోలేదు. అంతకుముందు వెలసియున్న మరొక యుద్ధ రహస్యమును గనుగొని యవలంబించిన వారి, కీర్తిరహస్యముమట్టు కెందులకు గోచరము కాదు? పూర్వపు టాశ్వీక

సైనికులు, కత్తులతో, కఠారులతో, బల్లెములతోనే పోర
నేర్చియుండిరి. మనదేశమున విలువిద్యానైపుణ్య మనస్య
సామాన్యముగ నుండియుండినను, ఆవిద్య, నాశ్వికశిక్షతో
గలిపి, ఆశ్వికులు గుఱ్ఱములు పరుగెత్తునపు డమ్ముల నేయుట
నేర్చికొనునట్లు చేసియుండలేదు. మహమ్మదీయు లట్టి యా
శ్వికాంగముతో నవలీలగ జయమొందుట గమనించి, రెండవ
దేవరాయలు, రాజ్యమునకు రాగానే, యా రణశిక్షలో మనవా
రారితేరువరకును, దనసైన్యములో, మహమ్మదీయాశ్వికధాను
ష్కుల గొంతమందిని నియమించెను. వారు హిందూభూవిభు
నకు సలాముచేయ నిచ్ఛగించరని యెరింగి, పాప మాభూపుడు,
తనకు యుద్ధములలో జయమే ప్రధానమని తలచి, తన రాజ
సమునుగూడ మరచి, తన సింహాసనముప్రక్క నొక్కపీఠము
పై వారి 'ఖొరాను' నుంచి, వారిచే దానికి సలాముకొట్టించి,
యది తనకు జెందిన ట్లన్వయించుకొనుచుండెను. కావున ఆశ్వి
కధానుష్కరహస్యము నెరిగి దాని నెట్లోసాధించినవా, రిటీ
వల బయలుదేరిన శతఘ్నిరహస్యమును గుర్తించకపోరు.
గుర్తించి దానిని సాధించుటకు గొన్ని రాయబారములు జరి
పి, యప్పుడే వచ్చి మనదేశ పశ్చిమతీరమున గిడ్డంగులు గట్టు
కొనియున్న పోర్చుగీసువర్తకుల కాత్మ సామ్రాజ్యములో
గొన్ని వ్యాపారసదుపాయములు చేసి, వారివలన నాశతఘ్ని
బలమును సంపాదించిరి. ఆబలసంపాదన శ్రీకృష్ణదేవరాయల
నాటికి పూర్తియైనది. నాటి సర్వతోముఖవిజయమున
కాశతఘ్ను లపరిమితముగ దోడ్పడినవి.

అంతచేసినవా రొక్క విషయమున మట్టుకు మనము కొని యాడదగినకృషి చేసియుండలేదు. భారతయుద్ధశాస్త్రమున సైన్యసన్నాహాంగము నొకింత మార్చిరేగాని, కాలానుగుణ్యముగ గావలసినంత మార్చరైరి. ఈ విషయము క్లిష్టమైనది కావున, గొంచెము విపులముగా బరిశీలించవలయును. యుద్ధములలో జయ మన్నిపరికరములమీద నెంత యాధారపడియున్నను, సైన్యసన్నాహముపై నాధారపడియున్నంత యితర విషయములపై నుండదు. యోధానుయోధులును, జగద్విఖ్యాతకీర్తులును నగు సేనాధిపతు, లల్పసంఖ్యాకములగు సైన్యములతో, బహుళసంఖ్యాకములగు శాత్రవసైన్యముల నా సన్నాహలక్షణముతో నవలీలగ గెల్చియున్నారు. అలెగ్జాండరు, నెపోలియను, మొదలగు మహాయోధుల చరిత్రలలో మనకు దెలియవచ్చు మహారహస్య మిదియే. అలెగ్జాండరు కేవల యుద్ధస్థలనిర్ణయముతో జయముల నొందెడివాడు. పారసీకులకు నాయనకు మహాయుద్ధము జరుగబోవుచుండె. ఉదయమైనను నలెగ్జాండరు గుడారమును వదలి రాడయ్యె. ఆ మధ్య పారసీకభూమీందుౖ, డాత్మసైన్యముల, బహుళసంఖ్యాకములగువానిని, మోహరించుచుండె. అప్పుడలెగ్జాండరు సేనానులువచ్చి, "స్వామీ ? బయలికి రానాలసించుచుంటిరి. శాత్రవులు సన్నహించుచుండిరి," యని వేగిరపడ జొచ్చిరి. దానికి ఫక్కున నవ్వి యా మహాసేనాని "సేనాధిపులారా! భయపడకుడు. నేను గావించిన స్థలనిర్ణయమాహాత్మ్యము మీకు యుద్ధ మారంభమైనగాని

విశదము కాదు," అని చెప్పెను. అప్పు డక్లే యైనది. పార
సీకు లెంతతిప్పలు వడినను, యవనసేనను సమీపించుట
దుర్ఘటమయ్యె. యవనులు వచ్చి తాకినంతమాత్రమున
బారసీకులు తా మున్న స్థలమును గాపాడుకొనలేక వెనుక
కొదుగజొచ్చిరి.

నెపోలియన్ చరిత్రములోగూడ నట్టివిచిత్రమే కాన్పించు
చున్నది. ఆ మహాయోధుని ధైర్యమెట్టిదో, యుద్ధము ప్రా
రంభముగాకమునుపే, యాత్మబలములో గొంతభాగమును
జీలదీసి,దూరగమనమున శాత్రవసైన్యమునకు బిఱిందిదెస కేగు
నట్లు నియమించుచుండెను. వా రందేగి మోహరించి యుందు
రని తోచినతోడనే, రణమును ప్రారంభించి, యెదిరినసేనల
నోడించి, వెనుకకు వెనుకనున్న తనసైన్యభాగమువైపు దరిమి,
వారిచేగూడ నపజయమొందునట్లు కావించి, వెంటనే శస్త్ర
సన్యాసము చేయున ట్లొనరించుచుండెను. ఈవిపరీతమును స్థల
నిర్ణయముతో, మోహరచమత్కారముతో, శతఘ్నికావేశ
ముతో, గల్పించుచుండెడువాడు. అవియన్నియు నాయన
కొరులుగరపినట్టివికావు. ఆసందర్భమున నొకప్పు డాయన
యొకమాట ననియున్నాడు. ఆస్ట్రియా సేనాధిపతి కెదురుగ
నొకసారి తనబలమును మోహరింపబంచుచు, దనక్రింది
యోధులతో "సేనానులారా! నే డాయాస్ట్రియాసేనాధిపతి
తానునేర్చుకొన్న యుద్ధశాస్త్రమును జింపివేయగలడు" అని
పలికెను. ఆసేనాధిపతి యక్లే నెపోలియన్ గావించిన వింత మొ
గ్గరమును జూచి విభ్రాంతుడై కాళ్లకు బుద్ధిచెప్పెను.

భారతదేశ సంజాతులవంటి మేధావంతులు భూమండ లమున లేరన్న కీర్తి యిప్పటికిని విశ్రుతమే. అయిన నది యితర విషయములలో సరిపోవుచున్నది కాని, యుద్ధవిషయములో, కేవలబలశౌర్యప్రకటనముతో నాగియున్నది. తమబుద్ధిబల మునంతయు వేదాంతాదిశాస్త్రములపై నేకాగ్రము చేసి, మనవారు కేవలహింసాపూర్ణములగు యుద్ధములపట్ల సుం తైన నిల్పరైరి. దానిఫలము మనము అలెగ్జాండరెత్తి వచ్చినప్పటినుండి, నేటివరకు ననుభవించు చుంటిమి. విజయ నగరమువారుకూడ నట్టి బొందనే పడి కొట్టుకొనిరి. వారి చారిత్రమును మే మెంతకాలమునుండి యెంత పరిశీలిం చినను, నీ సందర్భమున వారావంతయైన కృషిచేసియుం డలేదనే తేలుచున్నది. రథములకు బదు లాశ్వికధాను ష్కుల నెన్నినచో, చతురంగబలము వారి సైన్యములలో గలదు. కాని అలెగ్జాండరు, నెపోలియను లగుపర్చిన స్థలనిర్ణ యాది జ్ఞానమును, కాసంతయైన వారు కావించిన కొన్ని వందల యుద్ధములలో, నొక్కచోటనైన మాకు గాన్పించ లేదు. ఆ విషయములలో విజయనగరమువా రెంతమాత్రమును దమ బుద్ధిని జొనుపలేదన్నమాట నిశ్చయము. శ్రీకృష్ణరాయ లుమాత్ర మప్పుడప్పు డటువంటి యెత్తుల నెత్తి జయమును గాంచియున్నాడు. ఆ రహస్య మాయనతో నంతరించినది. అదికూడ యొక పద్ధతి ననుసరించి జరుగలేదు. తాత్కాలి కానుగుణ్యముగ నెందో మచ్చునకుం బలె జూపట్టునేగాని వేరుకాదు, అదిపినా, ముగిలిన వానిలో వారసమాన ప్రజ్ఞ

వంతు లనిపించుకొనిరి. వా రద్దానిలోగూడ గృషి సలిపి యున్న నాడు, తమ పట్టణమునకు రాకపోకలు సేయుచుండిన పోర్చుగీసువారివలన శతఘ్నులతోఁబా టాపాండిత్యమును గూడ నలవరచుకొన్న యెడల, వారు,లోకాధిపత్యము మాట మేము చెప్పజాలము గాని, భరతఖండాధిపత్యము కాకున్న చివరకు వింధ్యకు దక్షిణమున నున్న భరతఖండాధిపత్యమునైన నవలీలగ సంపాదించి యుందురు. ఇంతకు దేనికైన నవసరము కలుగవలె. అవసరమును మించిన యుపాధ్యాయుడు లోకములో నెవ్వడు లేడు. మహమ్మదీయుల కట్టి యుద్ధచమత్కార ముండియున్న విజయనగరమువా రేమిచేసియుందురో? రామరాయలమాట, తల్లికోటలోని లోపమును నటుండనిండు. అప్పుడు కల్గినయాపదను వారించుటకు గావలసిన చురుకుదన మాయనకు లేకుండిన నుండెనుగాక, ఆయనకు ముందుండినవారు, ఆయనగూడ, సావకాశ ముండినచో నరులచమత్కారము నాగుసాధనముల నెట్లయిన సంతరించుకొనకపోరు. నే డిందుండి చరిత్ర నంతయు బరిశీలనజేసి మనవారి కిదియొక గొప్ప లోపమని మన మనుచుంటిమి. అంతేగాని యిది లోపించినమాత్రమున విజయనగరమునారు కావించిన మహోపకార మెన్నదగినది కాదనుట లేదు.

కాదా చూడుడు. వా రెట్టి యుపకారమును జేసిరో యొకింత విచారింపుడు. దానితో విజయనగరసామ్రాజ్య చారిత్రకస్థలనిర్ణయము తేలకపోదు. అందులకై వారితో

బాటు మన దేశములో మహమ్మదీయుల నాప సమకట్టినవా రెవరో చూతము. వారు రాజపుత్రులు. ఆ కార్య నిర్వహణమున వారు మన చరిత్రలో నగ్రస్థానము నలంకరించియున్నారు. ఆ స్థానము వా రేరుకొని యలంకరించినది కాదు. వారికి హిందూదేశచరిత్రకారు లొసంగినది. ఆ విషయమున మన చారిత్రికు లొకింత ప్రమాదము చెందినారని మా మతము. అట్టి ప్రమాదమునకు మాకు దోచినంతవరకు రెండే కారణములు. మొదలిటిది చారిత్రికులు రాజపుత్రచరిత్ర నెరిగినంత విజయనగరచరిత్రము నెరుగరు. రెండవది ఆ చరిత్ర తెలిసినను, దెలియకున్నను విజయనగరము నెరవేర్చిన యుపకారము వా రెరుగనిది కాదు. అట్టియెడ నాయుపకారమును సేయుటకు దక్షిణదేశములందున్న గష్టనిష్ఠురములను వారు చక్కగ గమనించలేదు. రాజపుత్రులలో ప్రతిమానవుడును బలశౌర్యసంపన్నుడే. వారికి గావలసినంత నల్లమం దున్నచో, వారితోబాటు, ప్రాణత్యాగము వరకు రణముసేయు యోధు లీ లోకమున లేరనుమాట యతిశయోక్తి కాదు. అదియుంగాక, కొన్ని స్వల్పకారణములచేత వారి రాజులకు, తద్వారా వారి ప్రజలకు బరస్పరభేదములున్నను, అవసరమైనపుడు వారి కేకీభవించుట కున్నసదుపాయము లెవ్వారికిని లేవు. వా రంద రొకజాతివార మని పైకైనను జెప్పుకొనుచుందురు. వారి భాష యొకటి: మతమొకటి: ఆచారము లొక విధమైనవి. వా రున్నభూభాగముకూడ విజయనగరసామ్రాజ్యభూభాగమురీత్యా చిన్న

దియే. అట్టివారు, తగిన శ్లోకీభవించి వారలకు దేశకంటకులని తోచిన మహమ్మదీయుల బారద్రోలు ప్రయత్నములను గావించినవానికన్న వేయిమడుగు లధికములైనవి, కావించ లేదని వారి కృషి నాద్యంతము విమర్శించవలసియున్నది. అట్లు సేయక, నేటి కెవ్వరికిని యర్థముకాని మీావారువారు అరబ్బీవారితో బోరినపోరాటమును, జయచంద్రుని కలుపు కొనలేకుండ బృథ్వీరాజు ఘోరీమహమ్మదుతో బెనుగులాడిన పెనుగులాటలను, అంతయు ముగిసిన వెనుక, రాణాప్రతాపు డగుపించిన మార్గ్యమును మాదలించుకొని, అడుగడ్డునకు దారసిల్లుచుండిన రాజపుత్రియాటంకములతో ముందునకు నడక సాగక యాలసించిన మహమ్మదీయుల వెంబాటును బురస్కరించుకొని, 'రాజపుత్రులు మహమ్మదీయుల మూడు వందలసంవత్సరము లాగిరి'- యని వారికి దేశచరిత్రలో నగ్రస్థానము నొసంగుట చారిత్రికపరీక్ష కంత సమంజసమని మాకు తోచదు. అట్లయిన మూడువందలేం డ్లాగినవారు గజినీ మహమ్మదుధాక కేల నిల్వరైరి? ఊరువెంబడి నూరును, గుడివెంబడి గుడిని యాయన దోచుకొని పోవునపుడు, వీరే మైరి? మూడువందలయేండ్లు పోరాటతో నలసి సొలసి కత్తి నెత్తలేని దుర్బలులైరా? లేక "పోనిండు! పాప మిన్నివందల యేండ్లనుండి మన దేశములోని చిత్రముల జూడ నాశించు చుండిరి. లోనికి రాని త్తము. ఇదివరలో వచ్చిన శాక్యులు హూణులకన్న చెడిపోయిరా," యని మెంచి ఉత్తరహిందూ

స్థానద్వారమగు కురుక్షేత్రమును దెరచివేసి, లోనికి రండని
మహమ్మదీయుల నాహ్వానము చేసిరా ?

ఇట్లనుచుంటిమని మేము రాజపుత్రబలపరాక్రమము
లను జుల్కన సేయుటలేదు. వానిలో వా రద్వితీయులని యిది
వరకే చెప్పియుంటిమి. ఇంత సేపటినుండియు నట్టివా రేకీభ
వించి, యొరసికొని వచ్చుచున్న మహమ్మదీయతండ
ముల, వాయవ్యపు సరిహద్దున కానల బడున ట్లేల దోసి
వేయరైరని వాదించుచున్నాము. ఉత్తరహిందూస్థానమున
నైకమత్యసంస్థాపనము సేయుటకు వా రెట్టికృషిని గావించి
రని యడుగుచున్నాము. అట్టి కృషి నెప్పుడు సేయలేదని మేమే
ప్రత్యుత్తర మిచ్చుచున్నాము. అట్లు సేయక, దాయాదిచెడిన
మనకు మంచిదికదా యనుకొను మూర్ఖకుటుంబికునివలె
దన నెత్తిమీదికి వచ్చినపుడు ప్రాణంబులు త్యజించబోరాడు
స్వార్థపరునివలె సంగ్రామముచేసిన రాజపుత్రవీరునకు
దేశచరిత్రలో మహమ్మదీయనిరోధానసరమున నగ్రస్థాన
మొసంగుట, యట్టి కృషిని సల్పిన విజయనగరమువారిపట్ల
యధర్మ మొనరించుట యని నొక్కి చెప్పుచున్నాము.

ఇక విజయనగరమువా రేమిచేసిరో చూతము. దక్షిణ
దేశములలో సకలవిధభేదములు, నొకింత గిలిగింత పెట్టపలె
గాని, యేదుపందిముండ్లవలె బొడుచుకొనివచ్చుచుండును.
శీతోష్ణస్థితులవలనను, మతాచారములవలనను శాత్రవుల
వలనిభయము లేనందువలనను, ప్రజ లందరు బలశౌర్య
హీనులై యుండిరి, అసలు పిరికిపంద లనుటకు వీలులేదు కాని,

వారికి సంబంధించినవారై యుండిరి. శాత్రవపరాక్రమ మగుపించినంతనే పలాయమానులగువారు, ప్రథమ ద్వితీయ తృతీయ మహమ్మదీయ దండయాత్రలతో నడలిపోయి రేగుముక్కల తంగేళ్ళవలె ద్రొక్కికొని పారిపోవు భీరులై యుండిరి. "అటువంటి భేదమయమైన దేశమునకు మహావిపత్తు సంభవించె, నింకను సంభవింపనుండె. అట్టిచో కేవలపరాక్రమముతో నొక మహాసామ్రాజ్యము నేర్పరచి, యటువంటి భీరులను శూరులనుగ మార్చి, వారిసాహాయ్యముతో నా మహమ్మదీయధాకను విజయనగరమువారు రెండుంబాతిక శతాబ్దము లతులజయప్రదముగ నాపిరి." అని మే మనిసపుడు, "దాక్షిణాత్యులభీరుత్వమే విజయనగరము వారి తెచ్చికో లైకమత్యమునకు సాధనమాయెను. రాజపుత్రుల శౌర్యమే వారి వైకమత్యమునకు ప్రత్యవాయమాయె," నని యందురేమో! దాని కొక్క దండనోపాయమేగాక మిగిలిన యుపాయములు మూడు నేమాయెనని చెప్పి ప్రకృత మనుసరింతము. కాబట్టి ఐకమత్యముమాట నెత్తగూడని ప్రదేశములో, నెటువంటి దైననేమి, యొకవిధమైన ఐకమత్యమును గూర్చి జయప్రదముగ మహమ్మదీయుల నంతకాల మాగి పేరుగాంచినది, విజయనగరసామ్రాజ్యము. అట్లుగాక ప్రతిపదనిరోధము గావించి మహమ్మదీయుల నాగినది రాజపుత్రశౌర్యము. వీని రెంటిలో నగ్రస్థాననిర్ణయము దుర్లభమని మే మెరుగక పోలేదు. ఇట్టి విషయములలో నానిర్ణయమును గావించకుండుటే మంచిమార్గమని

మావాదము. చేయక తప్పదనెడుపట్ల, కావించిన కృషిని విమర్శించి నిజము వచింపవలసిన యెడల, సత్యమున కాస్థానమును విజయనగరమువారి కొసంగక తప్పదు గాక.

కావున మనమింతకాలమునుండి జూచుచుండిన పట్టణమట్టికృషికి ప్రథమసాధనము. అట్టికృషిని పూర్వమున జేసిన అయోధ్యాపాటలీపుత్రపట్టణములు, కన్యాకుబ్జస్థానేశ్వరములు నేడు పూర్వపుపోలిక లేకుండ మారిపోయియున్నవి. విజయనగర మట్లుకాక నిర్మానుష్యమైనను, గేదారభూయిష్ఠమైనను, శీతపైత్యజ్వరోపేతమైనను, నాలో నివసింపదగినవారు పూర్వపువారేగాని నేటివారు కారనుచుండినట్లు, మునుపటి శోభ శైథిల్యావస్థలోగూడ యాత్రికులభావనాబలమున కందునట్లు నిల్చియున్నది. ఆపట్టణయాత్రను జేసియైన మనయాంధ్రులు విద్యారణ్యస్వామివారి మహాదర్శమును గౌరవించి, ప్రకృతరసాభాసభేదభావముల గట్టిపెట్టి దేశక్షేమమునకై కృషిసల్పుదురు గాక యని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాము.

